The Largest Circulated Telugu Monthly

# చతుర

ఫిబ్రవరి 1987 రూ. 2-50



పదవ జన్మదిన సంచిక

## స్వేచ్ఛ

రూ.10,000/- బహుమతి పొందిన అత్యుత్తమ నవల



# అందాన్ని అందించడంప్రకృతి సహజం.
# అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.




ACIL/025/86-T

## కేమియో
బ్యూటీ సోప్

మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్తమలుపు ఇస్తుంది కేమియో

జయలక్ష్మీ వారి ఉత్పాదన

Cyan, Magenta, Yellow, Black, Sp. Col



# చతుర నవలల పోటీ ఫలితాలు

విశ్వకథావిపంచి 'విపుల', నవనవలా వేదిక 'చతుర' 1978 ఫిబ్రవరిలో జంటగా జన్మించాయి. 1987 ఫిబ్రవరిలో వెలువడుతున్న ఈ 10 వ జన్మదిన సంచికలు 109 వ సంచికలు.

ఈ రెండు పత్రికలూ కూడా తొలినుండి కథలు, నవలల ఎన్నికలో సాంఘిక బాధ్యతను దృష్టిలో ఉంచుకుంటున్నాయి. భావాలు పాఠకులను ముందుకే నడిపించేవీ, ఆలోచింపజేసేవిగా ఉన్న సందర్భాల్లో రచనాపరంగా లోపాలున్నా ప్రోత్సహిస్తూనే వున్నాం. సాధ్యమయినంతవరకూ లోపరహితంగా ఆయా రచనలను పాఠకులకు అందించడానికే ప్రయత్నించాం. గతకొద్ది సంవత్సరాలుగా మన సృజనాత్మక సాహిత్యం సాంఘికాభ్యుదయపరంగా వెనుకబడిందని అందరూ అంగీకరిస్తున్నారు. అందుకు కారణాలు అనేకం. ఈ పరిస్థితులలో పాఠకుల శ్రేయస్సు కోరే రచయితలు నిరుత్సాహంగా, నిస్తబ్దంగా ఉండిపోవటంలో ఆశ్చర్యంలేదు. వారికి ఉత్తేజం, ప్రోత్సాహం కలిగించి ఉత్తమ రచనలను పాఠకులకు అందించేలా చేయాలనే సంకల్పం కలిగింది విపుల, చతురలకు.

విపుల-చతుర 100 వ సంచికలు వెలువడుతున్న సందర్భంగా ఈ పోటీలు, బహుమతుల వివరాలను ప్రకటించాం. తెలుగు నవలలు, కథలకేగాక, అనేక భాషల కథల వేదికగా 'విపుల' తరపున ఇతర భాషలవారికి కూడా బహుమతులను ప్రకటించాం.

మా అంచనాలకు మించి 2110 కథలు, 357 నవలలూ పరిశీలనార్థం అందాయి.

మాకు అందిన ఏ ఒక్క రచనను చదవకుండా సాంకేతిక కారణాలవలన త్రిప్పి పంపివేయరాదనీ... ఇతివృత్తంలో కొత్తదనం ఉంటే రచనా శిల్పంలో లోపాలున్నా స్వీకరించవచ్చుననీ... ప్రతి ఒక్క రచనా కనీసం ఇద్దరు చదవాలనీ, ఆ తర్వాతనే జడ్జీలకు పంపాలనీ... నిర్ణయించుకున్నాం. వాస్తవంలో జడ్జీలకు అంతిమ నిర్ణయం కోసం పంపేలోగా ఆయా రచనలన్నీ ముగ్గురుచొప్పున చదివారు. ఈ చదివిన 30మందీ రచనల బాగోగుల గురించి నిర్దుష్టంగా అభిప్రాయం వెల్లడించగల ఉత్తమస్థాయి పాఠకులు, మేధావులే.

వీరు ఎన్నికచేసిన రచనలను తిరిగి ముగ్గురేసి చొప్పున జడ్జీలు పరిశీలించారు. నిర్ణయాలన్నీ ఏకగ్రీవంగా జరిగాయి. ఆ ఫలితాలివుడు మీ ముందున్నాయి. ఈ బహుమతి పొందిన రచనలన్నీ వరుసగా చతుర లో ఫిబ్రవరి 1987 సంచిక నుంచి ప్రచురిస్తున్నాం.

## బహుమతులు పొందిన నవలలు

ఒక అత్యుత్తమ నవలకు రు. 10,000/- బహుమతి : 1. స్వేచ్ఛ — ఓల్గా

ఒక ఉత్తమ నవలకు రు. 6,000/- బహుమతి : 2. అడవి — వసంతరావు దేశపాండే

ఒక మంచి నవలకు రు. 4,000/- బహుమతి : 3. బతుకు — యం.వి. తిరుపతయ్య

### *10* నవలలకు

ఒక్కొక్క నవలకు రు. 3,000/- చొప్పున ప్రత్యేక బహుమతులు

4. జైలు
   కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి
5. జీవితం చేజారనీయకు
   డి. కామేశ్వరి
6. గ్రహణం
   వక్కలంక పద్మావతి
7. గడ్డిపువ్వు
   భట్టిప్రోలు కృష్ణమూర్తి
8. రక్తంకార్చిన కాటుక కళ్ళు
   యం. విశ్వనాథ్
9. అరాజకీయం
   పాలకోడేటి సత్యనారాయణరావు
10. మోహనరాగం
    అక్కినేని కుటుంబరావు
11. ప్రమదావని
    పి.యస్.వి. ప్రసాద్
12. నిరీక్షణ
    పి. యస్. ఆర్. మూర్తి
13. దైవ ప్రతినిధులు
    యం. రమేష్

### న్యాయ నిర్ణేతలు

ప్రొఫెసర్ జి. హరగోపాల్
శ్రీమతి అరుణావ్యాస్
ప్రొఫెసర్ కేతు విశ్వనాథరెడ్డి



# ముగింపు నవలపై చతుర సమీక్షలు

**పాఠకులకు నెలనెలా ఆరు బహుమతులు**

డిసెంబరు '86 'చతుర' నవల 'ముగింపు' పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర సమీక్ష' లలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

'చతుర సమీక్ష''లో ఉత్సాహంగా పాల్గొంటున్న పాఠకులకు మరింత ప్రోత్సాహం కలిగించేందుకు ఇవుడు ఇస్తున్న రు: 100, రు: 75, రు: 50, ఉత్తమ సమీక్షా బహుమతులకు తోడుగా మరోమూడు రు: 25/-బహుమతులను ఈ జన్మదిన సంచిక నుండీ అందజేయదలచింది 'చతుర'. ఈవిధంగా నెలనెలా అరుగురు పాఠకుల్ని సత్కరిస్తుంది 'చతుర.' పాఠకులలో సమీక్షాదృష్టిని, వివేచనా, విచక్షణాభిరుచిని పెంచేందుకు ఉద్దేశించిన ఈ "చతుర సమీక్ష"ను పాఠకులు సద్వినియోగం చేసుకోగలరని ఆశిస్తున్నాం.

## ఇంపుగా లేని 'ముగింపు'

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

ఏ రచయితైనా తన నవలద్వారా ఏదో ఒక సందేశం ఇవ్వాలని ప్రయత్నించడం పరిపాటి. అలాగే నవల సమగ్ర స్వరూపాన్ని పాఠకుని దృక్పథంలో మెదిలించేది, కొనమెరుపునిచ్చేది ముగింపు! కాని ఇందుకు భిన్నంగా జరిగింది ఈ నవల ముగింపు. ఈ ముగింపు కోసం మధుకర్‌ను చంపనవసరంలేదు. ఇలాంటి సన్నివేశాలు ఈమధ్యవచ్చే నవలల్లో సర్వసాధారణమైపోయాయి. మధుకర్‌కు పెళ్లయిందని తెలిసికూడా సమీర అతనిని ప్రేమించడమేగాక తన సర్వస్వాన్ని అర్పిస్తుంది. అలాంటప్పుడు ఒకసారి శరత్ అడిగిన ప్రశ్నకు- "నా కారణంగా ఇంకో స్త్రీ జీవితం నాశనం కాకూడదనుకొన్నాను" అని సమీర చెప్పడం సహజంగాలేదు. బహుశా రచయిత దృష్టిలో ఇది ఒక గొప్ప త్యాగమే కావచ్చు. తులసి వేరొకని ప్రేమించింది కాని ఆమె వివాహం కొన్ని కారణాలవల్ల మధుకర్‌తో జరిగింది. ఇటువంటివి ఈనాటి మన సంఘంలో

ఎన్నోవున్నాయి. కాని విశ్వాసం చూపడంకోసం తన జీవితం పాడుచేసుకోనక్కరలేదు. "నాకు విడాకులిస్తే నిన్నెవరు చేసుకుంటారు?" అన్న మధుకర్‌తో- "ఎవరు చేసుకోపోతేనేం బావా? పెళ్ళిలోనే వుందా జీవితం! నాకెలాంటి కోరికలూ లేవు" అని తులసి అనడం నేటి వివాహ వ్యవస్థకు ఒక సవాల్. మరి అంత విప్లవాత్మక ధోరణిలో మాట్లాడిన తులసి మళ్ళీ 'ఆ' కోరిక కోరడం చాలా విడ్డూరంగా వుంది. అది ఎవరూ ఊహించని సంఘటన. ఇటువంటివి కథను పొడిగించడానికి తప్ప దేనికీ ఉపయోగపడవు. సమీర తన జీవితరథాన్ని ఒడుదుడుకులకు తట్టుకొని సరియైన గమ్యానికి నడిపించుకొనడమే ఈ నవల 'ముగింపు'యొక్క ముఖ్య ఉద్దేశం అన్పిస్తుంది. నవలలో సంఘటనలు, సన్నివేశాలలో కొత్తదనం ఏమీలేదు. ఏ రచనైనా సమకాలీన సమాజానికి అద్దంపట్టేదిగా వుండాలి. అప్పుడే రచయిత ఆశయం, పాఠకుల ఆశలు నెరవేర్తాయి.

**-ఎన్. రామమూర్తి,**
మరిపివలస.

# రేఖామాత్రమైన సందేశం

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

'భావుకత'తో పాటు 'బాధ్యత', 'విద్యార్హత'తో పాటు 'స్థిమితమైన వివేచనాశక్తి' లోపించిన యువత సంఘాన్నెలా నష్టపరుస్తుందో తెలిపే నవల 'ముగింపు'.

'గడ్డిపూవు'నంటూ ఒకవైపు సమీర ప్రేమ భిక్షనర్థిస్తూ, ప్రేమ-కామాల భేదసామ్యాలను వివరంగా 'డైరీ'లో రాసుకుంటూ, మరోవైపు తులసిపాలిట సంతానప్రదాత అవుతాడు మధుకర్. ప్రేమకథను తిప్పవలసిన మలుపు తిప్పి, చివరకు హీరోయిన్ మెడవొంపులోనో, చీరకుచ్చిళ్ళలోనో మొహం దాచుకున్న మూస హీరో మధుకర్, అటు పైని తాగుబోతైనా, 'మీరా నిలయం' కట్టించాడన్నా చివరకు చచ్చిపోయాడన్నా పాఠకులకు ఎలాంటి సానుభూతీ కలుగదు. పైపెచ్చు విచిత్రమైన వీలునామా ఫక్తు నాటకీయంగావుంది.

'వెళ్ళి నీ బ్రతుకు నీవు బ్రతుకు. నీ బిడ్డను తండ్రి నీడ తెలియని అనాథ శిశువులా పెరగనివ్వకు' అని తన దగ్గరకు వచ్చిన మధుకర్‌తో అన్న సమీర, పిల్లల జీవితాలను సమస్యల వలయంచేసే తల్లిదండ్రుల ప్రేమలను ఖండిస్తూ కర్తవ్యబోధ చేసిన తీరు-తీర్పు ప్రశంసనీయంగావుంది.

జీవితంలో విఫలమైన ప్రేమను మాతృప్రేమగా-ఉద్యోగ నిర్వహణగా పరిణమింపజేసుకున్న సమీర గాఢశీలత ఆదర్శప్రాయంగా వుంది.

'భావుకులు ప్రేమికులై భార్యాభర్తలు కాకముందు, తల్లిదండ్రులై ఆలోచించాలి' అన్న సందేశం మంజీరగారు 'ముగింపు' ద్వారా రేఖా మాత్రంగానైనా అందించడం సమాజశ్రేయోదృష్ట్యా ఆహ్వానించదగినదే.

**-ఆర్. వేంకటేశ్వరి,**
కర్నూలు.

# పుష్కలంగావున్న సెంటిమెంటు

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

సినిమాలని దృష్టిలో పెట్టుకుని నవలలు రాయడం ఈనాటి రచయితల లక్ష్యంలా కనిపిస్తోంది. మహిళా ప్రేక్షకుల్ని ఏడిపిస్తే, కనక వర్షం కురుస్తుందన్న నమ్మకాన్ని ఈ నవల వమ్ముచెయ్యదు. ఆడవాళ్ళకి కావలసిన సెంటిమెంటు దీన్లో పుష్కలంగా వుంది. ఒక హీరో, ఇద్దరు హీరోయిన్లు, ఆఖర్న ఓ హీరోయిన్ చావడం నేటి మన తెలుగు సినిమాల మూస పద్ధతిలో, ఒక హీరోయిన్, ఇద్దరు హీరోలతో, మధ్యలో ఓ విలన్‌తో ఈ నవల నడిపేరు. అయితే నవల్లో ఏకబిగిన చదివించగలిగిన

టెంపో వుంది. భాష,ముఖ్యంగా ప్రకృతి వర్ణనలు చాలా బావున్నాయి. సినిమాల్లోలాగే ఈ నవల్లో డాక్టర్ సమీరకొచ్చిన గత జ్ఞాపకాల్లో, ఆవిడ లేని మధుకర్, తులసిల ప్రణయం సన్నివేశాలుకూడా గుర్తుకు రావడం అసహజంగా వుంది. మధుకర్ పాత్ర కన్విన్సింగా లేదు. అతడు దేవదాసుగా మారి చనిపోవాల్సిన అవసరం ఏమిటి? సమీరని, శరత్‌ని కలపడానికేనా? అయితే ముగింపు పాఠకుల ఊహలకే(?) వదిలెయ్యడం బావుంది. రాధిక, శంకర్, గౌతమి మంచి పాత్రలు. నిజజీవితంలో అలాంటివ్యక్తులు అరుదైనా మొత్తంమీద మంజీరగారి 'ముగింపు' నేడు వస్తున్న అసంఖ్యాకమైన తెలుగు నవలల్లా కాలక్షేపానికైతేనే చదవదగ్గది! అంతేకాని 'చతుర'లో రాదగినది కాదని నా అభిప్రాయం.

**-కూరెళ్ల నరసింగరావ్,**
**వాల్తేర్.**

## పరిస్థితుల ప్రభావం

**(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

ఇందులో పాత్రలన్నీ పరిస్థితుల ప్రభావం మీదే జీవితం ఆధారపడి ఉన్నదనే సూచనకి అద్దంపడుతున్నాయి. మధుకర్, సమీర లాంటి మెడికోలు కూడా ఆలోచనాశక్తి లోపించి పరిస్థితులకు బానిసలుగా తయారవటం విచారకరం. వీళ్ళు ఆ మాత్రం ధైర్యం చూపి పెళ్ళిచేసుకొని జీవించలేరా? అస్తుల గురించి ఆలోచిస్తూ విచక్షణ కోల్పోవాలా? తులసి కోరికను మన్నించే బలహీనుడిగా మధుకర్ ప్రవర్తన సమర్థనీయం కాదు. దీనిని సమీర ఎదిరించినవైనం మెచ్చుకోదగినది. సమీర వ్యక్తిత్వం చాటుకుందిగానీ ప్రయోజనం శూన్యం.

స్నేహానికి నిర్వచనంలా ఉన్న గౌతమి, రాధిక, శరత్ పాత్రలు నవలకి తల మానికాలు.

**-యం.కె. లక్ష్మీదేవి,**
**చీరాల.**

## కథనం అద్భుతం

**(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

శైలి, శిల్పం, కథనం అద్భుతంగా ఉన్నా రచయిత్రి ఎన్నుకొన్న ఇతివృత్తంలో బిగువులేకపోవడంతో పాఠకుల్ని ఆకట్టుకోలేకపోయిందీనవల.

మెడిసన్ చదువుతున్న మోహన్ తలకు మించిన అప్పులు చేసి అవి తీర్చే మార్గంలేక అప్పులవాళ్లకు తన భార్యను అప్పగించటం, ఆమె ఎలాగో ఆ గండం నుంచి బయటపడి మోహన్‌ని పోలీసులకు అప్పగించటం శుద్ధ సినిమాటిక్‌గా ఉంది. నవల ముగింపులో శరత్‌ను భర్తగా ఆహ్వానించడానికి సమీర అంగీకరించినట్లు ఒక హింట్ మాత్రమే ఉన్నది. శరత్‌తోనైనా సమీర శాశ్వతంగా కాపురం చేస్తుందో లేదో? అనే సందేహంలో పాఠకులను వదిలి ఉండాల్సింది కాదు.

**-ఆర్. పట్టాభిరామరాజు,**
**తిరుపతి.**

## సంభాషణలు బాగున్నాయి

**(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

తులసిని వదిలించుకోలేక, సమీరను చేరుకోలేక నలిగి, నలిగి, చావుబతుకుల్లో ఉన్న మధుకర్‌ను కొంతయినా అర్థంచేసుకోలేని సమీర అతన్ని నిజంగా ప్రేమించిందా అనిపిస్తుంది ఈ నవల చదివేవాళ్లకు. చిన్న పిల్లలు పెద్దవాళ్లను ఏది అడగాలన్నా సందేహించరు. అలాంటిది వంశీ "నేనొక మాట అడుగుతాను... కోపం రాదుకదా మమ్మీ" అని సమీరతో అనటం ఎబ్బెట్టుగా ఉంది. కొన్ని డైలాగులు చాలా బాగున్నా మరికొన్ని ఆ స్థాయిలోలేవు. ముగింపు చెప్పకపోయినా నవలకు ముగింపు తెలుస్తూనేవుంది. శరత్ లాంటి వాళ్ళు నిజంగా ఉంటే మన సమాజం ఎప్పుడో బాగుపడేది.

**-జి.విజయలక్ష్మి,**
**హిల్‌కాలని.**

# చిత్ర ప్రపంచ

## పెళ్ళికానివారికి మాత్రమే

అందం, చదువు, డబ్బు అన్నీ ఉన్నా అన్నివిధాలా తమ అభిరుచులకు అనుగుణమైన జీవిత భాగస్వామి దొరకడం చాలా అరుదైన విషయం. సమస్య ఏదైనా, ఇరవైఅయిదేళ్లు దాటినా పెళ్లికాని యువతులను, ముప్ఫయిఏళ్లు వచ్చినా పెళ్లికాని యువకులను చూసి అందరూ గుసగుసలు పోవడం మామూలే. వాళ్లకు మరీ కోరికలెక్కువనో, ఛాదస్తం మనుషులనో విమర్శిస్తూఉంటారు. ఈమధ్య చైనాలో ఇలా పెళ్లీడు వచ్చినా ఇంకా పెళ్లికానివారికి, విడాకులు తీసుకొని ఒంటరిగా ఉన్నవాళ్లకి జీవితభాగస్వాములను వెదికిపెట్టే బాధ్యతను ఒక 'మ్యారేజ్‌బ్యూరో' తీసుకొంది.

1980లో చైనాలోని 'జినాన్' నగరంలో కమ్యూనిస్టులీగ్, మున్సిపాలిటీవారు, ఒక స్త్రీల యూనియన్ వారు కలిసి ''మ్యారేజ్‌బ్యూరో''ను ప్రారంభించారు. ఈ సంస్థ తమ సభ్యులకు బాల్‌రూమ్ డాన్స్ నేర్పడం, ఆదివారాలు పిక్‌నిక్స్ ఏర్పాటుచేయడం వంటివి చేసేవారు. అయితే చైనా దేశస్థులకు సిగ్గు, బిడియం చాలా ఎక్కువయినందువల్ల గత అయిదేళ్లల్లో ఈ సంస్థ కేవలం 486 పెళ్లిళ్లు మాత్రం చేయగలిగింది. ఇరవైఅయిదునుండి నలభైసంవత్సరాల మధ్యవయసుగల స్త్రీ, పురుషులు నాలుగు వేలమంది మాత్రమే ఈ సంస్థలో తమ పేర్లను నమోదు చేయించుకొన్నారు.



ఇంకా ఎక్కువమందికి సహాయపడేందుకుగానూ ఈ సంస్థ మరో కొత్త పథకాన్ని రూపొందించింది. వీరు వారానికి మూడు డాన్స్ పార్టీలను ఏర్పాటు చేసి సభ్యులందరినీ ఆహ్వానిస్తారు. ఆ పార్టీలో తేలికైన, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని కల్పించి, పళ్లరసాలు రుచికరమైన భోజనపదార్థాలు ఏర్పాటు చేస్తారు. సభ్యులందరూ అటువంటి పార్టీలలో డాన్స్ చేస్తూనో, పళ్లరసాలు సేవిస్తూనో తమకు నచ్చిన జంటను వెదుక్కోవడానికి ప్రయత్నిస్తారు. లేదా తమ అభిరుచులను ముందే ఈ సంఘ సభ్యులకు తెలియజేస్తే వారి అభిరుచులకు సరిపోయేవారిని వారికిపరిచయం చేస్తారు. వారితో పరిచయం పెరిగాక నచ్చితే వివాహం చేసుకోవచ్చు. లేదా వేరేవారిని పరిచయం చేసుకోవచ్చు.

సాధారణంగా చైనాదేశంలోని ఆడవాళ్లు తమ భర్త తమకంటే వయసులో పెద్దవాడయి ఉండాలనీ, పొడవుగా, పొడవుకుతగ్గ లావుతో ఉండాలని ఇష్టపడతారు. అంతేగాకుండా కాబోయే భర్త కష్టపడి పనిచేసేవాడుగా, బాధ్యతాయుతమైన వ్యక్తిగా ఉండి, హాస్యప్రియుడై ఉండాలని కోరుకొంటారు. మగవాళ్లు తమకు కాబోయేభార్య వయసులో తమ కంటే చిన్నదిగా ఉండి, అందంగా ఉంటే చాలునని మాత్రం అంటారు.

ఈ డాన్స్‌పార్టీలు అనుకొన్నదానికంటే ఎక్కువగా జయప్రదం కావడంతో 'మారేజ్‌బ్యూరో' యాజమాన్యం, ఈ సంఘసభ్యులేగాక, బయటివారు కూడా ఆ పార్టీలలో పాల్గొనవచ్చునని ప్రకటించింది. అయితే ఇక్కడ కేవలం పెళ్లికానివారికి మాత్రమే ప్రవేశం ఉంటుంది.

మనదేశంలో కూడా అభ్యుదయవాదులు అటువంటి సంస్థలను ఏర్పాటుచేస్తే బాగుంటుందేమో!

## నిజమైన తల్లి

సొంత పిల్లలయినా సరే ఒకరిద్దరికంటే ఎక్కువయితే పెంచడం భారమని అందరూ అంగీకరించిన సత్యం. అటువంటిది25 మంది పిల్లల్ని అందులో పరాయివారిని పెంచడం ఓ పెద్ద విశేషమేకాదు గొప్పతనం కూడా.



పూనాకు చెందిన శ్రీమతి జయశ్రీ ఫడ్కె మురికి వాడల్లోఉండే ఓ ఇరవై అయిదుమంది పిల్లల్ని కేవలం తిండిపెట్టి పోషించడమేకా దు, చదువు కూడా చెప్తోంది. ఎనిమిదేళ్లుగా నిర్వహిస్తున్న ఈ బృహత్కార్యానికి ఆమె భర్త సహకారం కూడాఉంది. తమకు సంతానం లేకపోయినా ఈ పిల్లలకోసం వారు ఏ ఆడంబ రాలు లేకుండా అత్యవసరమైన వాటికి మాత్రమే ఖర్చుపెడుతూ పిల్లల పోషణభారం వహిస్తున్నారు.

జయశ్రీ భర్త శివాజీనగర్ రైల్వేస్టేషన్‌లో గార్డ్‌గా పనిచేస్తూఉండేవారు. ఆ విధంగా శ్రీమతి ఫడ్కె రైల్వేప్లాట్‌ఫామ్‌మీద ఓ గమ్యం లేకుండా చిల్లరమల్లరగా తిరుగుతూఉండే పిల్లల్ని తరచు చూస్తూఉండేది. శ్రీమతి ఫడ్కెతో పరిచయంఉన్న ఆడవారు, తమ పిల్ల లకు చదువుచెప్పి వారిని కాస్తాదారిలోకి తెమ్మని బతిమాలుతూ ఉండేవారు. జయశ్రీ చివరికి వారి బాధ్యతను స్వీకరించడానికి నిశ్చ యించుకొంది. ప్రతి పిల్లవాడి తల్లిదండ్రుల ను కలుసుకొని వారి గురించి అన్ని వివరాలు సేకరించింది. వారు ఆమె పెంపకంలో ఎటు వంటి జోక్యం కలిగించుకోకూడదనే షరతుమీ దనే పిల్లల బాధ్యతను తీసుకొంది. ఎమ్.ఏ. చదివిన జయశ్రీ పిల్లలకు పదవతరగతి వరకు అన్ని సబ్జెక్ట్స్‌లో పాఠాలు చెప్పగలదు. ఈ పిల్లల తలిదండ్రులు స్కూలు యూని ఫామ్, ఫీజుకుగాను నెలకు 30 రూపాయలు ఇస్తారు. వారికి కావలసిన పుస్తకాలు, తిండి అన్నీ జయశ్రీ చూసుకుంటారు.

మధ్యాహ్నం ఒంటిగంట అయ్యేసరికల్లా శుక్రవారపేటలోఉన్న జయశ్రీ ఇంటికి 12 మంది పిల్లలు స్కూలునుండి బిలబిలా వచ్చే స్తారు. అలసిపోయి ఆకలిగా వచ్చిన ఆ పిల్లల మొహాల్లో మాత్రం ఆనందం కనబడు తూ ఉంటుంది. వరసగా అందరూవెళ్లి కాళ్లూ, చేతులూ శుభ్రంగా కడుక్కొని వచ్చి జయశ్రీ ఆప్యాయంగా పెట్టే అన్నం తింటారు. భోజ నాల సమయంలో ఆమె వారిని పేరు పేరునా పలకరిస్తూ ఎంతో ఆదరంగా కన్నతల్లిలా వారి మంచిచెడ్డలు విచారిస్తుంది. వీళ్లు సాయంకాలం ఆరింటిదాకా అక్కడే ఉంటారు. జయశ్రీతో అర్థంకాని పాఠాలు చెప్పించుకొని, ఆమెకు పనిలో సహాయంచేసి కాసేపు ఆడు కొని ఇళ్లకు వెళతారు. సాయంకాలం ఆరు గంటలకు రెండో బ్యాచ్ పిల్లలు పదమూడు మంది వస్తారు. జయశ్రీ ఏమాత్రం విసుగు లేకుండా వారు చెప్పేవన్నీ ఓపిగ్గావిని వారి సమస్యలకు పరిష్కారం ఆలోచిస్తుంది.

అస్తమానం చదువుకోమంటే పిల్లలకు విసుగనే విషయం జయశ్రీకి బాగా తెలుసు. అందుకే వారిని కాసేపు తనకు పనిలో సహాయం చేస్తూనో ఆడుకుంటూనో గడపడాన్ని ప్రోత్సహిస్తుంది. పిల్లలందరూ అక్కడ తమ సొంత ఇంటిలో ఉన్నంత చనువుగా ఉంటా రు. ఏ చిన్న తిండి పదార్థమైనా, వస్తువయినా పిల్లలతో పంచుకోవడం జయశ్రీకి అలవాటు.

అల్లరి చిల్లరిగా తిరగడానికి అలవాటుపడ్డ ఈ పిల్లలు మొదట జయశ్రీ దగ్గరఉండి చదువుకోవడానికి ఇష్టపడేవారుకాదు. సమయం చూసుకొని పారిపోయి ప్లాట్‌ఫామ్ మీద ఆడుకొనేవారు. అయితే జయశ్రీ ఎంతో ఓర్పుతో నేర్పుతో వారిని మచ్చిక చేసుకొని క్రమశిక్షణలో పెట్టగలిగింది. ఇప్పుడు వారు జయశ్రీ ప్రేమలో పాత దురలవాట్లు, కరకు మాటలు మానేసి ఎంతో సంస్కారవంతమైన, చురుకైన పిల్లలుగా తయారయ్యారు. ఇంతవ రకూ వాళ్లు క్లాసులో ఏ సబ్జెక్టులోనూ తప్పడం జరగలేదు. వీరిలో చాలామంది మెట్రిక్యులే షన్ తరువాత తమ సొంత సంపాదనతోనే చదువుకోవాల్సిఉంటుంది కాబట్టి తీరిక సమ యాల్లో డబ్బు సంపాదించుకోవడానికి ఫడ్కెవా రికి చిన్న చిన్న పనులు చూపిస్తూ ఉంటారు.

సాధారణంగా సంతానం లేదని బాధపడు తూ, నిరుత్సాహంతో స్తబ్దుగా బతుకువెళ్లదీసే వారేతప్ప ఫడ్కె దంపతుల్లా దయనీయమైన స్థితిలోఉన్న ఇతర పిల్లపై తమ ప్రేమచూ పించడం చాలా తక్కువ. మధ్యతరగతికి చెందిన వీరు తమ ఆర్థిక పరిస్థితిని కూడా లెక్క చేయకుండా ఇటువంటి ఉన్నతమైన కార్యానికి పూనుకొని మార్గదర్శకులయ్యారు. ★

కవరుపేజీ ఫొటోగ్రాఫర్ : **ఫణికుమార్**



# ప్రకృతి చెప్పే పాఠాలు!

ప్రకృతి నుండి మనం నేర్చుకోదగ్గవి అనేకం. కొద్దికొద్దిగా కూడబెట్టిదాన్ని ఓ పెద్దమొత్తంగా చేసేనేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి ఉదయతార సహకరిస్తుంది. ప్రత్యేక అవసరాలకు అవసరమైన మొత్తాలను చిన్న చిన్న మొత్తాలుగా కూడబెడ్తేనే అది పెద్దమొత్తంగా రూపుదిద్దుకొని అవసరం గడపటానికి దోహదకారి అవుతుంది.

నెలవారి ఈ మొత్తాలను ఉదయతారలో మీ బడ్జెట్‌కు అనుగూలమైన చీటిలో దాచుకుంటే దానికి తోడు ఆకర్షణీయమైన డివిడెండ్లు తోడయి ఓ పెద్ద మొత్తంగా రూపు దిద్దుకుంటుంది. ఉదయతారలో పొదుపుచేస్తే అధిక ఆదాయంతోపాటు సత్వర పేమెంటు సమకూరుతుందనితెలిసి ఎందరెందరో సభ్యులయ్యారు. మరి మీరుకూడా సత్వరమే చేరండి. మీకే తెలుస్తుంది.

## ఉదయతారతో పొదుపు మీ ఆర్థికాభివృద్ధికి మదుపు

UFC

# ఉదయతార

### ఫైనాన్స్ అండ్ చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 7-75, పటమట, విజయవాడ-6, ఫోన్ : 52065



# చతుర

**పదవ జన్మదిన సంచిక**

సంపుటి:10 ఫిబ్రవరి 1987 సంచిక:1

## ఈ నెల అత్యుత్తమ నవల

"ఎంత తొందరగా పెళ్లిచేసుకుని మా ఇంట్లోంచి బయటపడి స్వేచ్ఛ పొందుదామా అని ఉంది" అందా యువతి.

"అందరూ పెళ్లయితే స్వేచ్ఛపోతుందని గోలపెడుతుంటే, నువ్వు స్వేచ్ఛకోసం పెళ్లాడతానంటున్నావేమిటే? నవ్వొస్తోంది" అందామె మిత్రురాలు.

ఇద్దరూ విద్యార్థినులే. కాలేజీ విద్య పూర్తిచేసుకుని ఉద్యోగాల్లో చేరి తమ కాళ్లమీద తాము నిలబడాలనుకుంటున్నవారే!

అయినా ఇద్దరి అనుభవాలూ, ఆలోచనలూ రెండురకాలుగా ఎందువల్ల అలా నడిచాయి?

"స్వేచ్ఛ"ను కోరుకున్న ఆ యువతి తనను మనసారా ప్రేమించి, కోరుకున్న వ్యక్తికే అర్ధాంగి అయింది. ఆశించిన విధంగా ఉద్యోగినిఅయి ఆర్థికంగా స్వతంత్రురాలూ అయింది.

అయినా అడుగడుగునా తన "స్వేచ్ఛ"కు సంకెళ్లుపడుతున్నాయని, ఆత్మీయుడైన జీవన సహచరుడిని పొందిన ఆమెకూడా ఎందుకు బాధపడవలసి వచ్చింది? అసలు "స్వేచ్ఛ" అంటే ఏమిటి? ఆధునిక మహిళ కోరుకుంటున్న స్వేచ్ఛ ఎటువంటిది?

"స్వేచ్ఛ"ను మన్నించే భర్త ఉన్నాకూడా అసంతృప్తిగా బాధపడవలసిన పరిస్థితులెలా ఎదురవుతాయి? వీటికి పరిష్కారం ఉందా?

ఆ పరిష్కారం ఆర్థిక స్వాతంత్ర్యమేనా? లేక అంతకుమించిన మరేదైనా ఉన్నదా?

మహిళా ప్రపంచంలో చర్చలకు, ఆలోచనలకు, ఆందోళనలకు ఎన్నాళ్ల నుండో కారణంగా ఉన్న ఈ స్త్రీ స్వేచ్ఛ స్వరూప, స్వభావాలేమిటి? వీటన్నింటిని ఆసక్తికరంగా చర్చించిన శ్రీమతి 'ఓల్గా' ఆలోచనాత్మక నవల "స్వేచ్ఛ" ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

'చతుర' 100వ సంచిక వెలువడుతున్న సందర్భంగా భారీ యెత్తున నిర్వహించిన నవలల పోటీకి అందిన 357 నవలలలో చివరిదాకా నిలచి "అత్యుత్తమ నవల"గా పదివేల రూపాయల బహుమతి పొందిన

# స్వేచ్ఛ

ఆలోచనాపరులైన ఆధునిక పాఠకులకు ఒక గొప్ప అనుభవం.

---

శ్రీమతి **ఓల్గా** తన కవితల ద్వారా ఈతరం పాఠకులకు ఇదివరకే సుపరిచితురాలు. 'చతుర' జనవరి 1986 సంచికలో వీరి తొలి నవల "సహజ"ను పాఠకులు చదివే ఉన్నారు. ఎగ్నెస్ స్మెడ్లీ నవల "భూమి పుత్రిక", కథలు "సామాన్యుల సాహసం" అనువదించారు.

"నవల మానవ జీవితాన్నీ ఆ జీవితంలో వచ్చే మార్పులనూ చిత్రించి, ఆయా సమస్యలతో పోరాడుతున్న వారికి ధైర్యాన్నీ ఉత్సాహాన్నీ కలిగించేదిగా ఉండాలి. ఆ జీవితాల్ని నడిపిస్తున్న సాంఘికశక్తుల గురించి పాఠకులకు అవగాహనకలగాలి. అలా రాయగలిగినపుడే ఏదైనా ఉత్తమ రచన" అనే శ్రీమతి ఓల్గా నివాసం హైదరాబాదులో.



మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తోంది.

అరుణ మాటిమాటికీ గడియారం వంకా గేటు వంకా చూస్తోంది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుండటంతో గోడ గడియారం చప్పుడు చాలా స్పష్టంగా వినిపించి అరుణ చికాకును మరికాస్త పెంచింది.

రోజూ ఆ వేళప్పుడు ఆ ఇంట్లో ఆ నిశ్శబ్దం మామూలే.

అరుణ తండ్రి జానకీరామయ్యా, అన్న గోపాల్రావూ పదిగంటలకంతా ఆఫీసుకి వెళ్ళిపోతారు.

గోపాల్రావు కొడుకులిద్దరూ బడికి పోతారు.

తల్లి సీతమ్మా, వదిన సుశీలా కూడా భోజనాలు ముగించి ఏవప్పులు బాగు చేసుకోవటమో, బట్టలు కుట్టడమో చేసి బద్ధకంగా నడుం వాలుస్తారు.

పిల్లలు మళ్ళీ మూడు గంటలకుగాని రారు.

అప్పటివరకూ వాళ్ళకు విశ్రాంతి.

అరుణ ఇంట్లో పనులన్నీ చేస్తుందిగానీ మధ్యాహ్నం భోజనాలయ్యాక చేసే పనులంటే చిరాకు! ఏ పుస్తకమో తీసుకుని చదువుకుంటూ నిద్రపోతుంది.

మామూలుగా అరుణకు కాలేజీ, చదువూ, పరీక్షలూ వీటితో ఇంటిలో గడిపే సమయం తక్కువే. శలవల్లో పగలంతా ఇంట్లో కూర్చోవాల్సివచ్చినపుడు అరుణకు వూపిరాడనట్లే వుంటుంది.

ఎమ్.ఏ. ఫైనల్ పరీక్షలయ్యి పదిరోజులే అయినా పదినెలలయినట్లుగా వుంది అరుణకు. స్నేహితురాలు ఉమ ఎమ్మెస్సీ పరీక్షలు క్రితం రోజే పూర్తయ్యాయి. ఉదయం పది గంటలకే వస్తానన్న ఉమ పన్నెండవుతున్నా రాలేదని అసహనంగా చూస్తోంది అరుణ.

మేనత్త కనకమ్మకు అటు ఇంటిపనిగానీ ఇటు బైటపనిగానీ వుండదు. ఇంట్లో మిగిలిన వాళ్ళు యేయే సమయాల్లో ఏమేం చేస్తున్నారో కనిపెట్టి చూసి, ప్రతిపనినీ విమర్శించటమే ఆమె పని.

ఆవిడ అరుణ అసహనాన్ని గమనించనే గమనించింది.

"ఊరికే వాకిలి వంకా గడియారం వంకా చూడక పోతే డాబా మీదున్న వడియాలు తెచ్చి వలవరాదే అరుణా" అందావిడ.

అరుణకు ఆవిడతో మాట్లాడటమన్నా వాదన పెంచటమన్నా చాలా చిరాకు. ఆమె చెప్పే పనుల్లో చెయ్యటానికి వీలైనవి వుంటే చేసేస్తుంది. లేకపోతే తనని కాదన్నట్లు మాట్లాడకుండా వూరుకుంటుంది.

అరుణ మౌనం కనకమ్మని రెచ్చగొట్టి అరుణ నిర్లక్ష్యాన్ని గురించి గొడవ చేయిస్తుంది.

కానీ ఆమె ఎంతఅరచి గీపెట్టినా, ఇంట్లో వాళ్ళంతా తిట్టినా సరే అరుణ మాత్రం పెదవి విప్పదు.

ఇప్పుడు అరుణ వెళ్ళి ఆ వడియాలేవో తేకపోతే ఆవిడ వడియాల పురాణం మొదలెడుతుంది.

అరుణ వయసుకి తానెన్నిసార్లు వడియాలు పెట్టింది?

వడియాలు పెట్టందే ఆడపిల్ల ఎందువల్ల ఆడపిల్ల అనిపించుకోదు?

అరుణ ఆడపిల్ల కాకుండా బరితెగించిపోతున్న తీరు ఎలాఉంది?

ఇవన్నీ ఏకరువు పెడుతుందామె! ఆపటం ఎవరి తరమూ కాదు.

అందుచేత అరుణ గబగబా డాబా మీదకు వెళ్ళింది. మంచాల మీద తెల్లటి పంచెలుపరిచి వాటిమీద చిన్నచిన్న వడియాలు పెట్టారు. ఆ తెల్లటి పంచెలమీద వడియాలు మెరుస్తున్నాయి చిత్రంగా.

అరుణ కాసేపు వాటిని చూసి ఆ పంచెలన్నీ తీసి మడిచింది. మెట్ల దగ్గర కాస్తనీడగా అనిపిస్తే అక్కడ నుంచుని వీధిలోకి చూసింది.

"ఉమ ఎప్పుడూ ఇంతే. చెప్పిన టైముకి ఎక్కడికీ రాదు.

అసలు ఇంకోరి కోసం ఎదురు చూసే పని పెట్టుకోకూడదు. అయినా ఇవాళ వెళ్ళిపోతోంది గదా- తొందరగా వస్తే ఇంకో గంట

ఎక్కువ కలిసి వుండొచ్చు. అనుకోదేం" అని ఉమ మీద మనసులోనే విసుక్కుంది.

ఎందుకో వీధి వైపు వచ్చిన మేనత్త డాబా మీద నుంచుని వీధిలోకి చూస్తున్న అరుణని చూడనే చూసింది. "ఏమిటా డాబా మీద నుంచుని చూడ్డం! పనయిపోగానే కిందకి దిగవేం. దిగూ కిందకి" అని అరిచినంత పని చేసింది.

"అబ్బా- అసలీ అత్త మనింట్లో ఎందుకుంటుందే" అని వూహ వచ్చిన మొదట్లో తను అమ్మనడగడం అరుణకింకా బాగా గుర్తుంది.

"ఊరుకోమ్మా. విందంటే కొంపలంటుకుంటాయ్" అంది అమ్మ.

అత్త విననే వింది.

అసలావిడకు ఎవరు ఎప్పుడు ఏం మాట్లాడుకుంటున్నా తెలిసి పోయేది. ప్రతి విషయం మీదా తన అభిప్రాయం చెప్పి "అయినా నాకెందుకులే- తలచెడినముండని" అనేది.

ఆరోజు పెద్ద రభసయింది. ఆఫీసు నుంచి తండ్రి వచ్చేవరకూ అదీ ఇదీ సణుగుతూనే వుంది.

"ఏదో చిన్నపిల్ల తెలవక అడిగింది. పోనివ్వరాదూ" అని అమ్మ బతిమాలుకుంది కూడా.

"చిన్నపిల్ల దానికేం తెలుస్తుందీ. పెద్దవాళ్ళ కడుపుల్లో మాటలే పిల్లల నోట్లో నుంచి వస్తాయి" అని సాధించింది కనకమ్మ.

సీతమ్మ మళ్ళీ నోరు విప్పలేదు. జానకీరామయ్య ఇంట్లో కొచ్చి ఇంకా కాళ్ళన్నా కడుక్కోనేలేదు. ఏడుపులతో మొత్తుకోళ్ళతో స్వాగతం పలికింది కనకమ్మ.

ఆయన ఇంతెత్తున ఎగిరి ఎక్కడ తగుల్తుందో కూడా చూడకుండా అరుణని బాదాక అప్పుడు నోరువిప్పింది మళ్ళీ.

"ఊరుకోనాయనా. తలచెడి ఒకరి పంచన చేరనే కూడదు... చేరాక ఇటువంటి మాటలు పడక తప్పదుమరి. రేపుదానికేమన్నా అయితే మేనత్తముండ పసిముండని పొట్టన పెట్టుకుందంటారు. వూరుకో. ఒకర్ననేం లాభం. నా కర్మిట్లా కాలింది మరి." అని దీర్ఘం తీసిందామె.

ఆ రోజు రాత్రి మంచం మీద అరుణని కావలించుకుని ఏడుస్తూ పడుకుంది సీతమ్మ. తండ్రి వచ్చి మళ్ళీ సీతమ్మని తిట్టాడు.

అప్పట్నించీ అరుణ మేనత్తని ద్వేషిస్తూనే వుంది. ఆ ద్వేషం రోజు రోజుకీ పెరిగిందేగాని తరగలేదు. తండ్రీ తల్లీ మేనత్తంటే ఎందుకో భయపడడం అరుణ చిన్నప్పుడే కనిపెట్టేసింది.

పెద్దయ్యాకగాని ఆ భయం ఎందుకో అర్థంకాలా.

కనకమ్మకి చిన్నప్పుడే పెళ్ళయింది. కాపరానికి వెళ్ళకుండానే భర్త పోయాడు. భర్తనుంచి వచ్చిన ఐదెకరాల మాగాణీ భూమితో సహా తమ్ముడిల్లు చేరింది కనకమ్మ. ఆవిడ పొలం మీది ఆశతో జానకీరామయ్య ఆమెమాట జవదాటేవాడు కాదు. సీతమ్మని నోరెత్తనిచ్చేవాడు కాదు.

అత్త ఏమన్నాసరే తల్లీదండ్రీ నోరుమూసుకు పడుండేది ఇందుకేనని తెలుసుకోవటం అరుణకి కష్టమనిపించినా అది వాస్తవం.

చిన్నప్పటి నుంచీ బొట్టూ పూలూ పెట్టుకోకుండా రంగురంగుల బట్టలేసుకోకుండా, ఏ చిన్న ముచ్చటా లేకుండా జీవితం గడుపుతున్న కనకమ్మకి లోకంలో ఏ ఆడది కాస్త పచ్చగా వున్నా గుండెలు భగ్గుమనేవి.

మరి మారిన రోజులు ప్రకారం ఆడది గడపదాటి చదువులకని బైటికెళ్ళడం కనకమ్మ కసలు పడేదికాదు. మూడో క్లాసు దాటిం దగ్గర్నించీ ఆడపిల్లల చదువులు మాన్పించమని నిరంతరం పోరుతుండేది.

అరుణ అక్క రాజేశ్వరి ఈ పోరాటాల మధ్యలోనే ఎనిమిదో తరగతి దాకా ఎలాగో నడిపించింది.

ఆ తరవాత కనకమ్మ బాధ తట్టుకోలేక రెండేళ్ళలో పెళ్ళి చేసి పంపించేశాడు జానకీరామయ్య.

అరుణ ఎనిమిదో క్లాసు కొచ్చేసరికి..

"ఇంకెన్నాళ్ళులే. ఈ తిప్పుళ్ళూ ఎగురుళ్ళూ అన్నీ పోతాయి ఆ మూడుముళ్ళూ...." అని మొదలెట్టేది కనకమ్మ.

"చిన్నమ్మాయి పెద్దదానిలా కాదులే. దీనికి బాగా చదువొస్తుంది" అనిగొణిగేవాడు జానకీ రామయ్య.

అసలు విషయం ఇల్లు కట్టుకోటానికి అయిన అప్పులతో సతమతమవుతున్న ఆయ నకు అరుణ పెళ్ళి చేసే శక్తిలేదు.

"ఎందుకూ- చదువంట చదువు. నాకు తెలిసి చదువుకున్న ఏ ఆడదీ బాగుపడలా. ఇది సంసారం చెయ్యదా? సంసారాలు చేసు కునే వాళ్ళకి చదువులు అచ్చిరావు" అని కరాకండిగా తన అభిప్రాయం చెప్పి,

"అయినా నాకెందుకులే. చదివించుకునే వాడివి నువ్వూ చదువుకునేది అదీనూ. తల్లి వుందరేటే ఆవిడకి పిల్లఏమయిపోయినా పట్ట దు. నాకు తెలవకడుగుతా రేపేదన్నా అయితే మొకాలెక్కడ పెట్టుకుంటారూ?" అని మొద లెట్టేది.

అరుణ వేసే ప్రతి అడుగు లెక్కపెట్టి సాధించి పెట్టేది. "ఏమిటా నిట్టలు తొక్కడం... చురుగ్గా వుండాలి. ఇట్టావుంటే పనులవుతా యా- చీమనడకలు చీమనడకలని! రేపా చేసు కునేవాడి కింత వుడకేసి పెడతావా లేదా" అనేది.

కాస్త ఒకడుగు ఎక్కువేస్తే... "ఏమిటా వరు గు. ఆడపిల్లవు కాదూ. నిదానం కూడా లేకపోతే ఇకా వచ్చేవాడు ఏం చూసి చేసుకుంటాడు నిన్నూ" అని సాధించేది.

ఇంట్లో వున్నంతసేపూ తన ప్రతి కదలికా అత్త రికార్డు చేస్తోందనే స్పృహ అరుణకి పెద్ద నిస్పృహ కలిగించేది.

ఎస్సెల్సీ పూర్తయి కాలేజీలో చేరిన దగ్గ ర్నించీ కనకమ్మ జాడ్యం తల్లీతండ్రీ అన్నా వదినల కందరికీ అంటుకుంది.

అరుణ తీసే వూపిరి, వేసే అడుగూ, పోసుకునే నీళ్ళూ, రాసుకునే పౌడరూ- అన్నీ ఎవరికో ఒకరికి అభ్యంతరకరంగా కని పించేవి.

ఏ విషయంలోనూ అంగీకారంలేని పెద్దలు తనని సతాయించడం దగ్గరికొచ్చేసరికి, తనని అదుపులో పెట్టడం దగ్గరికొచ్చే సరికి తనకి బుద్ధులు చెప్పడం దగ్గరకొచ్చేసరికి ఏకాభిప్రా యానికి వచ్చేసేవారు.

కనకమ్మయితే అరుణని అవమానించడాని కే పుట్టినట్టు ప్రవర్తించేది.

అరుణకింకా బాగా గుర్తుంది.

అప్పుడు తను టెన్త్ క్లాసు చదువుతోంది.

ఓ రోజు స్కూలు నుంచి ఇంటికొచ్చింది. అందరు ఆడపిల్లల్లాగే పుస్తకాలను గుండెలకా నించుకొని నడుస్తూ వచ్చింది.

ఎప్పుడు అరుణ స్కూలు నుంచి వస్తుందా ఏ తప్పు పట్టుకోగలనా అన్నట్టు చూస్తున్న కనకమ్మ కళ్ళు అరుణ గుండెల మీదున్న పుస్తకాల మీద పడ్డాయి.

"వయసొచ్చిన పిల్ల చదివింది చాల్లే అని ఆ మూడుముళ్ళూ వెయ్యకపోతే ఇంతే. గుండె లమీద మగాడి బొమ్మనేసుకుని ఆ తైతక్క లేంటి- సిగ్గులేకపోతేసరి" అంటూ ప్రా రంభించింది. అరుణ సిగ్గుతో చితికిపోయి పుస్తకాలు గబుక్కున కింద పడేసింది.

పైపుస్తకానికి ఎవరో సినిమానటుడి బొమ్మ అట్టగా వేసివుంది.

అదీసంగతి!

అరుణ ఈ ఆలోచనలతో కొట్టుకు పోతూ అవమానంతోవుడికిపోతూ వుండగానే వాకిటి ముందు ఆటో ఆగింది. స్నేహితురాలు ఉమ పెద్ద పెట్టెతో సహా దిగింది.

"ఏమిటి తల్లీ ఇంతాలస్యం, పదిగంటలకు వస్తానని, చూడలేక చస్తున్నా" అంటూ ఉమ పెట్టెకు సాయం పట్టింది.

"ఇదిగో ఈ పెట్టె సర్దుకునేసరికి ఈ వేళ యింది. ఈ శలవలు శాశ్వత శలవలుగదా- మొత్తం రూమంతా ఖాళీ చేసి ఈ పెట్టెలో నింపేశా"

ఇద్దరికీ ఒక్కసారి దిగులనిపించింది.

"టికెట్ తీసుకున్నావా?"

"నిన్ననే తీసుకున్నా. రాత్రి తొమ్మిదిన్నరకీ బస్సు"

"భోజనం చేశావా?"

"చేశానుగాని కాసిని మంచినీళ్ళివ్వు"

ఈలోపల అరుణా వాళ్ళమ్మ, వదినా, మేన

త్తా ఉమ చుట్టూ చేరారు. సీతమ్మా, సుశీలా కుశల ప్రశ్నలు వేస్తుంటే కనకమ్మ ఉమను నఖశిఖ పర్యంతం పరీక్షించింది. బాగా అలిసినట్లున్నా ఉమ ముఖంలో కనిపించే వుత్సాహం, చురుకుదనం, సంతోషం, సన్నగా నాజూగ్గా వున్న ఆమె ఆకారం- ఇవన్నీ కలిసి కనకమ్మ మనసులో ఏదో అశాంతిని రేపాయి.

అరుణ మంచినీళ్ళ గ్లాసుతెచ్చి ఉమకిచ్చి "కూచో" అంటూ తానూ మంచం మీద కూచుంది.

ఉమకంటే ముందు మిగిలిన ముగ్గురూ మంచం పక్కనే కూచుని అరుణ డాబా మీద నుంచి తెచ్చిన వడియాల చీరల్ని ముందు పడేసుకుని వలవటం మొదలుపెట్టారు.

ఉమ అరుణను చూసి నవ్వింది. అరుణ ఇబ్బంది పడుతూనే-

"నిన్న పరీక్షఎలా రాశావూ?" అనడిగింది.

"ఫరవాలేదు. అన్నీ అనుకున్న ప్రశ్నలే వచ్చాయి. ఫస్టుక్లాసు వస్తుందిలే. దిగుల్లేదు" అంది ఉమ నిర్లక్ష్యంగా.

"ఫస్టుక్లాసు గురించి ఎవరాలోచిస్తున్నారు. గోల్డ్‌మెడల్ సంగతేమిటి?"

"ఏమో- చెప్పలేం. ఆ ప్రేమకుమారుడు గడ్డాలూ, మీసాలూ పెంచి నిద్రాహారాలు మాని తపస్సుచేశాడుగా. తన్నుకు పోతాడేమో"

"గడ్డాలకీ మీసాలకీ మార్కులేస్తే ఇంకా చాలామందికూడా తన్నుకు పోతారేమో"

ఇద్దరూ నవ్వుకుంటుంటే సుశీల చిరాగ్గా గదిలోకివెళ్ళి పడుకుంది.

"అయ్యో- అవేంమాటలే తల్లీ" అంటూ కనకమ్మ ఏదో మొదలెట్టబోతుంటే అరుణ లేచింది.

"వరండాలో కూచుందాం రా ఉమా" అంటూ తీసుకు వెళ్లింది.

"మనం వినకూడదమ్మా వీళ్ళమాటలు" కనకమ్మ సీతమ్మతో అంది.

"ఏమో- ఏం రహస్యాలో"

"నువ్వే హాస్టల్‌కి రావే అంటే వినవు" వినుక్కుంది ఉమ.

"నేను హాస్టల్‌కి రావాలంటే ముందు మా నాన్న దగ్గర్నించీ అన్నయ్యా దగ్గర్నించీ పర్మిషన్ తీసుకోవాలి. అదినాకు పెద్ద చికాకు. ఇక నేను బయల్దేరే దగ్గర్నించీ అందరూ ఏదో సణుగుడు ముగ్గురూ ముగ్గురే- ఎవరి లెవల్లో వాళ్ళు. తీరా వచ్చినా మళ్ళీ సాయంత్రం ఐదుగంటలకంతా ఇంట్లో వుండాలి. నువ్వొస్తే రాత్రిదాకా కలిసి వుండొచ్చు గదా అని"

"సరేలే- ఇక్కడేమో అసలు మాట్లాడుకునే వీలుండదు. పోనీ సినిమాకు వెళ్దామా?"

"సినిమాకా?"

"ఏం- పర్మిషన్ కావాలా?"

"కావాలి. కానీ నువ్వున్నావుగా. నువ్వడుగుతావా మా అమ్మని"

"ఏంటరుణా- చిన్నపిల్లలా ఎమ్మే పాసయినా-"

"ఈ ఇంట్లో వున్నంతకాలం నేను చిన్నపిల్లనే. ఈ ఇంట్లో వాళ్ళంతా నన్నూ నా పవిత్రతనూ కాపాడ్డమే ధ్యేయంగా పెట్టుకున్నారు. ఏం చెయ్యను?"

"ఏం చెయ్యనూ అంటావుగానీ చెయ్యాల్సింది చెయ్యవు. మీ అమ్మతో చెప్పిరా వెళ్ళిపోదాం. ఏమవుతుంది?"

"నీకు తెలియదు. చాలా గొడవవుతుంది."

"ఐతే అవనీ- కొన్ని గొడవలు భరిస్తే తరవాత ఇకవాళ్ళకూ నీకూ కూడా అలవాటవుతుంది. లే- ఇవాళట్రై చెయ్యి. సినిమాకుపోదాం" ఉమ అరుణను లోపలికి నెట్టింది.

అరుణ లోపలికి వెళ్ళి అద్దంలో చూసుకుంది. తల బాగానేఉంది. దువ్వనవసరంలేదు. బొట్టుంది. ఇంత పౌడరు ముఖానికి రాసుకుని చీరమార్చుకుంటుంటే కనకమ్మ రానే వచ్చింది.

"ఎక్కడికీ ప్రయాణమవుతున్నావు?"

"సినిమాకి" కుచ్చిళ్ళు సరిచేస్తూ అంది అరుణ.

"సినిమాకా? మీ నాన్నతో చెప్పావా?"

"చెప్పలేదు. ఉమ ఇప్పుడే అంది. అమ్మతో చెబుతాలే" అంటూనే వంటగదివైపు నాలుగడుగులు వేసింది.

"అమ్మా నేనూ ఉమా సినిమాకు పోతు న్నాం. ఆరింటికి వస్తాం. ఉమ ఇక్కడే భోంచేసి రాత్రికి వెళ్ళి పోతుంది." అంది.

ఆమాట అనేసి పరిగెత్తుతున్నట్టే బైటికి నడిచింది.

"ఇప్పుడేం సినిమా?" అంటూ బైటికొచ్చింది సీతమ్మ.

కనకమ్మ గడియారం వంక చూసి'

"ఒంటిగంటే అయింది. సినిమా ఏమిటి ప్పుడు? ఎక్కడికి పోతోందో?" అంది.

ఆడపడుచు మాటలకు సీతమ్మకు కళ్ళు నీళ్ళొచ్చేశాయి.

"దీని మూలాన ఎన్ని మాటలు పడాలో' అంటూ దిగులు పడింది.

సుశీల వినురుగా గది తలుపులు బిగించు కుంది.

నాలుగైదు గజాలు నడిచాక 'అమ్మయ్య' అని నిట్టూర్చింది అరుణ.

"ఏం సినిమాకి పోదాం?"

"నాకైతే ఏ సినిమాకు పోదామనిపించ టంలా. ఎక్కడన్నా కూచుని కబుర్లు చెప్పు కుందాం!"

"ఎక్కడ కూచుందాం?"

"యూనివర్సిటీకే పోదామా. గార్డెన్‌లో బాగుంటుంది. మన చెట్టుకిందే కూచుందాం. మళ్ళీ ఎన్నాళ్ళకు కూచుంటామో" ఉత్సాహంగా అంది అరుణ.

"బాగానే ఉంది. నేను వడీవడీ యూనివ ర్సిటీ నుంచి వస్తే మళ్ళీ యూనివర్సిటీకే పోదామంటావా? అందుకే అసలు నిన్ను రమ్మంటే—" విసుక్కుంది ఉమ.

"అబ్బ చెప్పానుగా ఉమా- నువ్వుకూడా నతాయించకు".

"సరే. పోదాం పద"

ఇద్దరూ బస్‌స్టాపులోకి నడిచారు.

యూనివర్సిటీ గార్డెన్‌లో ప్రతి స్టూడెంట్‌కీ ఒక్కోచోటు యిష్టమై వుంటుంది. ఉమా, అరుణా యిద్దరూ ఎప్పుడూ ఓ మోదుగ చెట్టుకింద కూచుంటారు. వాళ్ళు వచ్చేసరికి ఎవరైనా ఆ చోటులో కూచుంటే వాళ్లకు చాలా వినుగని పిస్తుంది. క్లాసులు ఎగ్గొట్టి గంటలు గంటలు ఆ మోదుగ చెట్టుకిందచేరి కబుర్లు చెప్పుకునేవారు.

"మన చివరి సమావేశం ఈ చెట్టుకిందే అవటం బాగుంది" అంది ఉమ చతికిలపడు తూ.

"చివరి సమావేశం, శాశ్వత సెలవులు, ఏమిటీ భాష? ఇక మళ్ళీ మనం కలును కోమా?"

"కలునుకుంటాంగానీ యిప్పటిలాకాదుగా. ఎవరం ఎలా మారతామో. ఎక్కడికి వెళ తామో"

"నేనెక్కడికీ వెళ్లను. ఈ ఊళ్ళోనే వుంటా"

"నే చేసుకోబోయేవాడిక్కూడా ఈ వూళ్ళోనే వుద్యోగమైతే నేనూ యిక్కడే వుంటా" వెక్కి రింతగా నవ్వింది ఉమ.

"ప్రకాశానికి ఈ వూళ్ళోనే వుద్యోగం వుంద నేగా! నాకీ హైద్రాబాదంటే యిష్టం. నాకు కాస్త జ్ఞానం వచ్చిన దగ్గర్నించీ యిక్కడే పెరిగాను. అందుకే యిష్టం. ఆ యిష్టానికీ ప్రకాశానికీ యేమీ సంబంధం లేదు" ఉడుక్కుంటూ అంది అరుణ.

"సరేగాని మీరు పెళ్ళి విషయం యేమన్నా మాట్లాడుకున్నారా? అసలా విషయం మాట్లాడుకునే టైం దొరికిందా లేదా?"

"ప్రకాశం వెంటనే పెళ్ళి చేసుకుందాం అంటున్నాడు. నేనే వాయిదా వేస్తున్నా"

"ఏం—ఎందుకని?"

"నాక్కూడా వుద్యోగం దొరికాక పెళ్ళి చేసుకుంటే బాగుంటుందనిపిస్తోంది. మళ్ళీ మా యింట్లో చికాకుల్ని తల్చుకుంటే వెంటనే పెళ్ళి చేసుకోవాలనిపిస్తోంది"

ఉమ పెద్దగా నవ్వింది.

"నవ్వుకాదు ఉమా— నా బాధ నీకు అర్థంకాదు. ఏ విషయంలోనూ నాకు స్వేచ్ఛ లేదు. ప్రతి చిన్న విషయానికీ వాళ్లందరి పర్మిషనూ తీసుకోవాలి. ప్రతి పైసకూ వాళ్ళను అడుక్కోవాలి. వాళ్లకి యిష్టముంటే యిస్తారు లేకుంటే లేదు. ఇవాళ సినిమాకు వెళ్దామన్నావు. నా దగ్గర పైసాలేదు- ఇప్పుడేకాదు

నేనెప్పుడన్నా స్నేహితుల్తో కలిసి సినిమాలకూ క్యాంటీన్లకూ వెళ్ళటం చూశావా? ఎప్పుడన్నా నీతో ప్రకాశంతో మాత్రం వస్తున్నాను. మీరిద్దరూ ఖర్చు పెడుతుంటే చూస్తూ కూచోవటం నాకెంత హీనంగా వుంటుంది?" అరుణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మన మధ్యతరగతి కుటుంబాల్లో డబ్బు చిక్కులూ పొదుపూ వుంటాయిలే- దాన్నంత సీరియస్‌గా తీసుకోకు"

"నిజంగా యిబ్బందిగా వుంటే నేను సినిమాలకీ షికార్లకీ డబ్బడిగి వేధిస్తానా? నీకు తెలియదు ఉమా. ప్రతి విషయానికీ నేను వాళ్ళమీద ఆధారపడాలి. లేకపోతే నాన్న నెలకో ఇరవై రూపాయలు నాకివ్వటం కష్టంకాదు. అసలు నేను నా స్వంతానికి ఖర్చు చెయ్యటమంటేనే వాళ్లకిష్టం వుండదు. మా అక్కకిమల్లే పదిహేను సంవత్సరాలకే పెళ్ళిచేసి పంపనందుకు యిపుడు మా మేనత్తకెంత పశ్చాత్తాపంగా వుందో! అన్నట్టు నేను అమ్మమ్మనయ్యాను తెలుసా?"

"అదేంటి?"

"ఏముంది. మా అక్క- రాంచీలో వుంటుందే. ఆవిడ కూతురికి యింకో కూతురు పుట్టింది. మా అక్కకు పదిహేనేళ్లకు పెళ్ళి చేశారు. పదహారోయేట కూతురు పుట్టింది. మా బావగారిది మాకంటే సాంప్రదాయిక కుటుంబం. వాళ్లమ్మాయికి కూడా పదహారోయేటే పెళ్ళిచేసి ఇపుడు తాత అయ్యాడు. ఈ రెండు రోజుల్నుంచీ యింట్లో మా మేనత్త చేసే గొడవ గొడవకాదు. అవతల నాకు మనవరాలు పుట్టేసింది- నాకేమో ఇంకా పెళ్ళేకాలేదు. సరైన సంబంధాలు రాకా, కట్నాలు పొయ్యలేకా నాపెళ్ళి చెయ్యలేదు- పెళ్ళి కుదరలేదుగదా అని నాన్న ఎలాగో నన్ను ఎం.ఏ. చదివించే ధైర్యం చేశాడు. ఇప్పుడిక దిగులు నాకు పెళ్ళే కాదేమోనని. ఆ దిగుల్ని కోపంగా మార్చి అదంతా నామీద క్రూరంగా చూపిస్తారు వీళ్ళు. ఒకరకంగా ఆలోచిస్తే ఎంత తొందరగా పెళ్ళి చేసుకుని ఆ యింట్లోంచి బైటపడి స్వేచ్ఛ పొందుదామా అని వుంది".

ఉమ మళ్ళీ పెద్దగా నవ్వింది.

అరుణ సీరియస్సయిపోయి "నీకు నవ్వుగా ఉందా? నీకేం- మీ యింట్లో నీకు స్వేచ్ఛ వుంది. మీవాళ్ళు నిన్ను హైదరాబాదులో హాస్టల్లో వుంచి చదివిస్తున్నారు. నాబాధ నీకేం అర్థంకాదు. నేనున్నది యింట్లో కాదు. జైల్లో " అంది బాధగా.

"అదికాదు అరుణా— మీయింటి సంగతి నాకు తెలియదా? అందుకుకాదు, స్వేచ్ఛకోసం పెళ్ళి చేసుకుందామనుకుంటున్న నీ ఆలోచనకు నవ్వొచ్చింది"

"అంత నవ్వొచ్చేదేమిటి నా ఆలోచనలో?" చిరాగ్గా అంది అరుణ.

"ఏమిటేంటి? అందరూ పెళ్ళయితే స్వేచ్ఛ పోతుందని గోలపెడుతుంటే నువ్వు స్వేచ్ఛ కోసం పెళ్ళాడతానంటే నవ్వురాదా?"

"నా సంగతి వేరులే-"

"ఏంవేరూ? మీయింట్లో వాళ్ళు మరికాస్త ఎక్కువ కట్టడి చేస్తారుగాని యించుమించు అందరిళ్ళల్లోనూ కట్టడి అనేది అలాగే వుంటోంది. నువ్వనుకునే స్వేచ్ఛ చాలా తక్కువమందికి వుంటుంది. కానీ పెళ్లయితే ఆ కాస్త స్వేచ్ఛా పోతుందేమో. మీ నాన్నా అమ్మా వదినా, అత్తా అందరి పాత్రల్నీ ప్రకాశం ఒక్కడే నిర్వహిస్తాడేమో—" నవ్వింది ఉమ.

"ఛీ— ప్రకాశం అలాంటివాడా? నీకు తెలియదా? ఎందుకలా మాట్లాడుతావు?"

"కాదులే— ప్రకాశం మంచివాడేలే. ఐతే పెళ్లయ్యాక స్వేచ్ఛగా సినిమాలకీ షికార్లకీ తిరుగుతానంటావ్- కానీ అప్పుడు ప్రకాశంతోనే కలిసి తిరగాలేమో"

"మరెవరితో కలిసి తిరుగుతాను?"

"ఔను- ఎవరితోకల్సి తిరుగుతావు? అపుడు ప్రకాశమే నీ ప్రపంచం ఔతాడు కాబోలు. నేనొచ్చి ప్యాసా సినిమా వచ్చిందే మనిద్దరం కలిసి చూద్దాం రమ్మంటే, ప్రకాశం నేనూ కలిసి చూడాలే- లేకపోతే ప్రకాశం బాధపడతాడు. కోప్పడతాడు. సారీ అంటావు కాబోలు-"

"నోర్ముయ్- అలా ఏం అనను. ముగ్గురం కలిసి చూద్దామంటాను."

"అంతేగాని ప్రకాశాన్ని ఒదిలి నాతో రావన్న మాట"



''ఏంటే నీగోల. వస్తాలే. ప్రకాశంతో ప్యాసా సినిమా చూడను. సరేనా! హైద్రాబాదులో ప్యాసా సినిమా ఎప్పుడొచ్చినా నీకో టెలిగ్రాం యిచ్చి నువ్వొచ్చేదాకా ఆగి, నువ్వొచ్చాక ప్రకాశాన్ని ఒదిలి మనిద్దరం చూద్దాం. సరేనా?''

ఉమ తెరలు తెరలుగా నవ్వింది.

''ఇక ఆపు నీ నవ్వు'' అరుణ చిరాకుపడింది.

''కాదు అరుణా- ఇప్పుడు మీ యింట్లోవాళ్ళు వాళ్ళ పరిధిలోనే నువ్వుండాలని అనుకుంటున్నారు. నువ్వాపరిధి ఎక్కడ దాటతావోనని భయపడుతున్నారు. ఈ పరిధి నీకు యిష్టంలేదు గనుక నువ్వెలాగోలా బైటపడాలని చూస్తున్నావు. నీకిష్టమైన ప్రకాశం పరిధిలోకి వెళ్ళాలని చూస్తున్నావు.''

''నువ్వింకోసారి ఆ పరిధి అన్నమాట పలికావంటే చంపేస్తా. చిన్నప్పటి పరిధీ వైశాల్యం లెక్కలు గుర్తొస్తున్నాయి'' కసురుకుంది అరుణ.

ఉమ మళ్ళీ నవ్వి అరుణ వొళ్ళో తలపెట్టుకుని పడుకుంది.

''ఊఁ చెప్పు'' అంది అరుణ అసహనంగా.

''ఏం చెప్పను?''

''అదే- నేను ప్రకాశం పరిధిలోకి వెళ్ళి''

''ఆ మాట వొద్దన్నావుగా.''

''ఆమాట వొద్దులే. ఇంకో మాటతో చెప్పు.''

''ఏంలేదే పిచ్చిదానా. ప్రకాశం మంచివాడే. నేనేదో తమాషాకు మాట్లాడుతున్నాను. నువ్వు పెళ్ళి చేసుకుని స్వేచ్ఛగా వుండు సరేనా?''

''ఎగతాళి చేస్తున్నావు'' అలిగింది అరుణ.

''మరి నువ్వు చిన్నపిల్లలా పెళ్ళి చేసుకుని స్వేచ్ఛగా వుంటానంటే యేం చెయ్యను? పెళ్ళి చేసుకుని ఆ సంసారంలోపడితే స్వేచ్ఛ అనే మాట గుర్తు చేసుకోటానిక్కూడా టైముండదు. ఇల్లూ, అంట్లూ, వురుళ్ళూ, పిల్లలూ-''

''ఛీ- ఛీ''

''అంతేమరి. మీరు ప్రేమించుకున్నారు గనకా, ప్రకాశం నాక్కూడా తెలుసు గనకా వూరుకుంటున్నానుగాని లేకపోతే నిన్నసలు పెళ్ళి చేసుకోనిచ్చేదాన్నేనా? ప్రకాశంతో జీవితం

బాగానే వుంటుందిలే. భయపడకు." అరుణ ముఖం చూసి అనునయంగా అంది ఉమ.

"నువ్వెప్పటికీ పెళ్ళి చేసుకోవా?" ఆలోచిస్తూ అంది అరుణ.

"ఊఁహు"

"మరేంచేస్తావ్?"

"పెళ్ళి చేసుకోకపోతేనే చెయ్యటానికి చాలా పనులుంటాయి. నాకు సబ్జక్ట్ అంటే ఎంత యిష్టమో నీకు తెలియదా? నేను రిసెర్చి చేస్తాను. నా సబ్జక్ట్‌లో నేను చేరగలిగినంత ఎత్తుకి చేరతాను. అదే నా ధ్యేయం" స్థిరంగా పలికింది ఉమ.

"పెళ్ళి చేసుకుని ఆపని చెయ్యగూడదా?"

"పెళ్ళి అంటూ అయితే యిక అన్నీ అందులో కొట్టుకు పోవాల్సిందే- పెళ్ళయితే స్వేచ్ఛ వుండదు. నేను రాత్రింబగళ్ళూ లాబ్‌లో గడిపితే చేసుకునేవాడు వూరుకుంటాడా? నేనొక్కదాన్నే అయితే నా యిష్టం. నా యిష్టమైతే వొండుకుంటా లేకపోతే హొటల్లో తింటా. నా యిష్టమైనంతసేపు పనిచేసుకుంటా. ఇష్టమైనపుడు రిలాక్స్ అవుతా. ఎవరికోసమో నేను ఆగాల్సిన పని వుండదు. అందుకే నాకు నవ్వొచ్చింది. నేను స్వేచ్ఛ పోతుందని పెళ్ళి వొద్దనుకుంటుంటే నువ్వు స్వేచ్ఛకోసం పెళ్ళాడతానంటున్నావని-"

అరుణ ఆలోచనలోపడి మౌనంగా కూచుంది.

"ఏమిటే- నీ మూడ్ పాడుచేశానా? నాకంటే రిసెర్చి పిచ్చివుంది గనుక పెళ్ళి వొద్దనుకుంటున్నాను. నీకేంటి- ప్రకాశం నిన్నెంతో ప్రేమిస్తాడు. నీ జీవితం చాలా బాగుంటుంది."

"ప్రకాశం మంచివాడేనే"- సంజాయిషీ చెబుతున్నట్లు అంది అరుణ.

"అరే పిచ్చిమొహమా- కాదని ఎవరన్నారూ? నేను సరదాగా అన్నాను. పెళ్ళి చేసుకుని కూడా నువ్వు స్వేచ్ఛగా వుండొచ్చు"- అరుణ నెత్తిమీద కొడుతూ అంది ఉమ.

"ఐనా నేను వుద్యోగం వచ్చే వరకూ పెళ్ళి చేసుకోనులే-"

"ఔను. అలాచెయ్యి. స్వేచ్ఛకు ముందు కావాల్సింది డబ్బు. లే- కాంటీన్‌కి వెళ్ళి టీ తాగుదాం పద" లేచింది ఉమ.

ఇద్దరూ కాంటీన్‌కి నడిచి అక్కడ టీతాగి ఆర్ట్స్ కాలేజీ దగ్గర నుంచున్నారు.

"రిసెర్చి యిక్కడే చెయ్యగూడదూ?"

"ఏమో- సీటు రావాలిగా. నాకైతే ఢిల్లీ వెళ్ళాలనే వుంది"

"నాకు నాగార్జునా యూనివర్సిటీ అంటే యెంత యిష్టమో నీకు సీటు యివ్వకుండా యిక్కడకు పంపారని. ఆ ఢిల్లీవాళ్ళు కూడా నీకు సీటు యివ్వకపోతే బాగుండు."

"ఆమాట అనకు తల్లీ. నాకూ ఉస్మానియా యూనివర్సిటీ అంటే యిష్టమే- వేరే యూనివర్సిటీల నుంచి వచ్చిన వాళ్ళకోసం కాసిని సీట్లుంచారని"

ఇద్దరూ నవ్వుకున్నారు.

"రెండేళ్ళు ఎలా గడిచిపోయాయో గదా" అంది అరుణ.

"ఔను. నిన్ను పలకరించిన మొదటిరోజు నాకింకా నిన్న మొన్న జరిగినట్లుంది. నీచేతిలో 'కృష్ణపక్షం' చూసేసరికి నువ్వంటే యెంత ప్రేమ కలిగిందో! వెంటనే పలకరించేశాను. నేనడిగిన మొదటి ప్రశ్న గుర్తుందా?"

"ఈ పుస్తకంలో మీకిష్టమైన కవితలు రెండు చెప్పండి అనేగా"

"నువ్వు "స్వేచ్ఛాగానమూ", "అబ్బ!" అనే పేర్లు చెప్పగానే నేనేంచేశాను?"

"నన్ను కావలించుకుని ముద్దుపెట్టుకున్నావు. సరేగాని నన్ను ప్రకాశం పలకరించింది కూడా ఆ రోజే. అంతకుముందు వొట్టి చూపులే తప్ప మాటలులేవు. మీరిద్దరూ నా జీవితంలోకి ఒక్కరోజే ఎలా వచ్చేశారోగదా"

కాసేపు యిద్దరూ ఆనందంలో మునిగి మౌనందాల్చారు.

"ఇక వెళ్దామా" ఉమ అడిగితే నీరసంగా "ఊఁ" అంది అరుణ. బస్‌దిగి యింటికి నడుస్తుంటే అరుణ మామూలుగాలేదని గ్రహించింది ఉమ.

"అరుణా- ఏంజరగదులే. నేనున్నానుగా.

ఊరికే వర్రీ అవకు''

"ఎందుకో నాకే తెలియకుండా నేను గిల్టీ అయిపోతాను ఉమా! వాళ్ళేం అనక్కరలేదు. వాళ్ల చూపులు చాలు. నేనేదో మహాపాపంచేసిన ఫీలింగు కలుగుతుంది. నేనేదో సంజాయిషీ యిచ్చుకోవటం, వాళ్ల వెటకారాలూ, అజ్ఞలూ, మా అమ్మ ఏడుపులూ యివన్నీ యెంత చెత్తగా వుంటాయో- వాటన్నిటినీ భరించటంకంటే నోరు మూసుకుని యింట్లో కూచోటం వుత్తమం అనిపిస్తుంది."

ఇద్దరూ మౌనంగా యింట్లోకి నడిచేసరికి వాతావరణం యేదోగానే వుంది. వీళ్లనెవరూ గుర్తించినట్టు కనపడలా. ముఖాలు మాడ్చుకుని యెవరి పనుల్లో వాళ్ళున్నారు. జానకీరామయ్య పడక్కుర్చీలో కళ్ళు మూసుకుని పడుకున్నాడు. గోపాల్రావు పేపరు చదువుకుంటూ మధ్యగదిలోనే వున్నాడు.

అరుణ కాసేపటూ యిటూ తిరిగి ఉమను "స్నానం చేస్తావా?" అనడిగింది.

ఉమ తలూపి బట్టలు తీసుకుంది. అరుణ బకెట్‌తో నీళ్ళు బాత్‌రూంలో పెట్టివచ్చింది.

"అరుణా" జానకీరామయ్య పిల్చాడు.

అరుణ నెమ్మదిగా తండ్రి దగ్గరకు వెళ్ళింది.

"ఎక్కడికి వెళ్ళావూ?" పంచాయతీ ప్రారంభమయింది.

"యూనివర్సిటీకి"

"సినిమాకన్నావుగా" మేనత్త కనకమ్మ రానే వచ్చింది.

"సినిమాకనే బయల్దేరాంగానీ మళ్ళీ వొద్దని యూనివర్సిటీకి వెళ్ళాం" సినిమాకేనని యెందుకు చెప్పలేదా అనుకుంటూ చెప్పింది అరుణ.

"యూనివర్సిటీ కెందుకు? శెలవలేగా" సీతమ్మ అడిగింది.

"యూనివర్సిటీకో మరెక్కడికో మనకు అసలు సంగతి చెబుతారా వీళ్ళు- వాళ్ళేం చెబితే అది నమ్మాల్సిందే" కనకమ్మ అరుణమీద కసి తీర్చుకుంది.

"అంటే నేనెక్కడకు వెళ్ళానని నీ వుద్దేశం?" కోపంగా అడిగింది అరుణ.

"నువ్వెక్కడికి వెళితే నాకెందుకు తల్లీ. నామీద నీకు కోపం రావటం- నేను మాటలు పడటం. మీ అమ్మా నాన్నా వున్నారు. మధ్యలో నేనెవర్ని" ఆవిడ నాలుగడుగులు వెనక్కువేసి నుంచుంది.

"ఊరికే యే పనీ లేకుండా తిరగటం యెందుకంటా. రోజులసలే బాగాలేవు. నువ్వొచ్చేదాకా అందరం గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకు యెదురుచూడాలి" జానకీరామయ్య విసుక్కున్నాడు.

"మన భయం సంగతి దానికెందుకు నాన్నా. దాని సరదాలు దానికి కావాలి. మనం భయపడ్డా వీధిలో తలొంచుకోవాల్సి వచ్చినా దానికేం లెక్కలేదు." గోపాల్రావు పేపరు అవతలపడేసి నుంచున్నాడు.

"మీకెందుకండీ- పెద్దాయన ఆయనున్నారు. ఆయన కూతురి విషయం ఆయన చూసుకుంటారు. మీరేమన్నా పెద్దరికం వహించబోతే నీ అంత నేనూ చదివాను నీ లెక్కేమిటి అంటుంది. మీకెందుకంటా" సుశీల అందుకుంది.

ఉమ బాత్‌రూంలోంచి రావటంతో అందరూ ఎటువాళ్లటు వెళ్ళారు. అరుణ బాత్‌రూంలో దూరి కాసేపు యేడ్చి ముఖం కడుక్కొని వచ్చింది.

ఉమ యెక్కడా కనపడలేదు.

"ఉమేది?" అని అడిగింది సుశీలని.

"ఏమో- యెవరికి తెలుసూ" విసురుగా అంది సుశీల.

"డాబామీదికి వెళ్ళినట్టుంది" సీతమ్మ చెప్పింది.

అరుణ డాబా ఎక్కింది.

"ఏంటీ - సీరియస్‌గా వున్నారందరూ - నీకు క్లాసు తీసుకున్నారా?"

"ఆఁ- అయిపోయిందిలే ఆగోల. పోనీ - ఇంకాసేపట్లో వెళ్ళిపోతావు. కబుర్లుచెప్పు."

"కబుర్లకేం కావాల్సినన్ని - సరేగాని మర్చిపోయాను. ప్రకాశంరాసిన ఉత్తరాలన్నీ నాదగ్గరే వున్నాయి. తెచ్చాను. తీసుకొని దాచుకో"

అంది ఉమ.

"ఒద్దు ఉమా - నాకు దాచుకోటానికి ఈ యింట్లో కాస్త జాగాకూడా లేదు. అన్ని వుత్తరా లు ఎక్కడపెట్టను? నాకంటూ ప్రత్యేకంగా చిన్న అట్టపెట్టెకూడా లేదు. ఒకవేళవున్నా అందరూ చూస్తారు. చూసేదాకా ఎవరికీ నిద్ర పట్టదు. నీదగ్గరే వుంచు."

ఉమ మాట్లాడలేదు.

"మా పెళ్ళయ్యాక మేమిద్దరం కలిసి నీద గ్గరకువచ్చి ఆ ఉత్తరాలు తీసుకుంటాంలే-"

"పెళ్ళి పెళ్ళి అంటున్నావు. యేమన్నా ఆలోచిస్తున్నావా? మీవాళ్ళెలాగూ వొప్పుకోరు. యెలా కుదురుతుంది? బాగా గొడవచెయ్యు రూ?"

"అసలు వాళ్ళకి చెప్పను. వాళ్లను వొప్పించు దామనుకోవటం వెర్రితనం. రిజిష్ట్రేషన్ చే యించుకొని ఒక రోజు యిక్కడినుంచి ప్రకాశం దగ్గరకు వెళ్ళిపోవటమే. తర్వాత వుత్తరం రాస్తాను. వస్తే వస్తారు. లేకపోతేలేదు. ముందు వాళ్ళకు తెలిసిందో నన్ను చంపనైనా చంపుతా రుగాని పెళ్ళి జరగనివ్వరు. ఆ రహస్యం బైట పడకుండా చూడటమే నావని... ప్రస్తుతం."

"పెళ్ళి విషయంలో నీకేసాయం కావాలన్నా గుంటూరు వచ్చెయ్ అరుణా. మా వాళ్ళు గొప్పవాళ్ళుకాదుగానీ కొంతవరకూ విషయాల్ని అర్థం చేసుకుంటారు. నువ్వేమీ సందే హించకు నా దగ్గరకు వచ్చెయ్-"

ఉమ చేతిని ప్రేమగా నొక్కింది అరుణ.

ఎనిమిదింటిదాకా కబుర్లు చెప్పుకుని కింది కి దిగివచ్చారు. అరుణ యిద్దరికీ అన్నంపె ట్టింది. భోజనాలుచేశాక యిద్దరూ వాకిట్లో నుంచుని ఖాళీగా పోతున్న ఆటోని ఆపారు.

"ఉమా - సారీ - నిన్ను బస్సెక్కించటానికి రాలేను."

"ఏడిశావులే - ఇంత రాత్రి మళ్ళీ వొక్కదా నివే రావొద్దూ. నీకెంత స్వేచ్ఛగా తిరగాలని వున్నా పరిస్థితుల్ని కూడా గమనించుకోవాల మ్మాయ్-"

పెట్టె ఆటోలో పెట్టించి యెక్కి కూచుంది ఉమ.

"ఉత్తరాలు రాస్తావుగా" బెంగగా అడిగింది అరుణ.

"ఊఁ- మరి శలవల్లో యింకేం పనుంది?"

"జాగ్రత్తగా రాయి. సెన్సారవుతాయి"-

"అబ్బా -బోర్ - సరేలే"-

ఆటో కదిలిపోయింది. అరుణ గేటువేసి లోపలికి వెళ్ళి యెవరితోనూ మాట్లాడకుండా దుప్పటిముసుగు పెట్టుకుని పడుకుంది.

ఇంట్లో వాతావరణం గురించి ఆలోచించాల నిపించలేదు. ఉమ ఎంత మంచిది. పెళ్ళి గురించి ఎంతబాగా ఆలోచించింది. నిజంగానే పెళ్ళయితే యిల్లూ పిల్లలూ వీటిల్లో చిక్కుకుపోతే యింక స్వేచ్ఛేమిటి? కానీ పెళ్ళి లేకుండా యీ యింట్లో యింక తనుండలేదు. అందులో ప్రకాశాన్నివొదిలి.

ప్రకాశానికి తనంటే యెంతో ప్రేమ.

మా ప్రేమతో స్నేహంతో యెంతో హాయిగా వుంటాం

కలిసి పనిచేసుకుంటాం.

ప్రతి విషయం కలిసి ఆనందిస్తాం.

ఒకరి కోరికలు వొకళ్ళం అర్థంచేసు కుంటాం.

ఐదేళ్ళ తర్వాత పిల్లల్ని కనొచ్చు. పిల్లల్ని స్వేచ్ఛగా పెంచుతాం.

నా యిల్లంటూ నాకుండి నాగురించి ఆరా లుతీసి నన్నదుపులో పెట్టేవాళ్ళు లేకుండా వుంటే చాలు. ప్రకాశంతో అలాగే వుంటాను.

ఈ సారి ప్రకాశంతో యీ విషయం మాట్లా డాలి. "పెళ్లయ్యాక కూడా స్నేహంగా వుండాలి ప్రకాశం" అని చెప్పాలి.

అమ్మా నాన్నల్లా, పిల్లీ ఎలకల్లా వుండగూడ దు.

ప్రకాశంతో మాట్లాడాలి...!

★ ★ ★

అరుణ పార్కులోకి వస్తూనే ప్రకాశంకోసం వెతికింది.

సికింద్రాబాదు కంటోన్మెంటు ప్రాంతంలో వున్న ఆ పార్కు చాలా చిన్నదే. పార్కులో కూచుని


అందం – ఆరోగ్యం
JEEVANTONE
బలహీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.
జీవన్‌టోన్ లేబుల్‌ను కంపెనీకి పంపి పెద్ద బహుమతి టికెట్‌ను పొందండి
ఒక సీసా తాగింతర్వాత ఇంకా ఎన్ని సీసాలు తాగాలో మీరే నిర్ణయిం చేసుకోగలరు
ఆరోగ్యంగా లేకపోతే రోగాలపాలవుతారు
మంచి ఆరోగ్యం, బలం, శక్తి పుష్టిగా కండరాలు పొందిన తర్వాత ఈ మందును ఆపివేయడం మంచిది
'' MFG. LICENCENO. AUS 59/75''
Contact our new sole Distributors
M/S. New Shakti Pharma,
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
Phone: 2866
JEEVANTONE
వి.పి.పి. కొరకు
జీవన్‌టోన్ ప్రొడక్ట్స్
పి.బి.నం. 880,17/2
కెంపిడ్డి రోడ్
బెంగుళూర్-560 008
450 Grams Rs. 36/-
SINDU

ఆనందించటానికి అక్కడికెవరూ రారు. నిద్ర బోయే కూలీలతో, ఆడుకునే పిల్లలతో నిండి వుంటుంది.

ఆ ప్రాంతంలో అయితే తెలిసిన వాళ్ళెవరూ కనవడరని ఆ పార్కు యెంచుకున్నారు అరుణ, ప్రకాశం. క్రమంగా ఆపార్కుతో అనుబంధంపెరిగి అదేయిష్టమై పోయింది.

ప్రకాశం ఎర్రపూల చెట్టుకింద కూచుని యెటో చూస్తున్నాడు. అరుణ వెళ్ళి పక్కన కూచున్నాకగాని అతను అరుణను గమనించ లేదు.

"నాకోసం యెదురుచూస్తుంటావని హడావుడిగా వచ్చాను. తీరా చూస్తే నువ్వేదో ఆలోచనల్లో వున్నట్టున్నావు. నా హడావుడి అంతా అనవసరమేనా?" నవ్వింది అరుణ.

"నీ గురించిన ఆలోచనలు నీకంటే బాగున్నాయి. నాకు నువ్వు తప్ప యింకో లోకంలేకుండా పోయింది. ప్లీజ్ - నా చెయ్యి పట్టుకుని నన్నీ లోకంలోకి తీసుకురావూ?" దీనంగా ముఖం పెట్టాడు ప్రకాశం.

ఫక్కున నవ్వింది అరుణ.

"నన్నేం చెయ్యమంటావ్?"

"నన్ను వెంటనే పెళ్ళిచేసుకో"

"పెళ్ళంటే భయంగావుంది"

"అర్థంలేదు, అరుణా - ఈ విషయం యికనాన్చటం నాకేంబాగోలేదు. సీరియస్‌గా మాట్లాడు. ఎప్పుడు మనపెళ్ళి?"

అరుణ ప్రకాశం ముఖంలోకి చూసింది. ప్రకాశమంటే ప్రేమ హృదయమంతా నిండిపోయింది.

అదే క్షణంలో ఉమ మాటలు కూడా గుర్తొచ్చాయి. పెళ్ళంటే గానుగెద్దు జీవితం. ఇల్లూ పిల్లలూ తప్ప మరో లోకం లేకుండా బతుకంతా గడవటం అంటే భయంగానే వుంది. కానీ ప్రకాశం లేకుండా జీవితాంతం ఆ యింట్లో, ఆ నరకంలో వుండగలదా? అసలు వాళ్ళుండనిస్తారా? ప్రకాశమంటే తనకెంతో ప్రేముందీ ఈ భయం దేనికి? ప్రకాశం ప్రేమగా మాట్లాడుతుంటే యిష్టంగా నవ్వుతుంటే ముద్దు పెట్టుకోవాలనిపిస్తుంది. అతన్ని గుండెలకు హత్తుకోవాలనిపిస్తుంది. పెళ్ళి కాకుండా యెలా?

"ఎన్నాళ్ళు ఆలోచిస్తావు అరుణా"

అరుణ ఈలోకంలోకి వచ్చింది.

"మనసువిప్పి మాట్లాడు. ఎందుకింకా ఆలస్యం?"

"ఏం లేదు ప్రకాశం - పెళ్ళంటే యే ఆడపిల్లకయినా భయంగానే వుంటుంది. నాకూ భయంగానే వుంది. నిన్న మా ఉమమాటలు విన్నాక యింకాస్త భయం పెరిగింది."

భయమేమిటి? ఎందుకు? నాకులేని భయం నీకొక్కదానికే యెందుకు? ఏమంటుంది మీ ఉమ." కాస్త చిరాగ్గా అన్నాడు.

"ఎందుకంటే - పెళ్ళయిన తర్వాత నీ జీవితం యేమీమారదు. మారినా అంతా నీకనుకూలంగా నీకు సుఖంగావుండేలా మారుతుంది. నా జీవితం అట్లా కాదు-"

"అదేంటి? నేను సుఖంగావుండి నిన్ను కష్టపెడతానా? నిన్ను-నా ప్రాణాన్ని-" విస్తుపోయినట్లు చూశాడు ప్రకాశం.

"నేచెప్పేది విను. నువ్వు నన్ను తిట్టవు. కొట్టవు. ప్రేమగానే చూస్తావు. మరి ఆ ప్రేమకు ప్రతిఫలంగా - నేనేం చెయ్యాలి?"

"నన్ను ప్రేమించాలి!"

"ప్రేమించటం అంటే ఏమిటి? ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకోవటమేనా? అది పెళ్ళికాక ముందు. పెళ్ళయ్యాక ఆడదాని ప్రేమ ఆవిడ చేసే సేవల్లో కనవడుతుంది మగవాళ్ళకి. మనిద్దరం పెళ్ళిచేసుకుంటాం. కలిసి వుంటాం. పొద్దున్నే నేను కాఫీచేసి నీకిస్తే ఆ కప్పులో నా ప్రేమ కనవడుతుంది నీకు. అలాగే నేను వొండిపెట్టే తిండిలో, నేను వుతికే బట్టల్లో, నేను చేసే పరిచర్యల్లో వీటిల్లో ప్రేమ కనిపిస్తుంది. క్రమంగా నేనోవ్యక్తిగా కనవడటం మానేసి

బాగా మన్నుతున్న వస్తువులా కనపడి-"

"అరుణా - అర్థం లేకుండా మాట్లాడకు. నువ్వు తిండి వొండిపెడతావనా నిన్ను ప్రేమిస్తున్నాను. తిండి వొండకపోతే ప్రేమించనా? నీ అందం, తెలివీ, ప్రతి విషయాన్నీ సున్నితంగా ఆలోచించే నీమననూ వీటిని ప్రేమిస్తున్నాను గాని - నువ్వు కాఫీచేసి యిస్తావనీ, వంటచేసి పెడతావనీ ప్రేమిస్తున్నానా? పోనీ అవన్నీ నేనేచేసి పెడతాలే - పెళ్ళికి వొప్పుకో-"

నవ్వింది అరుణ

"పెళ్ళయ్యాక ఆడవాళ్ళకు స్వేచ్ఛ పోతుందంటుంది ఉమ. నాకిప్పుడు స్వేచ్ఛలే నేలేదు గనక పోయేసమస్యే లేదు. నా సమస్యంతా పెళ్ళితో స్వేచ్ఛ పొందగలనా అని - ఇవాళ నేను నాలుగు గంటలకు యింటి నుంచి బయలుదేరాను. ఆరింటికల్లా మళ్ళా యింట్లో వుండాలి. అబద్ధం చెప్పి యిక్కడికి వచ్చాను. రాత్రి పడుకోబోయేంతవరకూ ఈ అబద్ధం యెవరికన్నా తెలిసిందేమో, అదెప్పుడు యెలా బద్దలవుతుందో, యెంత అవమానం భరించాలో అనే చిత్రహింస పడుతూనే వుండాలి. అదో కథ. కానీ పెళ్ళయ్యాక - పెళ్ళయ్యాకయినా, నేనొక్కదాన్నీ యిలా పార్కులో, యింకో ఫ్రెండుతో మాట్లాడుతూ కూచోగలనా? నువ్వొక్కడివే వుంటావనీ, నువ్వే మనుకుంటావోననీ, నీకు భోజనానికి యిబ్బంది అవుతుందేమోననీ లక్ష అనుమానాలతో భయాలతో సందేహంతో మనసుపాడయిపోదూ? నాకు భవిష్యత్తులోనన్నా స్వేచ్ఛగా వుండాలని వుంది. నా టైము నాయిష్టం వచ్చినట్లు గడపాలి. ఆరుకాదు పన్నెండు గంటలకు యిల్లు చేరినా యెవరికీ సంజాయిషీ యిచ్చుకోనవసరం లేకుండా గడపాలని -"
ఆగింది అరుణ.

"నువ్వెంత అర్థంలేకుండా మాట్లాడుతున్నావే, నన్నెంత అపార్థం చేసుకుంటున్నావో ఆలోచిస్తే నీకే తెలుస్తుంది. నేను నిన్ను హింసించి కాల్చుకు తింటానన్నట్టు నువ్వెందుకు ఆలోచిస్తున్నావో నాకు తెలియటంలేదు.-"

కోపంతో ప్రకాశం ముఖం ఎర్రగా కందింది. మాట్లాడకుండా కూచున్నాడు.

అరుణకు దిగులనిపించింది.

పాపం ప్రకాశం మంచివాడే. తననింత ప్రేమించే ప్రకాశాన్ని వొదులుకోగలదా? ఆయింట్లో యింకా యెక్కువ రోజులుంటే తనకు పిచ్చెక్కిపోతుంది.

'నాకు ఉద్యోగంరానీ ప్రకాశం' అనునయంగా అంది.

"అప్పుడు ఆలోచిస్తావా?" ప్రకాశం గొంతుకాస్త కఠినంగా వుంది.

"కాదు-వుద్యోగం రాగానే పెళ్ళిచేసుకుందాం."

"అరుణా - నిజంగానా?" ప్రకాశం అరుణ చేతిని తన చేతిలోకి తీసుకొని ముద్దాడాడు.

"అరుణా - నువ్వు వుద్యోగం చేద్దువుగాని. నాక్కూడా అదే యిష్టం. కానీ వుద్యోగం దొరికే వరకూ పెళ్ళివాయిదా యెందుకు? నాది మంచి వుద్యోగమే. మనకేం యిబ్బంది వుండదు. నీ వుద్యోగం నెమ్మదిగా చూసుకోవచ్చు."

"కాదులే ప్రకాశం. వుద్యోగం దొరికాకే పెళ్ళి" ఖచ్చితంగా అంది అరుణ.

'సరే నీయిష్టం' ప్రకాశం అరుణ భుజం మీద చేయివేశాడు.

"ఇక వెళదాం" అంది అరుణ చుట్టూచూస్తూ.

"అప్పుడే - ఐదుంపావే అయింది"

"ఇల్లు చేరేసరికి ఆరవనే అవుతుంది. టైముకి వెళ్ళితే వాళ్ళకీ నాకూ కూడా శాంతి" లేచింది.

* * *

ఇంట్లో అందరూ తనగురించి అంత హడావుడి పడటం అరుణకు కాస్తకొత్తగా అనిపించినా సంతోషంగా కూడా వుంది. ప్రైవేటు జూనియర్‌కాలేజీ వాళ్ళు లెక్చరర్లు కావాలని పేపర్లోవేస్తే అప్లికేషను పెట్టింది అరుణ.

వాళ్ళు ఇంటర్వ్యూకు పిలిచారిప్పుడు.

ఇంట్లో కనకమ్మ తప్ప మిగిలిన అందరూ సంతోషంగానే వున్నారు.

కనకమ్మ మాత్రం "అవతల మనవరాలు పుట్టింది - ఇదేమో పెళ్ళి పెటాకులు లేకుండా వూళ్ళమీదికి బయల్దేరుతుందా. ఆ పెద్దపిల్ల తలవంచమంటే వంచింది. ఎత్తమంటే ఎత్తింది. ఇది ఎడ్డెమంటే తెడ్డెమంటుంది. ఇక వుద్యోగం కూడావస్తే మన్ని లెక్కచేస్తుందా" అంటూ దీర్ఘాలు తీసింది.

గోపాల్రావు అరుణను స్కూటర్ మీదతీసుకెళ్ళి దించుతానన్నాడు.

అరుణ ఆశ్చర్యపోయింది.

మామూలుగా అరుణను స్కూటరెక్కించుకోవటం నామోషీవని గోపాల్రావు దృష్టిలో. వీళ్ళందరి ప్రవర్తనకూ ఆశ్చర్యపోతూ, యింటర్వ్యూ యెలా చేస్తానోనని కంగారుపడుతూ, ఆనందం ఆందోళనా మనసుని కమ్మేసి నీరసపడిపోయింది అరుణ.

కాలేజీ దగ్గర గుంపును చూసేసరికి ఆ నీరసంమరింత ఎక్కువైంది.

ఇంతమందిలో తనకు వుద్యోగం వస్తుందా?

తన క్లాస్‌మేట్స్ యిద్దరు కనిపిస్తే వాళ్ళదగ్గరికే వెళ్ళికూచుంది.

"నువ్వొచ్చావు. ఇకమేం వెళ్ళిపోవచ్చు" అంది వాళ్ళల్లో ఓ అమ్మాయి.

"అదేం" ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"మీవాళ్లదే యీకాలేజీ. మాకెందుకు ఇస్తారూ?

అరుణకు చిరాకేసి యేమీమాట్లాడకుండా కూచుంది.

కులాన్ని బట్టి వుద్యోగాలు దొరికేమాటనిజమేగాని, తనకసలు ఈకాలేజీ వాళ్ళది యే కులమో తెలియదు. తనది తప్పన్నట్లు మాట్లాడుతుందేం- పైగా తన కులం నుంచి తనొక్కతే వచ్చిందా-చాలామంది వచ్చే వుంటారు. ఐనా కులాన్ని బట్టి వుద్యోగాలిచ్చేవాళ్ళు ముందే ఎవరోవొకర్ని ఆలోచించుకునే వుంటారు. ఇవన్నీ ఆలోచించకుండా తననంటే తనేంచేస్తుంది?

అరుణ ఆలోచనల్లో వుండగానే ఆ యిద్దరూ లోపలికి వెళ్ళటం రావటం కూడా అయిపోయింది.

"మేం వెళ్తున్నాం" అన్నారు వాళ్ళు.

"ఇంత తొందరగా అయిపోయిందేం? ఏమడిగారు వాళ్ళు?"

"ఏమీ అడగలా. ఊరికే ముఖంచూసి పంపించేశారు. ఉద్యోగం యిచ్చేబావతు కాదులే"

వాళ్ళు వెళ్ళిపోయారు.

ఇంకో నలుగురైదుగురి తర్వాత అరుణని పిల్చారు.

అరుణ భయం భయంగా లోపలికి వెళ్లింది.

నలుగురైదుగురు ఒక టేబుల్‌చుట్టూ కూచుని వున్నారు. అరుణ సర్టిఫికెట్లన్నీ చూశారు.

నల్లగా వున్న వొకాయన వున్నట్టుండి "కందోయి ఏ సంధో చెప్పమ్మా" అన్నాడు.

అరుణకు మెదడంతా ఖాళీ అయిపోయింది.

"పోనీ ఆ పదాన్ని విడదియ్యమ్మా"

అరుణ తేరుకుని 'కందోయి' పదాన్ని విడదీసి సూత్రం చెప్పింది.

"ప్రాచీన కవులలో నీకిష్టమైన కవి యెవరమ్మా" ఆ నల్లటాయన మళ్ళీ అడిగాడు.

ఏమీ అడగలేదని చెప్పారు. వీళ్ళిలా అడుగుతున్నారు అనుకుంటూ "శ్రీనాధుడండీ" అని జవాబిచ్చింది. ఆయనడిగిన వొక్కప్రశ్నే వంద ప్రశ్నల్లాగా తనకు అనిపిస్తోందని అరుణ గమనించలేదు.

"ఏది - శ్రీనాధుడి పద్యం ఒకటిచెప్పు"

మళ్ళీ బుర్ర ఖాళీ అయింది.

"ఒక్కటికూడా రాదా? చిన్నదైనా ఫరవాలేదు."

అరుణ రెండు నిమిషాలు ఆలోచించి "పంపావిరూపాక్ష" అన్న పద్యం చదివింది.

"బాగుంది. చక్కగా చదివావు. ఇక వెళ్ళమ్మా"



ఆమాట పూర్తికాకముందే అరుణ బైటకొచ్చి పడి వూపిరి పీల్చుకుంది.

ఉద్యోగం వస్తుందా, రాదా? అన్న ప్రశ్నకు నాలుగైదు రోజుల్లో సమాధానం దొరికింది.

ఉద్యోగం వచ్చింది.

కాలేజీవాళ్ళు అరుణను పిల్చి వుద్యోగం యిస్తున్నామని చెప్పారు. అరుణ ఆనందం నుంచి తేరుకునేలోగా యింకో విషయంకూడా చెప్పారు.

కాలేజీకి ప్రభుత్వగ్రాంటు లేకపోవటంవల్ల పూర్తి జీతం యివ్వలేమనీ, అయిదొందలుమాత్రం యిస్తామనీ, పూర్తిజీతం తీసుకుంటున్నట్లుగా సంతకం పెట్టాలనీ.

అరుణకు యేంచెప్పాలో అర్థంకాలేదు.

అరుణ ముఖంచూసి వాళ్ళే యింటికి వెళ్ళి ఆలోచించుకుని ఏవిషయం మర్నాడు పదిగంటలకు వచ్చి చెప్పమన్నారు. అరుణ యింటికి వచ్చి విషయంచెప్పింది.

"నీ మొహంచూసి ఈ అమ్మాయికి పూర్తి జీతం యివ్వకుండానే పనిచేయించుకోవచ్చు అనుకుని వుంటారు." నిర్దయగా అనేశాడు గోపాలరావు.

చివరకు జానకీరామయ్యా గోపాలరావూ కలిసి ఆలోచించి ఆ వుద్యోగంలో చేరమనే చెప్పారు.

అరుణ వాళ్ళ ఆలోచనలతో సంబంధంలేకుండానే వుద్యోగంలో చేరాలనే నిర్ణయం తీసుకుంది, అప్పటికే!

ముందు యేదో వొకదానిలో చేరితే మంచి వుద్యోగం నిదానంగా చూసుకోవచ్చు. అన్నిటికన్నా ముఖ్యం ప్రకాశం సంతోషిస్తాడు. తను తొందరగా ఈ యింటినుంచి బైటపడవచ్చు.

ఆ సాయంత్రమే మొదటిసారిగా ప్రకాశాన్ని అతనింటి దగ్గరకలిసింది అరుణ.

అరుణనుచూసి ప్రకాశం యెంత కంగారు పడ్డాడంటే యేదో ప్రమాదం జరిగిందనే అనుకున్నాడు.

అరుణ అలాంటిదేమీ జరగలేదని చెప్పినా నమ్మలేకపోతుంటే అరుణకిక అసలువిషయం వెంటనే చెప్పక తప్పలేదు.

"నిజంగా - ఆ కాలేజీలోనే - అమ్మయ్య. ఇక ఏ ఆటంకాలూ లేవుగా" అన్నాడు అరుణను దగ్గరకు లాక్కుంటూ.

"ఉండు. మీ యింటికొచ్చానని పిచ్చి వేషాలెయ్యకు - వాళ్ళు వుద్యోగం యిచ్చారు గానీ పూర్తిజీతం యివ్వరట"

"మరి-?"

"ఐదువందలే యిస్తారట. చేరనా? వొద్దా? నాకైతే. చేరాలనే వుంది"

ప్రకాశం ఆలోచనలో పడ్డాడు.

"గ్రాంటు వచ్చాక పూర్తి జీతం ఇస్తారట"

"ఏమో- వీళ్ళిలా వెట్టిచాకిరి ఎన్నేళ్లు చేయించుకుంటారో! మేనేజిమెంటు వాళ్ళతో చాలా గొడవలుంటాయి. మంచి ఉద్యోగం దొరుకుతుందిలే- కొంచెం ఆగితే-"

"మంచి ఉద్యోగం దొరికేదాకా ఇది చెయ్యొచ్చుగా. ముఖ్యంగా మన పెళ్ళికోసమైనా ఈ ఉద్యోగంలో చేరాలనిపిస్తోంది."

"నీదంతా పిచ్చిగాని ఈ అయిదు వందలు లేకపోతే మనకు జరగదా. నీకు పంతం ఎక్కువ. మన మధ్య నీడబ్బూ నాడబ్బూ అని చూస్తావా"

"కాదులే ప్రకాశం. డబ్బుల్లేక నేనెంత యిబ్బంది పడ్డానో నీకు తెలియదు. చిన్నచిన్న అవసరాలకు, అయిదూ పదీ కూడా నాన్ననూ అన్నయ్యనూ అడిగి, వాళ్ళు లేవంటే కుంగిపోయి- యిదంతా నీకర్థంకాదు. నా అవసరాలకు నేనెవర్నీ డబ్బడక్కుండా బతకాలి. నిన్నయినా సరే-"

"సర్లే సర్లే- ఆవేశపడకు. చేరు ఆ ఉద్యోగంలో. తర్వాత మంచిది చూసుకుందాం."

"రేపు పది గంటలకు వెళ్ళి చేరాలి."

"అరుణా- రేపే మనం రిజిష్ట్రారు ఆఫీసుకి యెందుకు వెళ్ళగూడదు?"

"వెళ్ళి-"

"వెళ్ళి రిజిష్టరు చేయించుకుందాం. నెలరోజులాగి సర్టిఫికెట్ తీసుకుని పెళ్ళయినట్లు అందరికీ చెప్పి పార్టీ యిద్దాం"

"నెలరోజులు ఆగాలా?"

"సర్టిఫికెట్ నెలరోజులకుగాని ఇవ్వరనుకుంటా. సర్టిఫికెట్ తీసుకునే వరకూ ఆగితేనే మంచిది. మీవాళ్ళు యేదన్నా గొడవపెట్టొచ్చుగా"

"నిజంగా నెలరోజుల్లో మన పెళ్ళయిపోతుందా?" ప్రకాశం కళ్ళల్లోకి చూస్తూ అడిగింది అరుణ

"నువ్వు ఒప్పుకుంటే యెప్పుడో అయిపోయేది. నువ్వు స్వేచ్ఛా స్వతంత్రం అంటూ ఉపన్యాసాలిచ్చి ఆపేశావు."

అరుణ చేతుల్ని ముద్దుపెట్టుకున్నాడు ప్రకాశం.

అరుణ ప్రకాశం వొళ్ళో తలపెట్టుకుని మౌనంగా ఉంది.

"ఏంటోయ్- మాట్లాడవు?"

"మాట్లాడాలనిపించటంలా"

"ఎందుకో?"

"ఎందుకో"— కలలోలా మాట్లాడింది.

ప్రకాశం అరుణ తలను ముద్దుపెట్టుకున్నాడు. తలుపు టకటకా మోగటంతో ఇద్దరూ వులిక్కిపడి లేచారు.

అరుణ కంగారుపడుతూ "ఎవరు?" అంది.

"ఎవరైనా ఫరవాలేదులేగాని- వచ్చింది మాత్రం చాకలి అయివుంటాడు" అంటూ తలుపు తీశాడు.

"అంకుల్ అగ్గిపెట్టె తెమ్మంది మా అమ్మ" అంటూ నాలుగేళ్ళ శిరీష లోపలికి వచ్చింది.

అరుణ మనసు కుదుటపడింది.

"పక్కింటి పాప శిరీష" అని చెబుతూ అగ్గిపెట్టె ఇచ్చాడు.

"పాప ముద్దుగా ఉందికదూ" అంది అరుణ.

"మన పాప ఇంకా ముద్దుగా ఉంటుంది."

అరుణ సిగ్గుపడిపోతుంటే ప్రకాశం హాయిగా నవ్వాడు.

"నే వెళ్తాను" లేచింది అరుణ.

"అప్పుడే—"

"చాలాసేపయింది. ఇంకెంత- నెలరోజులేగా. ఈ ఇంట్లోనే ఉందామా మనం" అరుణ

ఇల్లంతా చూస్తూ అంది.

"నీకిష్టమైతే ఉందాం. చూడు ఇల్లంతా ముందు"

"ఇల్లంతా- రెండు గదులేగా"

"ఎన్నిగదులు కావాలోయ్ నీకు. నాకైతే మనిద్దరికీ ఒక్కగది చాలనిపిస్తోంది"

అరుణ వంటింట్లోకి వెళ్ళి అక్కడి గందరగోళానికి భయపడి బైటికొచ్చేసింది.

"ఒకరోజొచ్చి ఇల్లంతా సర్దుకోవాలి"

"అబ్బో- అపుడే ఇల్లాలి లక్షణాలొచ్చేశాయే" వెక్కిరించాడు ప్రకాశం.

'ఇల్లు శుభ్రంగా ఉంచుకోవాలి ఎవరైనా?"

"సరే సర్దుకో. నన్నూ ఇంటినీ కూడా శుభ్రం చెయ్" తలవంచాడు.

"అసలు ఇల్లు మారదాంలే- ఇంకొక గదుంటే బాగుంటుంది"

"నీకు గదుల పిచ్చేమిటి. మనిద్దరం కలిసి ఒక్క గదిలోనేఉండమా? నీగది వేరూ నా గదివేరూనా?"

"అబ్బ- మనకికాదు. మనింటికి ఎవరైనా వస్తే వాళ్ళకోసం"

"చాలా ముందుచూపుందే- సరే మూడుగదుల ఇల్లు చూడాలి అంతేనా-"

"అంతే- నే పోతున్నా"

"రేపు పదిగంటలకు కాలేజీ దగ్గరకు వస్తాను. అక్కడినుంచి ఇద్దరం రిజిష్ట్రారు ఆఫీసుకి వెళ్దాం"

పావురాయికి మల్లే రెక్కలు విప్పుకొని ఆకాశంలోకి ఎగిరింది అరుణ మనసు.



"ప్రియమైన ఉమా—

జీవితం ఎంత వేగంగా నడుస్తోందంటే దాదాపు నెలరోజులకు గాని నీకు ఉత్తరం రాయలేకపోతున్నాను.

ఆగస్టు పదిహేనున దేశంతో పాటు నాకూ స్వతంత్రం వచ్చింది. అప్పుడే నెలయిపోతోంది నాకూ స్వతంత్రం వచ్చి.

ఈ నెలరోజుల్లో ఎన్ని సంగతులు, ఎన్ని విషయాలు!

ఎలా జరిగిపోతోందో కాలం.

మా పెళ్ళిరోజున నువ్వురాకుండా నీ టెలిగ్రాం వచ్చినందుకు నాకెంత కోపం వచ్చిందో. కానీ కోపం నిలుపుకునేలా లేదు నామనసు. సంతోషంతో పొంగి పొర్లుతోంది.

ఆగస్టు పదిహేను పొద్దున మామూలుగా ఇంటినుంచి కాలేజీకని బయలుదేరి ప్రకాశం దగ్గరికి వచ్చేశాను.

నాన్నకి ఉత్తరం రాసిపోస్టు చేశాను. మర్నాడు ఆఫీసుకి వెళ్ళి సర్టిఫికెట్లు తీసుకున్నాం.

ప్రకాశం స్నేహితులు నలుగురైదుగురూ, మన స్నేహితులు హేమా, వాణీ, పుష్పా వచ్చారు. అందరం కలిసి హొటల్లో భోజనం చేశాక మేం మా కొత్త ఇంటికి వెళ్ళిపోయాం.

భలే తమాషాగా అనిపించింది తెలుసా, నాపెళ్ళి ప్రశాంతంగా యేగొడవా లేకుండా జరిగిపోయిందని- రెండురోజుల తర్వాత మా నాన్న వచ్చాడు.

ఆ రెండు రోజులూ ఇంట్లో ఎంత రభస జరిగుంటుందో నువ్వు ఊహించుకోవచ్చు.

నాన్నను చూడగానే ఎంతభయం వేసిందో!

కానీ అంతా తేలికగానే పరిష్కారమయింది.

నాన్న చాలా తెలివిగలవాడు. తన కూతురికి ఆదర్శ వివాహం జరిపించినట్లు అందరితో చెప్పుకున్నాడు. ఇరవయ్యో తారీకున కొందరు బంధువుల్నీ స్నేహితుల్నీ పిలిచి విందు చేశాడు. ఆ రోజు ఉదయం మేమిద్దరం మా ఇంటికి వెళ్ళాం. మా అత్తా, వదినా, అన్నా అందరూ నామీద కోపాన్ని మింగలేక కక్కలేక నానా అవస్థపడ్డారు. అమ్మను చూస్తే మాత్రం

బాగాఏడు పొచ్చింది. నేను చేసిన పనికి అందరికంటే ఎక్కువ నఫరయింది అమ్మే!

అందరూ అమ్మనే తిట్టారు.

''కూతురు ఇంతపని చేస్తుంటే గమనించ లేకపోయిందనీ...''

''అదుపులో పెట్టలేకపోయిందనీ...''

''కుటుంబ పరువు ప్రతిష్టలు నేలపాలవడా నికి అమ్మే కారణమనీ...''

అందరూ ఎన్నెన్ని మాటలో అన్నారు.

అమ్మకు ఏడవటం తప్ప మరేం చేతకాదు.

జీవితాంతం మా మేనత్త చేతికింద నల గటం తప్ప ఆమెకు విముక్తి లేదు.

నరే- మా నాన్న హిపోక్రసీ ఇరవయ్యో తారీకున పరాకాష్టకు చేరుకుంది.

విందుకొచ్చిన అందరిలో ప్రకాశాన్నీ నన్నూ చాలా గొప్ప చేశాడు. అందరూ వెళ్ళిపోయాక నన్ను పిలిచి...

''ఇదంతా ఎలాగోలా చేశాను గానీ ఇకనీకూ ఈ ఇంటికీ నంబంధంలేదు. అత్తయ్యకూ అన్నయ్యకూ ఈ పని యిష్టంలేదు. లోకంలో ఎలాగోలా తలెత్తుకు తిరగాలని ఈ తంతు జరిపించాను. ఇంక మీరు వెళ్ళిపొండి'' అని చెప్పేశాడు.

నాకు చాలా కోపం, దుఃఖం వచ్చాయి.

రాత్రి పన్నెండు గంటల వేళ అమ్మభోరున ఏడుస్తుంటే మేమిద్దరం మా ఇంటికి వొచ్చే శాం.

ఇది ఆ ఇంటి కథ. ప్రకాశం వాళ్ళింట్లో యింకో కథ.

అనలు తను ముందే వాళ్ళింట్లో చెబితే సరిపోయేది. ఎవరూ ఏమనేవారు కాదని పించింది. ప్రకాశం మాత్రం ' నీకు తెలియ దులే- జరిగిపోయింది గనుక ఇలా ఉన్నారు. లేకపోతే నానా గొడవా చేసేవారు ' అంటాడు. ఏమోమరి! ప్రకాశానికి ఆరుగురు అక్కలని చెప్పేవాడు గుర్తుందా? ఆ ఆరుగురు అక్కలూ మమ్మల్ని గుర్తించలేదు. ఔను- మేం వాళ్ళ ఊరు వెళ్ళామని చెప్పలేదు గదూ. ప్రకాశం పెళ్ళి విషయం రాశాక వాళ్ళమ్మ వాళ్ళఅన్న య్యతో మమ్మల్ని రమ్మని ఉత్తరం రా యించింది.

మేం వెళ్ళాం.

''ప్రకాశం వాళ్ళమ్మ చాలా మంచిది ఉమా. చాలా తెలివిగలది. వీళ్ళు చిన్నపిల్లలుగా ఉన్నపుడే ప్రకాశం నాన్నగారు చనిపోతే వీళ్ళ ందర్నీ పెంచి పెద్దవాళ్ళను చేసి ఆడపిల్ల లకు పెళ్ళిళ్ళు చేసి- ఆ పొలాన్ని చేయిస్తూ... ఎంత సమర్థురాలో అనిపించింది. మాతో మంచిగానే ఉంది ఆమెకు ప్రకాశమంటే చాలా ఇష్టం. అందుకని నన్నూ యిష్టపడింది. వాళ్ళన్నయ్య ముభావంగా ఉన్నాడు. వాళ్ళ వదిన మాత్రం యెన్ని ప్రశ్నలు వేసిందో చెప్పలేను. ఆమెకు నేనంటే నగం కుతూ హలం- నగం వెక్కిరింత. ఆమె జీవితంలో యిదొక వింత.

పక్క ఇళ్ళ వాళ్ళనీ బంధువుల్నీ అందర్నీ పిల్చుకొచ్చి నన్ను చూపించింది. అది మాత్రం ఎంత భయంకరమైన పరిస్థితో-

ఆంధ్రాపారిస్ అని పేరుబడ్డ తెనాలి పక్కనే ఉన్న ఆ పల్లెటూళ్ళో జనం మమ్మల్ని జూలో జంతువుల్ని చూసినట్లే చూశారు. మేంబజార్లో నడుస్తున్నా అంతే. ఎక్కడి వాళ్ళ క్కడ ఆగిపోయి- యింట్లో వాళ్ళని గబగబా బైటికి పిలిచీ-

ఎంత చిరాకనిపించిందో.

కులాంతర వివాహం దేశంలో ఇంకా నంచ లనాన్ని రేపుతూనే ఉంది.

ప్రకాశం అక్కలు మాత్రంరాలేదు. పెద్దక్క కైతే వాళ్ళమ్మాయిని చేసుకోలేదని కోపం అను కో. మిగిలిన వాళ్ళెందుకు రాలేదో తెలుసా? ప్రకాశం పెళ్ళి నందర్భంగా వాళ్ళు పట్టుచీర లు, గ్రైండర్లు వస్తాయని కలలు కన్నారట.

ప్రకాశంతో ఎప్పుడూ అనేవారట. ''నువ్వెవ ర్నన్నా చేసుకో- మాకు మాత్రం ఆడపడుచు కట్నంగా పట్టుచీరా గ్రైండరూ కావాలి! లేక పోతే పెళ్ళికి రాము'' అని.

భలేమనుషులు కదూ. నిజంగానే ఒక్కరూ రాలేదు.

ఆ ఊళ్ళో రెండు రోజులుండి వొచ్చేశాం. అత్తయ్యా త్వరలో మా ఇంటికి వస్తానన్నారు.

ఇక మా సంగతులు ఏంరాయను?

ఆంధ్రప్రదేశ్‌లోని సర్వోత్తముడైన పరమాత్మునికి నీరాజనాలు



తిరుమల – ఏడుకొండల మీద వెంకటేశ్వర స్వామి దేవాలయం. ఆకాశగంగ. పాపవినాశనం. వరాహ స్వామి ఆలయాలు కలవు. తిరుపతి తీరమున ఎన్నోదేవాలయాలుతిరుచానూరులోని పద్మావతి దేవి ఆలయం. శ్రీకాళహస్తి. నారాయణ వరం, కైలాసనాధుని కొండ కలవు. తిరుపతికి 144 కి.మీ. దూరంలో యాత్రికుల మనోల్లాసానికి హార్సిలీ కొండలు వున్నవి. లేపాక్షిలో వీరభద్ర దేవాలయం. శ్రీశైలంలో మల్లికార్జున దేవాలయం. వన్యప్రాణులతో కూడిన చిట్టడవులు యాత్రికులకు విహార స్థలాలు.

## ఆంధ్రప్రదేశ్ – దేవాలయాల ప్రాంగణాలకే ఒక ప్రాకారం.



సింహాచలం కొండమీద వెలిసిన వరాహాలక్ష్మి నరసింహ స్వామి. భద్రాచలంలోని శ్రీరామచంద్రుడు. మంత్రాలయంలోని రాఘవేంద్ర స్వామి – సకల జనారాధ్యులు.

**అసలైన ఆధ్యాత్మిక అనుభవానికి ఆంధ్రప్రదేశ్‌కురండి**

**ఆంధ్రప్రదేశ్ పర్యాటక విభాగం**
మొదటి అంతస్తు. గగన్ విహార్.
యం.జె. రోడ్డు. హైదరాబాద్ - 500 001.
టెలిఫోన్లు : 556493. 42835. 77192.
70087. 233384. 233385



ప్రకాశం ప్రేమలో నేను మునిగిపోయి ఉన్నాను.

నిజంగా ఉమా-!

నిజంగా నేను చాలా సంతోషంగా ఉన్నాను. జీవితంలో ఇంతకంటే కావాల్సిందేమీ లేదనిపిస్తోంది. నేను ధైర్యం చేసినందుకు నాకు సంతోషంగా ఉంది. నన్ను ఆ ఇంట్లోంచి తప్పించిన ప్రకాశమంటే ప్రేమతో కృతజ్ఞతతో మనసు నిండిపోతోంది. ప్రకాశం లేకపోతే నా జీవితం ఎలాఉండేదో వూహించుకుంటే చాలా భయంగాఉంది.

అసలు ఊహలకూ ఆలోచనలకూ సమయమేదీ? నేనూ ప్రకాశం కలిసి ప్రతి అనుభూతినీ పంచుకున్నాం. ఆనందిస్తున్నాం.

మొన్న ఇద్దరం కలిసి కృష్ణశాస్త్రి కవితల్ని చదువుకున్నాం తెలుసా. మేం యేం మాట్లాడుకుంటామో మాకే తెలియకుండా గంటలు గంటలు మాటల్లో దొర్లిపోతాయి."

ప్రేమ ఎంత అద్భుతంగా ఉంటుందో నీకెలా తెలుస్తుంది? తొందరగా ఎవర్నన్నా ప్రేమించరాదూ?

"ప్రకాశం ప్రేమలో నేనేమవుతున్నానో నాకే తెలియటంలేదు."

ఎన్ని రంగులు...!

ఎన్ని కాంతులు!

ఎన్ని రూపాలు!

ఎన్ని అనుభూతులు!

ప్రపంచం ఎంత బాగుంది-!

చిరునవ్వుతో, నా ప్రేమతో వెలిగే ప్రకాశం కళ్ళ కాంతులను చూస్తుంటే నా హృదయం హేమంతంలో నులివెచ్చని సూర్యకిరణాలకు విచ్చుకున్న చేమంతి చందమవుతోంది.

ప్రకాశం కాసేపు కనపడకపోతే, అతను రావటం కాసేపు ఆలస్యమైతే శిశిరంలో శూన్యమైన మానులా కాంతిహీనమై పోతున్నా.

అతన్ని చూడగానే మళ్ళీ కోర్కెల కొత్త చిగుళ్ళతో మనసు వసంతకాలపు నందన వనమవుతోంది.

గ్రీష్మతాపం వంటి వలపు వేడిలో చిక్కి మల్లెల మత్తులో సాయంత్రపు చల్లగాలులకు సేదతీరి హృదయం సొమ్మసిల్లి నిద్రిస్తోంది.

ఏం రాయను ఉమా- ఏం రాసి ఎంత వర్ణించి నా ప్రేమగానాన్ని నీ అనుభూతిలోకి తేగలను-

నువ్వూ రావూ?

నా ఆనందాన్ని కళ్ళారా చూడవూ-

నా కబుర్లు వినవూ?

ఉమా- జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీలో ఎంట్రెన్సు పరీక్ష ఎప్పుడు? నువ్వు పరీక్ష కోసం ఢిల్లీ వెళ్ళేప్పుడు తప్పకుండా హైదరాబాదు రావాలి. రెండు రోజులుండి వెళ్ళువు గాని. కాజీపేట దాకా ఎలాగూ రావాలి గదా. ఇంకాస్త దూరం వస్తావు. నువ్వు ఎప్పుడు వస్తావో రాస్తే ఇక్కడినుంచి టికెట్‌బుక్ చేస్తాను. వెంటనే ఉత్తరం రాయి. కాలేజీలో లీజర్‌అవర్లో రాస్తున్నానిది. మళ్ళీ క్లాసుకి టైమైంది. ఇదిడబ్బాలో వేసి క్లాసుకి పోతా

నీ

అరుణ"

తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌లో కూచుని తిరికగా అరుణ రాసిన ఉత్తరం చదువుకుంది ఉమ. ఇంట్లోంచి బయలుదేరబోతుంటే పోస్టులో వచ్చింది. కవర్ సైజు చూసి ఇప్పుడు లాభంలేదులే అనుకుని బాగ్‌లో పడేసుకుని స్టేషన్‌కి వెళ్ళింది. గుంటూరు రైల్లో అంతా జనం. హడావుడి. ఆ రైలు దిగి బెజవాడలో తమిళనాడు ఎక్కి తన సీటులో కూర్చుని రైలు కదిలిన తర్వాత ఉత్తరం విప్పింది.

అరుణ ఆనందంగా ఉందనుకుంటే ఉమకు పరీక్ష దిగులుకూడా తగ్గినట్టయింది. అప్పటి దాకా మెదడులో ఉన్న పరీక్షభారం కాస్త దిగి మెదడు చల్లబడ్డట్టయింది. పరీక్ష రాసి హైదరాబాదు వెళ్ళాలనుకుంటూ పక్కకు చూస్తే బాగ్‌లోనుంచి పుస్తకాలు తొంగి చూస్తున్నాయి. ఉలిక్కిపడింది. ఈ పరీక్ష పూర్తయి రిసెర్చిలో సీటుదొరికే దాకా ఈ పుస్తకాలు ఇలా జడిపిస్తూనే ఉంటాయిగాబోలు. ఎప్పుడూ లేదు ఈ పరీక్షకు ఇంతటెన్షన్‌గా ఉండేదేమిటి అనుకుంది ఉమ.

ఈ సీటు దొరక్కపోతే తన ప్లానులన్నీ తన ఊహాలన్నీ తలకిందులయిపోతాయి. ఆ యూనివర్సిటీలో రిసెర్చి చెయ్యాలని ఏడాది నుంచీ తను కంటున్న కలలు అబద్ధం కాకూడదు. అమ్మనీ నాన్ననీ నొప్పించీ, ఒప్పించీ ఈ పరీక్షకు హాజరవుతోంది. ఈ పరీక్ష పోతే మళ్ళీ గుంటూర్లోనో హైదరాబాదులోనో చదవటం తన కిష్టం లేదు. తనకింకా ఎక్కువ అవకాశాలున్న చోటు కావాలి.

ఇదయ్యాక వీలైతే అమెరికా వెళ్ళాలి

ఎంతో చదవాలి!

ఎన్నో రాయాలి!

ఆలోచనలను పక్కకు నెట్టి ఉమ సీరియస్ గా పుస్తకం తెరిచింది.

* * *

చలికాలంకావటంతో ఆరయినా యింకా పూర్తిగా వెలుగురాలేదు.

ఆ మసకవెలుతుర్లోనే అరుణ యిచ్చిన అడ్రసు ప్రకారం ఆ యింటికోసం వెతికి చివరకు పట్టుకుంది ఉమ.

"ఉమా - నువ్వా. వుత్తరం రాయలేదేం. నువ్విక రావనుకుంటున్నా" ఆశ్చర్యం ఆనందం కలగలిసిన ముఖంతో అంది అరుణ.

"వచ్చానుగాని - నువ్వేమిటి అలావున్నావు. వొంట్లో బాగాలేదా?"

"ఊఁ— బాగానే వుంది. నువ్వెక్కడ నుంచీ" —

"మా వూరునుంచే. నాకు సీటు వచ్చింది. రెండు రోజుల్లో ఢిల్లీ వెళ్ళాలి. ఇక అక్కడ జాయినయితే యిప్పట్లో రానుగదా - అందుకని ముందిటు వచ్చేశా —" కుర్చీలో కూలబడి అలుపుతీర్చుకుంది ఉమ.

"మంచి పనిచేశావ్. పద ముఖంకడుక్కుందువుగాని"

"కడుక్కుంటాలే - ప్రకాశం నిద్రలేవలేదా?"

"ఊఁహు"

"ఐతే లేచేదాకా మనం కబుర్లు చెప్పుకుందాంలే. వస్తానుండు" అంటూ బాత్ రూంవైపు నడిచింది ఉమ.

అరుణ అంట్ల గిన్నెలన్నీ సింకులోవేసి పాలు స్టవ్‌మీదపెట్టి టీ చేసింది.

"నీకు సీటు వచ్చిందంటే పెద్దబరువు దిగినట్లుందే. ఎంత కష్టపడ్డావు. ఎంత టెన్షన్ పడ్డావు" టీ కప్పు ఉమకి యిస్తూ అంది.

"ఆ బరువుతోనేనా యింత చిక్కావు? ఏమిటి అనారోగ్యం?"

"ఏముంది - మామూలే" డల్‌గావుంది అరుణ నవ్వు.

"అరే - మామూలేమిటి. అంత బలహీనంగా వున్నావు. పెళ్ళయి మూణ్ణెల్లు కాలేదు. ఈ నీరసం యేమిటి? ప్రకాశం యేంచేస్తున్నాడు?"

అరుణ మళ్ళీ నీరసంగా నవ్వింది.

"ఏంటా నవ్వు? — యేమయింది నీకు?"

"పెళ్ళయిన వాళ్ళందరికీ వచ్చే నీరసమే నాకూ వచ్చింది. కంగారుపడకు"

"అంటే"

"అంటే — కన్సీవ్ అయ్యాను. రెండోనెల"

"నిజమా?" దిగ్భ్రాంతిగా అడిగింది ఉమ.

అరుణ తలవూపింది.

"ఇంత తొందరగా పిల్లలెందుకు? నువ్వూ వొద్దనుకున్నావుగదా?"

అరుణ మాట్లాడలేదు.

ప్రకాశం నిద్రలేచి వచ్చి ఉమనుచూసి ఆశ్చర్యపోయాడు "ఇన్నాళ్ళకు వచ్చారన్నమాట. మీ ఫ్రెండు రోజూ కలవరిస్తోంది మీకోసం. అరుణ మిమ్మల్ని అనుక్షణం తల్చుకుంటుంటే నాకెంత జెలసీగా వుంటోందో చెప్పలేను."

"మీరూ ఢిల్లీ రండి. మిమ్మల్నీ తల్చుకుంటుంది"

"అమ్మో ఢిల్లీ కాదుగదా - అరుణను వొదిలి అరగంటకూడా వుండలేను"

ప్రకాశం మాటలకు ముగ్గురూ నవ్వారు.

"అరుణ చాలా నీరసంగా వుందండీ" అంది ఉమ.

"ఔను. యేమీ తినటంలేదు. బాగా వాంతు

లవుతున్నాయి. నాకూ చాలా భయంగా వుంది. ఇంకో నెలలో తగ్గిపోతాయంటుంది డాక్టరు. పదిహేను రోజుల్లో యెంతచిక్కిపోయిందో' ప్రకాశం పేపరు తీసుకుని గదిలోకి వెళ్ళాడు.

అరుణా, ఉమా వంటగదిలోకి వెళ్ళారు.

''ప్రకాశం వంటగదిలోకి రాడా?'' ఉమ అడిగింది.

''వస్తాడు. నేనే రావొద్దంటా. యేదో వొకటి పాడుచేసిగాని వెళ్ళడు.'' నవ్వింది అరుణ.

''పాడుచేస్తే చేశాడులే. నెమ్మదిగా నేర్చుకుంటాడు. నువ్వుగారాంచేసి పాడుచెయ్యకు'' కసిరింది ఉమ.

''ప్రకాశం నా పనిలో సాయం చేస్తాడులే! — ఢిల్లీ కబుర్లేమిటి చెప్పు —''

''అప్పుడే ఢిల్లీ కబుర్లేముంటాయి. వెళ్ళి సెటిల్‌కానీ''

''ఒకసారి వెళ్ళావుగా''

''వెళ్ళానుగానీ యెవరింట్లోనో నాలుగురోజులుండి ఆ పరీక్షరాసి వచ్చేశాను. ఢిల్లీయేమీ చూడలేదు. నేను సెటిల్ అవగానే వుత్తరం రాస్తాను. మీరిద్దరూ రండి. ఢిల్లీ అంతా చూద్దాం. మీరొచ్చేదాకా నేనేమీ చూడను''

''అంతదూరం యిప్పుడెలా వీలవుతుందిలే'' అంది అరుణ.

''అబ్బ - ముసలమ్మలా యేంటా నీరసం మాటలు —'' చిరాకు పడింది ఉమ.

''నువ్వెళ్ళి కాసేపు పడుకోరాదూ? రాత్రంతా నిద్రలేదుగా. పదింటికి లేపేస్తా''

''నువ్వు కాలేజీకి వెళ్తావా?''

''నువ్వొస్తే నే కాలేజీకి వెళ్తానా?''

''సరే— నీ పనిచేసుకో. యెంతయినా గృహిణివైపోయావు. ఇక పిల్లలు పుడితే'' అంటూ అవతలకు నడిచింది ఉమ.

పనంతా ముగించి ప్రకాశానికి భోజనం పెట్టింది అరుణ.

''నువ్వు ఈ రోజు కాలేజీకి వెళ్ళవుగా. లీవ్‌లెటరు రాసివ్వు. నేను తీసికెళతా''

అరుణ లీవ్‌లెటరు రాసియిచ్చింది.

''అరుణా అలా డల్‌గా వుండకు. ఎంతో సంతోషంగా వుండాల్సిన టైమిది. మీ ఉమా నువ్వూ కూచుని పాత కబుర్లన్నీ చెప్పుకోండి. సరదాగా యెటన్నా వెళ్ళిరండి. నేపోతున్నా —''

ప్రకాశం వెళ్ళిపోయాడు.

అరుణ టీ చేసుకుని వెళ్ళి ఉమను లేపింది.

ఉమ ''నేను నిద్రపోలేదు. ఊరికే పడుకున్నా. ఊఁ ఏంటే కబుర్లు చెప్పు'' అంది.

''ఏం చెప్పను? అసలు కబురు చెప్పానుగా.''

''ఎందుకంత తెలివి తక్కువగా వున్నావు. ప్లాన్ చెయ్యగూడదూ?''

''ఏమో — ప్లానింగ్ గురించి ఆలోచించే లోపలే జరిగిపోయింది. మొదటి రోజుల్లో కొత్త! భయం! ప్రకాశంతో మాట్లాడాలంటే సిగ్గుగా అనిపించేది. ఇవన్నీ పోకముందే యిలా జరిగింది.''

''పోనీ అబార్షన్ చేయించుకోరాదూ?''

అరుణ ఉమ వొళ్ళో తలపెట్టుకుని వెక్కివెక్కి యేడ్చింది.

''ఏమయిందే యిప్పుడు? నీకిష్టం లేకపోతే ఎబార్షన్ చేయించుకో. ఎబార్షన్ అంటే భయమా?''

''కాదు. ప్రకాశానికి యిష్టంలేదు''

''ఎందుకని?''

''ఏమో— ఈవిషయం తెలిసి అతను చాలా సంతోషపడ్డాడు. నేను దిగులుపడుతుంటే అతనికి ఆశ్చర్యం. నేను సిగ్గుతో ప్లానింగు గురించి మాట్లాడలేదంటే అతను నువ్వు మాట్లాడినా ప్రయోజనం వుండేది కాదులే. నేను కుదరనిచ్చేవాడిని కాదు అన్నాడు. అబార్షన్ అనే మాట నేననగానే అతనికెంత కోపం వచ్చిందో. బాగా తిట్టేశాడు. నువ్వాడదానివేనా అన్నాడు. తర్వాత కోపంలో అన్నానని పశ్చాత్తాపపడ్డాడుగానీ నాకెంత గుచ్చుకుందో ఆమాట. నాకిప్పుడే పిల్లలొద్దని గట్టిగా అనుకున్నాను గనుక అబార్షన్ అన్నాను. అది పాపంకాదట గానీ ఘోరమైనపనట. రెండు రోజులు ఈ



విషయం గురించి మేంమాట్లాడుకోలేదు తెలుసా? చివరికి నేనే రాజీపడ్డా''

''జరిగిందేదో జరిగింది. నువ్వు యెక్కువ ఆలోచించి బాధపడకు. వొకరకంగా యిది కూడా మంచిదేనేమో''

ఉమ చెప్పబోతుంటే మధ్యలోనే వారించింది అరుణ.

''పిల్లల్ని కంటాను. అదికాదు సమస్య. నాకు యిప్పుడే పిల్లల్ని కనాలని లేదన్నప్పుడూ, అబార్షన్ గురించి ఆలోచించినప్పుడూ ప్రకాశం నన్ను సరిగా అర్థం చేసుకోలేదన్నది నన్ను చాలా బాధించింది. నేనేదో తప్పుచేసినట్లూ నన్ను కోప్పడి ఆ ఆలోచనను మాన్పించగలిగినట్టూ ప్రవర్తించాడు. నేను యిక అబార్షన్ గురించి ఆలోచించనని నమ్మకం కలిగేదాకా నాతో చాలా సీరియస్‌గా వున్నాడు. ఇప్పుడిక మళ్ళీ చాలా ప్రేమగా వుంటున్నాడు. నాకిది చాలా బాధనిపిస్తోంది. తన కిష్టమైనట్లు వుంటే ప్రేమించటం లేకపోతే సీరియస్‌గా వుండటం. ఇట్లా కాకుండా నా ఆలోచనలను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తే—'' అరుణ కళ్ళల్లో మళ్ళీ నీళ్ళు.

''పిచ్చిదానా — నువ్వు నిజంగా యెక్కువ ఆలోచిస్తున్నావు. ఒక్కొక్కళ్ళ స్వభావం వొక్కొరకంగా వుంటుంది. అయినా ప్రకాశం నీకిష్టంలేని పనిచేస్తాడనుకో. యేంచేస్తావు? సీరియస్‌గా వుండవా? పోట్లాడవా? మళ్ళీ నీకిష్టమైనట్లు వుండేదాకా యేదోరకంగా అతన్ని సాధిస్తావా లేదా?''

''అంతేనంటావా?''

''అంతే కాకపోతే మరేంటి. అతనికి పిల్లలంటే యిష్టం కావటంతో నువ్వు అబార్షన్ అనగానే కోపం వొచ్చివుంటుంది. అతని వద్ధతిలో అతను ఆ కోపాన్ని ప్రదర్శించాడు. నువ్వు ఆ విషయంలో రాజీపడి మళ్ళీ యిదంతా మనసులో పెట్టుకోవటం దేనికి? అతన్తో వివరంగా మాట్లాడలేదా?''

''మాట్లాడాను. ఇప్పుడతను తన ప్రవర్తన అంతా పొరపాటేనంటున్నాడు. కానీ యిదంతా నేను అబార్షన్ చేయించుకోకుండా పిల్లను కనటానికి వొప్పుకోవటం వల్లనేనేమో అని నా

అనుమానం. నేను అబార్షన్ చేయించుకుంటే యిక నన్ను ప్రేమించేవాడుకాదేమో అన్నంత దూరం అయిపోయాడు అప్పుడు. ఆ భయంతోనే నేను రాజీపడ్డాను. అది నా మనసు లోంచి పోవటంలేదు."

"నువ్వింత సున్నితంగా ఆలోచిస్తే కష్టమమ్మాయ్. కాస్త గట్టిపడాలి. పరిస్థితుల్తో రాజీపడాలి. పెళ్ళంటే యేంటనుకున్నావు?"

"ప్రేమ నాలో సున్నితత్వాన్ని పెంచింది. పెళ్ళి నేను గట్టిపడాలంటోంది. ఎలాగే?— పెళ్ళంటే యేమిటని మొదటిసారి ఆలోచిస్తున్నాను" అరుణ పేలవంగా నవ్వింది.

"అంత ఆలోచించి బుర్రపాడుచేసుకోకు. లేఁ- యూనివర్శిటీకి పోదాం. మా డిపార్ట్మెంటుని చూసి యెన్ని నెలలయిపోయిందో. మా వాళ్ళందరికీ నా రిసెర్చి విషయం చెప్పాలి" ఉమ లేచింది.

"నువ్వెళ్ళిరా. నేనెందుకు. నాకు బోర్ కొడుతుంది"

"అదేంటి?— వాళ్ళతో నా రిసెర్చి గురించి చర్చిస్తాననుకున్నావా? అరగంటలో డిపార్ట్మెంటునుంచి బైటపడి మన చెట్టుకింద చేరదాం. లే! నీరసం ముఖం నువ్వూనూ. లేచి అన్నం పెట్టు."

ఇద్దరూ అన్నంతిని యూనివర్సిటీ అంతా తిరిగి సాయంత్రానికి యింటికి తిరిగొచ్చారు. ఉమ మాటలతో అరుణలో నీరసంపోయి వుత్సాహం వచ్చింది. ప్రకాశం రాగానే ముగ్గురూ కలిసి బజార్లన్నీ తిరిగి ఓ తుక్కు ఇంగ్లీషు సినిమాచూసి హొటల్లో భోజనంచేసి యింటికొచ్చి కబుర్లు చెప్పుకుంటూ నిద్రపొయ్యారు.

మర్నాడు సాయంత్రం ఉమ వెళ్ళిపోయింది.

అరుణ ఆనందంగా రాబోయే పాపాయిని ఆహ్వానించటానికి నిశ్చయించుకుంది.

అరుణలో వచ్చిన మార్పునిచూసి ప్రకాశం నిశ్చింతుడయ్యాడు.

★ ★ ★

మూడు నెలల పాపను అత్తగారికి అప్పగించి కాలేజీకి రావటం కష్టంగానే అనిపించింది. అరుణకు.

పాప పుట్టిన ఈమూడు నెలలూ అరుణకు పాపే ప్రపంచమయింది. అత్తగారున్నా పాప పనులన్నీ స్వయంగా తనే చేసేది. ఆ పసికందుకి యెక్కడ యే అసౌకర్యం కలుగుతుందోనని రాత్రింబగళ్ళూ కనిపెట్టుకు కూచునేది. రోజు రోజూ పాపలో వస్తున్న మార్పులూ, పాప గమనిస్తున్న కొత్త విషయాలూ అన్నీ చూసి ఆనందపడటంలో మూడు నెలలు తెలియకుండా గడిచిపోయాయి.

ఇప్పుడు ఒక్కసారిగా ఉదయం నుంచీ సాయంత్రం వరకూ పాపనొదిలి ఉండటమంటే అరుణకు యెలాగో ఉంది.

కమలమ్మకు లక్ష జాగ్రత్తలు చెప్పి...

ఆవిడ 'నేను యెనిమిదిమంది పిల్లల్ని పెంచానమ్మాయ్...

అని నవ్వుతుంటే...

కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ బయటపడింది అరుణ. 'నెమ్మదిగా అలవాటు పడాలి. నాకే ఇలా ఉంటే ఇక పాపం ఆ పసిది యెలా తడుముకుంటుందో నాకోసం' అనుకునే సరికి బాగా దిగులనిపించింది.

కాలేజీకి వెళ్ళగానే మళ్ళీ అదో ప్రపంచం. క్లాసులూ, పిల్లలూ, పాఠాలూ కొలీగ్స్ పలకరింపులు — వీటితో టైము తెలియకుండానే గడిచింది.

మధ్యాహ్నం లంచ్ సమయంలో పేపరు చూస్తూ కూచుందేగాని అరుణ ఆలోచనలన్నీ పాప మీదే ఉన్నాయి.

'పాప ఆపకుండా యేడిస్తే...?

తన కోసం బెంగపెట్టుకుని యేడిస్తే...?

పాలు తాగకపోతే...?

అరుణకు వెంటనే లేచి ఇంటికి వెళ్ళాలనిపించింది.

జువాలజీ లెక్చరరు కేశవరావొచ్చి "అరుణగారూ" అంటూ రెండుసార్లు పిల్చినా అరుణకు విన్పించలేదు.

"ఆవిడ ప్రస్తుతం వాళ్ళమ్మాయి ధ్యానంలో ఉన్నారు. మన మాటలు వినపడవు" అని విమలకుమారి అనగానే అందరూ నవ్వితే

అరుణ ఉలిక్కిపడింది.

"మీతో మాట్లాడాలి. కొంచెం లైబ్రరీదాకా వస్తారా" అనడిగాడు కేశవరావు.

అరుణకు విషయం అర్థంగాక పోయినా లేచి కేశవరావు వెంట లైబ్రరీకి వెళ్ళింది.

"అరుణగారూ!మీరు లీవ్‌లో ఉన్న మూడు నెలల్లో కాలేజీలో చాలా విషయాలు జరిగాయి. యెవరన్నా మీకు చెప్పే ఉంటారు" ఆగాడు కేశవరావు.

"లేదండి, యెవరూ చెప్పలేదు. యేం జరిగింది?"

"నేనే చెప్పాలని మనవాళ్ళంతా నిర్ణయించారులెండి. మన కాలేజీలో అసోసియేషన్ యేర్పడింది."

"అసోసియేషనా?"

"ఔనండీ. మనం కాలేజీలో చేరేటప్పుడు యేమని చెప్పారు? గ్రాంటు రాగానే పూర్తి జీతం ఇస్తామని చెప్పారు గదా! మనం ఒప్పుకుని ఐదువందలకే పని చేస్తున్నాం. మొన్న జూన్‌నుంచే కాలేజీకి పూర్తి గ్రాంటు వస్తోంది. కనీసం మనకు చెప్పనుకూడా లేదు. ఇలాంటి విషయాలు దాగుతాయా? తెలియగానే పది మందిమి వెళ్ళి కమిటీవాళ్ళను అడిగాం. వాళ్ళు "గ్రాంటు వచ్చిందిగానీ పూర్తి జీతాలు అప్పుడే ఇవ్వలేం. కాలేజీ డెవలప్‌మెంటుకి డబ్బు కావాలి" అన్నారు. లెక్చరర్ల కడుపుకొట్టి కాలేజీని యేం బాగు చేస్తారంటే వాళ్ళు వినిపించుకోలేదు. వెంటనే మేం పదిమందిమీ మిగిలిన లెక్చరర్లందరినీ పిల్చి మీటింగు పెట్టాం. ఐదారుగురు తప్ప మిగిలిన వాళ్ళందరూ పూర్తి జీతాలకోసం యేమైనా చేద్దామన్నారు. ఆ ఐదారుగురూ కమిటీ వాళ్ళకు దగ్గరివాళ్ళు గనక మనతో కలిసిరారు. మిగిలిన వాళ్ళందరం కలిసి అసోసియేషన్‌గా ఏర్పడ్డాం. డిమాండ్స్ అన్నీ రాసి కమిటీ వాళ్ళకిచ్చాం. జనవరి కంతా పూర్తి జీతం ఇవ్వకపోతే స్ట్రైక్ చేద్దామని మా ఉద్దేశం. మీరుకూడా అసోసియేషన్లో చేరతారనే నా నమ్మకం." కేశవరావు అరుణ ఆమోదం కోసం ఆగాడు.

"తప్పకుండా చేరతానండి"

"అయితే ఇదిగో ఇక్కడ సంతకం చెయ్యండి" బ్యాగ్‌లోంచి కాగితాలు బైటికి తీశాడు.

"పది రూపాయలు అసోసియేషన్‌కు చందా ఇవ్వాలి. ఖర్చులకోసం అందరం తలా పదిరూపాయలు అసోసియేషన్‌కు ఇవ్వాలని నిర్ణయించాం"

అరుణ పదిరూపాయలు తీసి ఇచ్చింది.

"అంతేనండీ. ఇది మాట్లాడటానికే పిల్చాను. ప్రతి శుక్రవారం కాలేజీ అయిపోయాక మనందరం కలిసి ఓ గంటసేపు మన సమస్యల గురించి మాట్లాడదామనుకుంటున్నాం. ఆరోజు నోటీస్ పంపుతాం లెండి" కేశవరావు వెళ్ళిపోయాడు.

అరుణ డిపార్టుమెంటుకి రాగానే నలుగురూ చుట్టూ చేరారు.

"అసోసియేషన్లో చేరారా?"

"చేరాను."

"మేం అనుకున్నాం లెండి. మీరు తప్పక చేరతారని" వికసించిన ముఖాలతో అన్నారందరూ.

సాయంత్రం పాపకు స్నానం చేయించి నిద్రపుచ్చుతూ ప్రకాశంతో అసోసియేషన్ గురించి చెప్పింది. అరుణ.

"మంచి ఉద్యోగం దొరికేదాకా పనిచేసి మాట్లాడకుండా వొచ్చేదానికి యెందుకొచ్చిన గొడవ. మీ ముప్పైమంది సమ్మె చేస్తే మిమ్మల్ని తీసి ఇంకోళ్ళని పెట్టుకుంటారు. మీవల్ల ఏమవుతుంది?"

"పూర్తి జీతం ఇస్తే ఇది మంచి ఉద్యోగం కాదా యేంటి? అయినా న్యాయంగా మాకు రావాల్సింది అడగడంలో తప్పేముంది? అసలు స్ట్రయికు చెయ్యకుండా ఎవర్కైనా ఏమైనా బెనిఫిట్స్ వస్తున్నాయా?" అరుణ తీవ్రంగా అంది.

"సరే తెచ్చుకోండమ్మా పూర్తి జీతాలు. నాకే లాభంగదా నీకు పూర్తి జీతం వస్తే "

"నీకేం లాభం?"

"ఏం లాభమేమిటి? నీ డబ్బులన్నీ నావికాదూ?

"పాపం ఆశ! పెరిగిన జీతంలో పైసాకూడా

ఇవ్వను.''

"పోనీ దాచుకో! దాచుకున్నా అది నా కూతురికేగా''

"ఇక నువ్వూ నీ కూతురూ తప్ప నా డబ్బు నేను ఖర్చు పెట్టుకోకూడదా?''

"పోనీ నువ్వే ఖర్చుపెట్టుకో నాకెందుకు?'' ప్రకాశం పాపను వొళ్ళోకి తీసుకున్నాడు.

"మా చిట్టితల్లి కోసం నేనే డబ్బు సంపాదిస్తా'' అంటూ సున్నితంగా పాప చెంపమీద ముద్దు పెట్టాడు ప్రకాశం.

"దానికి డబ్బెందుకోయ్''

"ఎందుకేమిటి, ఈ పసిది యెన్ని చదువులు చదవాలి? దీని పెళ్ళి యెంత ఘనంగా చెయ్యాలి'' భవిష్యత్తు తన కళ్ళముందు కనపడుతున్నట్టే పలికాడు ప్రకాశం.

"పాపకు పెళ్ళి నువ్వు చేస్తావా?''

"అదే లేవోయ్ మనం''

"నన్ను కలపకు. నేను చెయ్యను. దాని పెళ్ళి అది చేసుకుంటుంది. మధ్యన మనమెవరం? మన పెళ్ళి మన పెద్దాళ్ళు చేశారా?''

"మనకంటే — మన పరిస్థితివేరు. మన పెద్దాళ్ళు వొప్పుకోరు గాబట్టి ఏదో సింపుల్‌గా అవగొట్టాం. మనమ్మాయికదేం ఖర్మ! నా చిట్టితల్లి యెవర్ని కోరుకుంటే వాళ్ళతో ఓ — బ్రహ్మాండం బద్దలయ్యేలా పెళ్ళి చేయించనూ? మనకిమల్లే తూతూ మంత్రం ఖర్మ దానికేమిటి?''

"నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా?'' అరుణ కోపంగా అంది.

"ఏం? యేం మాట్లాడాను, నేను మాట్లాడిన దాంట్లో తప్పేముంది?''

"నేను మన పెళ్ళి జరిగిన పద్ధతికి గర్వపడుతున్నాను. పెళ్ళనేది అంత సింపుల్‌గా యే ఆర్భాటాలూ, బంధుగణాలూ లేకుండా జరగలనుకుంటున్నా. నువ్వు చూస్తే పరిస్థితులవల్ల గాని, లేకపోతే దర్జాగా పెళ్ళి చేసుకునే వాడిని గదా అని విచారిస్తున్నట్టున్నావు. మా అమ్మా నాన్నలు మన పెళ్ళికి వొప్పుకోనందుకు నేను సంతోషిస్తున్నా నువ్వు విచారిస్తున్నావు.''

అరుణ ఆవేశపడింది.

"నువ్వంతా వితండవాదం చేస్తావు అరుణా. యేదో సరదాకి పెళ్ళి సందడిగా జరిగితే బాగుండేదనుకుంటే ఇంత కోపం తెచ్చుకుంటావేమిటి?''

"ఇవాళ పెళ్ళి బాగా జరగలేదని విచారపడుతున్నావు. రేపు కట్నం రాలేదని విచారపడతావు. ఎల్లుండి స్కూటర్‌రాలేదే అనుకుంటావు. దీనికి అంతెక్కడ. ఎందుకీ ధోరణి?''

అరుణ ధోరణి చూసి ప్రకాశం జంకాడు.

"నాకు కట్నం రాకపోవటమేమిటోయ్! నీలాంటి అందమైన, తెలివైన అమ్మాయిని మించిన కట్నం మరింకేమిటంటా'' పాపను ఉయ్యాలలో పడుకోబెట్టి అరుణ చుట్టూ చేతులు వేసి దగ్గరకు తీసుకున్నాడు.

"అంటే—ఈ అందం తెలివీ లేకపోతే నన్ను ప్రేమించేవాడివి కాదా?''

"ఈ అందం ఈ తెలివీ లేకపోతే ఆ అమ్మాయి అరుణ కాదు. ఇంకెవరో — ఆ ఇంకెవర్నో నేను ప్రేమిస్తానా?''

అరుణ ఆలోచనలో పడింది.

"ఏంటి నీ ఆలోచన? నీకు కోపం వస్తుంది గానీ నువ్వు చాలా అనవసరమైన విషయాలు చాలా ఎక్కువగా ఆలోచిస్తావు. నాకు తెలుసు. ఇప్పుడు నీ మనసులో రెండు మూడు ప్రశ్నలు ముళ్ళలాగా గుచ్చుకుంటున్నాయి.

"ప్రకాశానికి కట్నం కావాలా?''

"ప్రకాశానికి ఆడంబరంగా పెళ్ళి జరగలేదనే దిగులుందా?''

"నేను అందంగా లేకపోతే ప్రకాశం ప్రేమించేవాడు కాదా?''

"ఇవాళ రాత్రంతా ఈ ముళ్ళతో మనసుని గుచ్చుకుంటూ కూచుంటావు. ఔనా?''

"నా గురించి నీకు బాగానే తెలుసు'' అరుణ ఆలోచనగా నవ్వింది.''

"ఊఁ— మరి తెలియకుండానే నాదాన్ని చేసుకున్నానా?''

"కానీ నా గురించి నీకు అంతబాగా తెలుసా అని అనుమానం వొస్తోంది'' అరుణ అనకూడదను కుంటూనే అనేసింది.

"తెలియదా? నువ్వంటే నాకెంత పిచ్చి ప్రేమో తెలియదా?" తననే చూస్తున్న అరుణ కళ్ళమీద ముద్దు పెట్టాడు.

"వద! పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టి ముందు అన్నం పెట్టు ఆకలేస్తోంది. అమ్మేది?"

అరుణ వంటగదిలోకి నడుస్తూ.

"అత్తయ్య గుడికి వెళ్ళింది. వచ్చేస్తుంటుంది. పాపం ఆవిడకిక్కడ ఏమీ తోచటంలేదు. వగలంతా పాపతో వొక్కత్తే ఉండాలి. నిజంగా నీకంటే మీ అమ్మే మంచిది."

"నా మంచితనం అంతా మా అమ్మనించే వచ్చింది" గర్వంగా అన్నాడు ప్రకాశం.




శుక్రవారం ఉదయం కాలేజీకి వెళుతూ అరుణ "అత్తయ్యా — ఇవాళ నేను ఆలస్యంగా వస్తాను. ఆయనతో చెప్పటం మర్చిపోయాను. ఇవాళ సినిమాకి వెళ్దామన్నారు. ఆయన రాగానే నేను ఆలస్యంగా వస్తాననీ, సినిమాకు రేపు వెళ్దామనీ చెప్పండి" అంది.

ఉయ్యాలలో పాపని ముద్దుపెట్టుకుని చెప్పులు తొడుక్కుంటుంటే కమలమ్మ

"పాపకు మధ్యాహ్నం వేయాల్సిన మందు లేదమ్మాయ్. ఇవాళ వెయ్యక పోయినా ఫరవాలేదా" అనడిగింది. రెండు రోజుల నుంచీ పాపకు కొద్దిగా జ్వరం వస్తోంది. అరుణ కాలేజీకి వెళ్ళేప్పుడు, మందులు ఏవి యెప్పుడు వెయ్యాలో కమలమ్మకు చెప్పివెళ్తోంది. క్రితం రోజు సాయంత్రం జ్వరం తగ్గి పాప బాగా ఆడుకుంది. రాత్రి కూడా హాయిగా నిద్రపోయింది.

"అరే? ఆ మందు అయిపోయిందా? నేను తెచ్చి ఇచ్చి వెళ్తాలే. మందు మాత్రం తప్పకుండా వెయ్యాలి. మళ్ళీ ఒళ్ళు వెచ్చబడితే ఇదిగో ఈ పచ్చసీసాలో మందు ఓ స్పూను తాగించండి. సామాన్యంగా జ్వరంరాదు" అంది అరుణ, మళ్ళీ ఉయ్యాల దగ్గరికి వెళ్ళి పాపను చూస్తూ.

"రాదులే! ముఖం తేటగానే ఉంది. ఆ మందు ఇచ్చి వెళ్ళమ్మా" అంది కమలమ్మ.

అరుణ మెడికల్ షాపుకి వెళ్ళి మందు తెచ్చి ఇచ్చి హడావుడిగా కాలేజీకి వెళ్ళింది.

సాయంత్రం కాలేజీ అవగానే లెక్చరర్లందరూ ఓ గదిలో సమావేశమయ్యారు.

వాళ్ళు ఇంతకుముందు కమిటీ వాళ్ళకిచ్చిన డిమాండ్స్ మీద చర్చ జరగాలని ఈ మీటింగు ఏర్పాటు చేశారు. ఇక ఆచర్చ అనంతంగా సాగింది.

పెట్టిన డిమాండ్స్‌లో వొక్కదానికి కూడా అర్థం లేదని వొకాయనంటే...

వొక్కదానికి మాత్రమే అర్థం ఉందని ఇంకొకాయన...

ఆ ఇద్దరూ అలా వాదించుకుంటూ డిమాండ్స్ సంగతి వదిలేసి వ్యక్తిగత తగాదాల్లోకి వెళ్ళారు.

కేశవరావు వాళ్ళిద్దర్నీ సర్ది తన అభిప్రాయం చెప్పాడు.

ఇక అందరూ వొక్కసారే మాట్లాడబోయి వినేవాళ్ళు ఎవరూ లేరని గ్రహించి యెవరికి వాళ్ళు పక్కవాళ్ళతో మాట్లాడటం మొదలెట్టారు.

అంతా గందరగోళమై అరుణకు విసుగేసింది. ఆడవాళ్ళందరూ "మీటింగయిపోయింది వెళ్ళండి" అని వాళ్ళుయెప్పుడు చెబుతారా అని కాచుక్కూచున్నారు.

డిమాండ్స్ గురించి కాకుండా తమ సొంత విషయాలేవో నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు, వీళ్ళంతా.

"మనం కూడా డిమాండ్స్ గురించి ఆలోచించి మన అభిప్రాయం చెప్పొద్దూ. మీరేమనుకుంటున్నారో చెప్పగూడదూ. ఈ గోలన్నా కాసేపు ఆపుతారు" అంది అరుణ పక్కనున్న

నుగుణతో.

"ఆఁ— సింగినాదం. వాళ్ళే యేదో తిప్పలు పడతారులే. మనకెందుకు? మినిట్స్‌బుక్‌లో సంతకం చేశాం. చాలు. అనలిక వెళ్ళిపోవచ్చు —కదూ—" అంది నుగుణ మిగిలిన వాళ్ళను చూస్తూ.

మిగిలిన వాళ్ళంతా దానికి సిద్ధమే నన్నట్టు తలలాడించారు.

మగవాళ్ళమధ్య చర్చ యెంతకూ తెగలా. ఎవరేం మాట్లాడుతున్నారో అర్థం కావటంలా. చివరకు పదిమంది ఓ గుంపుగా చేరి ఆలోచించి డిమాండ్స్ విషయంలో తుది నిర్ణయం తీసుకునేందుకు వో స్టీరింగు కమిటీని ఆరుగురు లెక్చరర్లతో వేశారు.

ఆ ఆరుగురిలో ఒక్క డిమాండ్‌కీ అర్థం లేదన్నాయనా, ఒక్క డిమాండ్‌కే అర్థం ఉందన్నాయనా కూడా ఉన్నారు. వాళ్ళిద్దరి మధ్యా యెన్నటికైనా సయోధ్య కుదురుతుందా అని ఆశ్చర్యంలో పడింది అరుణ.

ఇక స్టీరింగ్ కమిటీ ఆ విషయం తేల్చాకనే మళ్ళీ మన సమావేశం అని చెప్పేశారు.

అందరూ వొడ్డునపడ్డట్టుగా ఊపిరి పీల్చుకుని యెవరిదారిన వాళ్ళు పరిగెత్తారు. అరుణకు బస్సంది ఇల్లు చేరేసరికి యేడున్నరయింది. చాలా అలసటగా అనిపించింది.

వేడిగా టీ తాగి, స్నానం చేసి ఓ గంట పాపతో ఆడి అప్పుడు మొదలెట్టాలి వంట. అంటే తొమ్మిదింటికి వంట మొదలైతే భోజనాలయ్యే సరికి పది. సాయంత్రం బట్టలు నానబెట్టి ఉంటుంది అత్తయ్య. అవిక రేపు పొద్దునే ఉతకాలి.

ఒక్కరోజు రెండు మూడు గంటలు ఆలస్యంగా ఇంటికొస్తే ఎంత హడావుడో, ఇంట్లో యెన్ని చికాకులో! ముందు టీ తాగితేగాని పనిలో పడే ఉత్సాహంరాదు—అనుకుంటూ వచ్చిన అరుణ ఇంటికి తాళం పెట్టి ఉండేసరికి మతిపోయిన దానిలా నిల్చుండి పోయింది.

ఇద్దరూ కలిసి పాపను తీసుకుని గుడికి వెళ్ళారా? పాపకు జ్వరంగాని ఎక్కువైందా?

ఎదురింటివాళ్ళనడిగితే వాళ్ళు తెలియదన్నారు. పక్కింటివాళ్ళు కూడా లేరు.

అరుణకు కాళ్ళూచేతులూ ఆడలేదు.

ప్రకాశం గుడికి వెళ్ళడు. పాపకేమయింది?

హాస్పిటల్‌కి వెళదామని శక్తంతా కూడదీసుకుని వాకిట్లోకి వచ్చేసరికి యింటిముందు ఆటో ఆగింది. పాపనెత్తుకుని ప్రకాశం, వెనకాలే కమలమ్మా దిగారు.

"పాపకేమయింది?" అరుణ కంగారుగా పాపను తీసుకోబోయింది.

"ఏం కాలేదు. నీ దయవల్ల బాగానే వుంది." ప్రకాశం విసురుగా యింట్లోకి నడిచాడు.

"అత్తయ్యా-యేమయింది?"

"మధ్యాహ్నం దాకా బాగానే వుందమ్మా. మూడింటికి కాస్త వొళ్ళు వెచ్చబడ్డట్టుంటే మందు వేశాను. జ్వరం తగ్గకపోగా పెరిగింధి. ఐదుగంటలకంతా వొళ్ళు మసిలిపోయింది. ఐదున్నరకు ఫిట్టల్లే వొచ్చింది. ఇద్దరం హడలిపోయి హాస్పిటల్‌కు తీసుకుపోయాం. డాక్టరమ్మ యేవోయింజక్షన్లు యిచ్చింది. అరగంటలో తెలివివచ్చింది. ఎందుకైనా మంచిదని యింకోగంట అక్కడే వుండి మందులు తీసుకుని వచ్చేశాం. అరుణ వుయ్యాల దగ్గరకు వెళ్ళి నిద్రపోతున్న పాపను చూస్తూ నిలబడింది.

"ఎంత అవస్థపడిందో యింత పసిది" అనుకుంటే కళ్ళవెంట నీళ్ళొచ్చాయి.

కమలమ్మ అదిచూసి నవ్వింది.

"ఇద్దరికిద్దరే-సరిపోయారు. పసిపిల్లలకు జ్వరం రాదా పోదా! కాస్త అజీర్ణంచేస్తే వాతం చేస్తే చిన్నబిడ్డకి నొప్పివస్తుంది. మీ అందరికీ యెన్నిగండాలు గడిస్తే పెద్దాళ్ళయ్యారు. కంగారుపడి కాళ్ళు తొక్కుకుంటే యేమవుతుంది- హాస్పిటల్లో వాడికంగారు చూడాలి" అంది.

అరుణ నెమ్మదిగా గదిలోకి నడిచింది. ప్రకాశం మంచానికి అడ్డంగా పడుకున్నాడు.

పక్కనేకూచుని "బాగా కంగారు పడ్డావా?" అంది.

ప్రకాశం మాట్లాడలేదు.

"బాగా అలసటగా వుందా? టీఅన్నా తాగావా?"

"వాడు ఆఫీసు నుంచి వచ్చిటిఫిన్ తిని టీ

తాగాడు. డాక్టరు కూడా మాకు టీ తెప్పించింది. నీ స్నేహితురాలి అక్కేనటగా. నువ్వు యేమీ తిన్నట్టులేవు. ముందు కాస్త యేదన్నా తిని టీ తాగు'' అంది కమలమ్మ.

అరుణ లేచి ముగ్గురికీ టీచేసి కమలమ్మకోకప్పు యిచ్చి, రెండు కప్పులు తీసుకుని గదిలోకి వచ్చింది.

''లే- లేచిటీ తాగు. పాప బాగానేవుంది''

''బాగుంటే నీకేం. బాగాలేకపోతే నీకేం''

ప్రకాశం లేచి కూచున్నాడు.

''అదేంటి?'' విస్తుపోయింది అరుణ.

''యేంటని నన్నడుగుతున్నావా? పాపకు బాగోలేదనే ఆలోచన లేకుండా నువ్వు నీ పనులు చూసుకుంటుంటే- అమ్మకేం తెలుసు ఈసిటీలో. సమయానికి నేనున్నాను గనుక సరిపోయింది. నేనూ ఆలస్యంగా వస్తే?—'' కోపంగా అన్నాడు.

''ఔను యెవరో వొకరం యింటిదగ్గర వుండేలా చూసుకోవాలి. నేనివాళ నీకు చెప్పటం మర్చిపోయాను. యికనుంచీ నాకు పనున్న రోజు ముందే చెబుతాను, నువ్వు తొందరగా యింటికి రావచ్చు. నీకు పనున్న రోజున నేను యెటూ వెళ్ళను.''

అరుణవంక చాలా అసహనంగా చూశాడు ప్రకాశం. ''జరిగింది నీకేం పట్టలేదు. మూడున్నరకే ఆఫిట్సు వచ్చివుంటే యేమయ్యేది?''

అమ్మో-యెట్లా'' అరుణ భయంతో వొణికింది.

''పాపకు బాగోలేని రోజు కాలేజీకి వెళ్ళకు. ఇవాళనలు నువ్వెలా కాలేజీకి వెళ్ళావే, వెళ్ళినదానివి వేళకు రాకుండా యెట్లా యెక్కడ తిరిగొచ్చావో నాకర్థంకావటం లేదు. నిన్న సాయంత్రమే గదా జ్వరం తగ్గింది. ఒక్కరోజు దగ్గరుండి చూసుకోవద్దా?''

''పొద్దున బాగానే వుంది. తగ్గిపోయిందనుకున్నాను'' సంజాయిషీ చెబుతున్నట్లు అంది అరుణ.

''మళ్ళీ తిరగబెడుతుందనే ఆలోచనెందుకు లేదూ అని'' ప్రకాశం ధోరణికి అరుణకు కోపం వచ్చింది.

''మరి నీకెందుకు లేదు? నువ్వెందుకు ఆఫీసుకు వెళ్ళావు. కనీసం నన్నెందుకు హెచ్చరించలేదు?''

''నువ్వింత అజ్ఞానంగా వుంటావనుకోలేదు. యికనుంచీ చెబుతాలే''

''చెప్పటమెందుకు? నా అజ్ఞానంతో యేంచేస్తానో. పాపకు బాగా లేనప్పుడు నువ్వే శలవు పెట్టి చూసుకో''

''ఇక నాఖర్మగాలి అలా కూడా చెయ్యాలి. అరుణా-నువ్వు పాపగురించి నిర్లక్ష్యంగా వున్నావంటే నాకు చాలాకోపం వొస్తుంది''

''నీవుద్దేశం యేంటి? పాపని కావాలని నిర్లక్ష్యంచేశానా? వొక్కరోజు పాప బాధ్యత తీసుకునేసరికి నీకింత అసహనం వొచ్చిందే- యేమయిందిప్పుడు? సమయానికి నేనులేక నువ్వు హాస్పిటల్‌కు తీసికెళ్ళావు. ఎన్నిసార్లు నేనొక్కదాన్ని తీసికెళ్ళలేదు? ఎన్నిరాత్రుళ్ళు నువ్వు హాయిగా నిద్రపోతుంటే నేను దానికి మందులు వెయ్యలేదు? ఒక్కరోజు నేను సమయానికి లేనని నన్నో మూర్ఖురాలికింద, పిల్లంటే ప్రేమ లేనిదానికింద జమకట్టి, యేమిటీ విచారణ నామీద? నేను గిల్టీఫీలై తప్పు వొప్పుకుని...''

అరుణగొంతులో దుఃఖం అడ్డుపడి మాట్లాడలేకపోయింది.

''ఏంటట్రా మీ వాదనలు. పిల్ల శుభ్రంగా నిద్రపోతోంది. కంగారేమీ లేదు. అమ్మాయ్ అరుణా- వాడికి పాప ఫిట్సు చూసిన దగ్గర్నించీ మతి మతిలో లేదులేమ్మా- వాడి మాటలు పట్టించుకోకు. లేరా లేచి స్నానంచెయ్యి.''

ప్రకాశం లేచి స్నానాల గదిలోకి వెళ్ళాడు. పాప కదిలి యేడుస్తుంటే అరుణ వుయ్యాల దగ్గరకు పరిగెత్తింది.

పాప పక్కబట్ట తడుపుకుని యేడుస్తోంది. పక్కమార్చి పాపవొళ్ళు తుడిచి పౌడర్ వేసి పాపను గుండెలకు హత్తుకుంటే అరుణకు ఆగకుండా దుఃఖం వొచ్చింది.

''ఈపసిదంటే తనకు నిర్లక్ష్యమా? తనరక్తంలో రక్తం. ప్రాణంలో ప్రాణం. ఎట్లా వూపిరి పోశాను దీనికి. ఎట్లా తెచ్చాను ఈలోకంలోకి. ఇదంటే నాకు నిర్లక్ష్యమా? ఎందుకట్లా మాట్లాడాడు ప్రకాశం?''



పాప యేడుస్తుంటే లేచి పాలుపట్టింది.

ప్రకాశం 'అమ్మా అన్నం పెట్టు' అని ఓకేక పెట్టాడు.

అరుణ తలెత్తి చూసింది. ప్రకాశం ముఖం యింకా అలాగే వుంది. బరబరా తల దువ్వేస్తున్నాడు.

అరుణ తల్లిగా తన బాధ్యత విస్మరించిందని ప్రకాశం కోపం.

పాపకు బాగోలేదే అని ఆలోచించకుండా మీటింగుకు వెళ్ళటమేమిటని అతని ప్రశ్న.

తాను కూడా సినిమాకు వెళ్లామన్న విషయం అతనికి గుర్తురాలేదు. ఫిట్టు మధ్యాహ్నం మూడింటికి గాక ఎనిమిదింటికి వస్తే యేమయ్యేదని అతను ప్రశ్నించుకోలేదు. అలాప్రశ్నించుకోవాల్సిన అవసరం తనకుందని కూడా ప్రకాశం అనుకోడు. పాపకు సంబంధించిన పనులన్నిటికీ అరుణదే బాధ్యత అన్న విషయంలో అతనికి సందేహం లేదు. అందుకే అరుణ తప్పువొప్పుకోనందుకు మరింత కోపంవొచ్చింది ప్రకాశానికి.

"రండి. అన్నం పెట్టాను. అరుణా వెళ్లు, నేను పాపదగ్గర వుంటాను" అంటూ వుయ్యాల దగ్గరికి వచ్చింది కమలమ్మ.

"నాకాకలి లేదత్తయ్యా. మీరిద్దరూ తినండి. నే పాపదగ్గర వుంటా."

"ఆకలిలేకపోవటమేమిటి? పొద్దునెప్పుడో తిన్న తిండి. వెళ్ళు- వెళ్లి తిను"

"కాదులే అత్తయ్యా. నేను తినను"

ప్రకాశం వెళ్ళి కంచంముందు కూచున్నాడు.

"నీకేమన్నా దెయ్యం పట్టిందేమిరా. వుత్తిపుణ్యానికి అమ్మాయిని యేడిపించావు. యేమయిందిప్పుడు? పాప శుభ్రంగా వుంటే-" అన్నంతో పాటు చివాట్లు కూడా పెట్టింది కమలమ్మ.

ప్రకాశం అన్నంతిని వెళ్లగానే "రా అరుణా నాకు ఆకలేస్తోంది. నువ్వుతినకపోతే నేనూ తినను" అంటూ కమలమ్మ వచ్చేసరికి అరుణ యిక తప్పక లేచింది.

"ఏంటమ్మా యివాళ ఇంతాలస్యమైంది?"

"మీటింగు వుందత్తయ్యా. మాకివ్వాడు పూర్తిజీతం యివ్వటం లేదుగదా. పూర్తిజీతం కోసం కమిటీ వాళ్ళ నడగాలనీ, వాళ్ళివ్వ మంటే యేదో వొకటి చెయ్యాలనీ- యివన్నీ మాట్లాడుకోటానికి మా లెక్చరర్లందరం మీటింగు పెట్టుకున్నాం. పావకిలా అవుతుందను కోలా. లేకుంటే మీటింగుకి వెళ్లే దాన్ని కాదు"

అరుణ గొంతులో ఇష్టంలేని నంజాయిషీ ధ్వనించింది. ఆ నంజాయిషీని అవలేని తన అశక్తతకు దుఃఖం వొచ్చి మాట్లాడకుండా కూచుంది అరుణ.

"అయ్యో- యిప్పుడేమయింది. పూర్తిజీతంవస్తే నయంకదూ. దానికోసం పెట్టుకున్న మీటింగుకి వెళ్ళకపోతే యెట్లా. వాడికీ మీటింగు సంగతి తెలవకా, అపిల్లదాని బాధ చూసి మతిపోయీ అట్లా మాట్లాడాడులే. నువ్వు పట్టించుకోకు. పావను యిన్నాళ్లూ నువ్వు చూడక వాడు చూశాడా."

కమలమ్మ అనునయంగా మాట్లాడుతుంటే అరుణ కళ్ళవెంట నీళ్లు ఆగకుండా కారుతున్నాయి. గబగబా నాలుగు ముద్దలు తిని వెళ్ళి పావను పక్కలో వేసుకుని పడుకుంది.

* * *

మళ్ళీ నెలరోజుల తర్వాత స్టీరింగ్ కమిటీ నిర్ణయాల గురించి ఇంకో మీటింగుందని కేశవరావు చెబితే ఆ మీటింగుకి ఉండాలో లేదో వెంటనే తేల్చుకోలేక పోయింది అరుణ.

నెల రోజులనాటి గొడవ గుర్తొచ్చింది. అప్పుడు రెండు రోజుల్లో ప్రకాశం మామూలయ్యాడు. ఏమీ జరగనట్టుగా, అదో పెద్ద విషయం కానట్టుగా ఆ ప్రసక్తే తీసుకుర్లాలేదు. ఆ తరువాత ఆదివారం అందరూకలిసి బిర్లా మందిరానికి కూడా వెళ్ళారు. "మనిద్దరం ఇక్కడ కూచుందాం అమ్మ గుళ్ళోకి వెళ్ళొస్తుందిలే" అని మధ్యలోఆపి కమలమ్మ వొచ్చేదాకా కబుర్లు చెప్పి నవ్వించాడు. అరుణ కూడా పావకు బాగా సీరియస్ అవటంతో ప్రకాశం అప్‌సెట్ అయి అలా మాట్లాడాడనుకొని ఆ విషయం గురించి ఆలోచించటం మానేసింది.

అంతా సవ్యంగానేవున్నా మళ్ళీ మీటింగుకి వెళ్ళాలనేసరికి అరుణ భయంతో సందేహంతో తరచి తరచి ఆలోచించాల్సి వచ్చింది. చివరికి మీటింగుకి ఉండాలనే నిర్ణయించుకుంది.

పావకు అనారోగ్యపు ఛాయలు కూడాలేవు. యింట్లో పనులేమీలేవు. ముందురోజే వారానికి సరిపడా పిండివంటలుచేసి డబ్బాల్లో సర్దింది. కమలమ్మ మధ్యాహ్నం టిఫిన్‌చేస్తూ, పావను చూస్తూ యిబ్బందిపడే పనికూడాలేదు. యే రకంగా ఆలోచించినా మీటింగుకివుంటే నష్టమేమీ కన్పించలేదు అరుణకు.

అయితే తీరా మీటింగుకి వెళ్ళాక తానసవసరంగా వచ్చానా అనిపించింది. కాలేజీ స్టాఫ్ లోఉన్న ఎనిమిదిమంది ఆడవాళ్ళలో అరుణొక్కతే మీటింగుకి వచ్చింది. మిగిలిన వాళ్ళు పనుందనీ, వీలుకాదనీ ముందే యిళ్ళకువెళ్ళిపోయారు.

మీటింగు వరస మామూలే! రెండున్నర గంటలు జరిగిన మీటింగులో అరగంట మాత్రమే అసలు విషయాలు మాట్లాడారు. మిగిలిన రెండు గంటలూ వాదోపవాదాలూ, చర్చలూ, వొకరిమీద వొకరు విసుర్లూ, జోకులు!

ఇంటికి తొందరగా వెళ్ళాలనే ఆతృత లేకపోతే అరుణ కూడా మిగిలిన వాళ్ళలా ఆ రెండు గంటలూ సంతోషంగా ఉండేదేమో గాని, 'ఇంటిదగ్గర పావకేమన్నా అవుతుందా? అత్తయ్య పావను మంచంమీద పడుకోబెట్టి యే పనిమీదో అవతలకి వెళితే, పావ పడిపోతే, సాయంత్రం పెట్టాల్సిన ఫారెక్స్ సరిగ్గా కలవక ఉండల్లే గొంతుకి అడ్డంపడితే, యే కడుపునొప్పొవచ్చి ఆపకుండా యేడిస్తే-అయ్యో అట్లా యేడిస్తే ముందు బట్టలన్నీ విప్పి ఎక్కడన్నా యే చీమన్నా ఉందేమో చూడమనీ, లేకపోతే బరాల్గన్ డ్రాప్స్ వెయ్యమనీ చెప్పివస్తే బాగుండేది.'

లక్ష అనుమానాలతో అరుణ తలపగిలిపోతున్నట్లనిపించింది. తల్లో నరాలన్నీ టెన్షన్‌తో టకటకా కొట్టుకుంటున్నాయి. మీటింగు అవగానే వొక్క ఉదుటునలేచి పరిగెత్తు తున్నట్టేనడిచి బస్‌స్టాపులో నిలబడింది. వెనకాలే కేశవరావు వచ్చాడు.

"చాలా హడావుడిగా వచ్చేశారేంటి?"

అన్నాడు నవ్వుతూ.

"చాలా టైమైందండీ. మా పాప యెలా ఉందో'

"మీరు కాలేజీలో ఉన్నప్పుడు ఎవరు చూస్తారు?"

"మా అత్తయ్య ఉన్నారండి. లేకపోతే నాకింకా కష్టమయ్యేది"

"మరింకేం? ఎవరో వొకరున్నారుగా'

"ఆవిడకైనా పసిపిల్లతో రోజంతా కష్టం కదండీ. సాయంత్రానికి నేవెళ్ళి ఛార్జి తీసుకోవాలి" నవ్వింది అరుణ.

"మీరు చాలానయం. మిగిలిన ఆడవాళ్ళు చూడండి వొక్కరన్నా ఉన్నారేమో"

"కాలేజీ అయ్యాక ఇంట్లో పనులు తల్చుకుంటే మీటింగుకి ఉండటం కష్టమండీ. పైగా మీటింగులో కూడా చాలా టైం పూరికే వృధా చేస్తున్నారు. ఇవాళ మనం అసలు విషయం గురించి అరగంట మాట్లాడుకున్నామో లేదో. మిగిలిన రెండు గంటలూ అనవసరమైన మాటలే. అవతల పని పెట్టుకుని ఇట్లా కూచోటం ఎలా కుదురుతుంది చెప్పండి."

"వారానికో రోజే కదండి. రెండు గంటలు అనవసర కాలక్షేపం అన్నారుగాని- మన వాళ్ళ స్వభావాలూ అభిరుచులూ ఎంత బాగా బైటపడతాయి. మనం క్లాసు రూంలోపడే కష్టాల గురించి అంత స్పోర్టివ్‌గా మాట్లాడుకోగలిగితే మన ఉద్యోగం హాయిగా ఉంటుంది. మీకు మానవ స్వభావాన్ని గమనించాలనే ఆసక్తే లేదా?"

"చాలా పెద్దమాట వాడారే" బస్సుకోసం దూరానికిచూస్తూఅంది అరుణ.

"పెద్దమాట కాదండీ. మీరు క్లాసు రూంలో పాఠంచెప్పి వెళ్ళిపోతే ప్రపంచం గురించీ మనుమల గురించీ ఏం తెలుస్తుందండీ. ఆరెండింటి గురించీ తెలుసుకోకుండా ఏమో- నాకైతే బతకటం దండగనిపిస్తుంది. మీరు చదివే పుస్తకాల్నిబట్టి మీరు మిగిలిన వాళ్ళ కంటే కాస్త వేరని ఈ మాటలు మాట్లాడుతున్నాను-వేరేగా-"

"అమ్మయ్య-బస్సొచ్చేస్తోంది" అరుణ ముఖం వికసించింది.

"మీ ఇల్లు మిమ్మల్లెలా ఆకర్షిస్తుందో మీ ముఖంచూస్తె తెలుస్తోంది. ఒ రోజు మీ ఇంటికి రావాలి"

"తప్పకుండా-నే వెళ్తున్నా" హడావుడిగా బస్సెక్కింది.

"ఆరూముప్పావు అయింది. ఏడింటికల్లా ఇంట్లో ఉండొచ్చు. ఆకలి దంచేస్తోంది. మీటింగున్న రోజు తప్పనిసరిగా కాంటిన్‌లో టిఫిన్ తినాలి. కేశవరావు చాలా చక్కగా మాట్లాడతాడు. తనకింతవరకూ తెలియదు. ప్రపంచం గురించీ మనుమల గురించీ తెలుసు కోకుండా బ్రతకటం వృధా అన్నాడు. ఎంత చక్కగా ఉందో ఆ ఆలోచన. నే చదివే పుస్తకాలు ఎందుకు గమనించాడూ? మనుమల్ని తెలుసుకోవటం ఇష్టమన్నాడుగా! తనని గురించి కూడా తెలుసు కోవటానికి ప్రయత్నించాడన్న మాట. ఒక మనిషిని, చదివే పుస్తకాలబట్టి ఆ మనిషిని తెలుసుకోవాలని ప్రయత్నించటం మంచిదే. పుస్తకాలవల్లే గదూ, ఉమకూ తనకు ఇంత గాఢమైన స్నేహం ఏర్పడింది! కేశవరావు గురించి ప్రకాశంతో చెప్పాలి. ప్రకాశం ఏం చేస్తున్నాడో-పాపతో ఆడుతూ తన కోసం ఎదురుచూస్తూ ఉండి ఉంటాడు." ఆలోచనల్లో అరుణ దిగాల్సిన స్టాపు వచ్చేసింది. బస్సుదిగి చల్లటిగాలి వొంటికి తగిలి హాయిగా అనిపిస్తుండగా ఇల్లు చేరింది అరుణ.

ప్రకాశం పాప నెత్తుకుని వాకిట్లో నిలబడి ఉన్నాడు.

"పాపం కంగారుపడి ఉంటాడు" అనుకుంటూ వచ్చింది.

"ఎక్కడికెళ్ళావు ఇంతసేపు"-ప్రకాశం కాస్త కంగారుగానే అడిగాడు.

"ఎక్కడి కెళతాను- కాలేజీలోనే అసోసియేషన్ మీటింగుంది."

"మరి అమ్మతో పొద్దున్న చెప్పి వెళ్ళగూడదా?"

"అసలు మీటింగుందని కాలేజీకి వెళ్ళాకే తెలిసింది. ముందు ఉండొద్దనే అనుకున్నా తీరా టైమయ్యేసరికి ఉండాలనిపించింది. బాగా కంగారు పడ్డారా?"

పాప అరుణ మీదకు దూకబోతోంది.

"ఉండమ్మా-కాళ్ళూ చేతులూ కడుక్కు వస్తాను. చాలా మురిగ్గా ఉన్నాను." అంటూ బ్యాగు టేబిల్‌మీద పడేసి బాత్‌రూంలోకి వెళ్లింది.

"ఒక్కసారే స్నానం చెయ్యరాదమ్మాయ్"

కమలమ్మ సలహాతో ప్రాణం లేచొచ్చినట్లయి స్నానంచేసి పాప దగ్గరకు వచ్చింది. కమలమ్మ ప్లేటులో ఇంత కారప్పూస తెచ్చిపెట్టింది.

"టీ వొద్దులే అత్తయ్యా. ఆరింటికి కాలేజీలో తాగాను" అనటంతో కమలమ్మ కూడా అక్కడే కూచుంది.

"మా అమ్మ నిన్ను బాగా చెడగొడుతోంది" అన్నాడు ప్రకాశం.

"అదేంటిరా" అంది కమలమ్మ.

"ఆవిడ కాలేజీనుంచొచ్చి, నీకు సేవలు చెయ్యాల్సింది, నీచేత సేవలు చేయించుకుంటోంది."

"సేవలేమిటి? కష్టపడి పనిచేసి ఇంటికొస్తే కొంత కాఫీఇచ్చే వాళ్ళుంటే ప్రాణానికి హాయిగా ఉంటుంది. మీ అన్నయ్యా చదువుకునేటప్పుడు నేను పొలం వెళ్ళేదాన్నా-పొలం నుంచి వొచ్చేసరికి మీరంతా ఎదురు చూస్తుండేవారు. మీ పనులన్నీచేసి ఇన్ని వేణ్ణీళ్ళు పోసుకుని కాఫీ తాగేసరికి వొక్కోసారి ఎనిమిదయ్యేది. మీరు అన్నాలకి రానే వచ్చేవారు. పనినుంచి ఇంటికి రాగానే ఎవరన్నా ఇంత కాఫీఇస్తే ఎంత బాగుంటుందో అనుకునేదాన్ని" కమలమ్మ పాత రోజులు గుర్తు తెచ్చుకుంది.

"అత్తయ్యా! తను ఆఫీసునుంచి రాగానే టీ ఇవ్వాలి. అది సేవకాదు. నాకు మీరిస్తేనే సేవ" అరుణ ఉక్రోషంగా అంది.

"ఏయ్-నేను నీకు ఎన్నిసార్లివ్వలేదు?"

"నీకు నేనూ ఇచ్చాను. నాకు నువ్వూ ఇచ్చావు. అదిసేవ అనుకోలేదు." అరుణ అడ్డుకొట్టింది.

"మనంవేరు. అత్తగారు గదా. ఆవిడ కూడా ఇస్తోంది. అలాంటి అత్తగారు దొరకటం నీ అదృష్టం అంటున్నాను"

"ఔను. నిజమే! అత్తయ్య దొరకటం నా అదృష్టమే"

"మరి నా సంగతో! నే దొరకటం అదృష్టంకాదా?"

"అదే ఆలోచించాలి" సీరియస్‌గా అంది అరుణ

"అమ్మ! చంపావుగదా. సరేగాని మీ మీటింగు విశేషాలేమిటి? ఎప్పుడిస్తారట పూర్తి జీతాలు."

"రెండుసార్లు మీటింగు పెట్టగానే పూర్తి జీతాలిస్తే లేనిదేం ఉంది! నెల రోజులు టైమిచ్చి నోటీసిచ్చాం. నెల రోజుల్లో వాళ్ళు మా డిమాండ్స్ పట్టించుకోకపోతే మాస్ క్యాజువల్ లీవ్ పెడతాం"

"అంటే ఏంటమ్మా" కమలమ్మ అడిగింది.

"లెక్చరర్లందరం ఒకేరోజు శెలవు పెడతాం అత్తయ్యా"

"పెడితే వాళ్ళకేం నష్టం?"

"మరి కాలేజీ జరగదు. పేపర్లో వార్త వొస్తుంది. అందరికీ మా సంగతి తెలుస్తుంది."

"ఊ-అప్పటికీ ఇవ్వకపోతే?"

"అప్పటి సంగతి అప్పుడు"

"ఒక్కరోజు శలవుపెట్టే కార్యక్రమానికా ఈ మీటింగు" నిరసనగా అన్నాడు ప్రకాశం.

"అందరిచేతా ఒకేరోజు శలవు పెట్టించటమంటే మాటలు అనుకున్నావా? పెద్ద పెద్ద యుద్ధాలు జరిగాకగాని దీనికి అందరూ వొప్పుకోలేదు. మా మీటింగులు తమాషాగా ఉంటాయిలే. క్లాసురూంలో ఎవరే కష్టాలు పడ్డారో కూడా మీటింగుల్లో మాట్లాడతారు. లెక్కల మాస్టారు జోగారావుగారి టేబిల్‌మీద మొన్న దురదగొండి పొడి పూశారట. ఆయన చేతులన్నీ ఒకటే దురదట-" అరుణ నవ్వింది.

"అదేం పనమ్మాయ్. చదువుకునే వాళ్ళలా చేస్తారా?"

"అయ్యో-మీకు తెలీదత్తయ్యా! ఇవాళ చదువుకునే పిల్లలు పిల్లల్లాగా ఉండటంలేదు. రౌడీల్లాగా ఉంటున్నారు."

"నువ్వు కాలేజీలో అల్లరే చెయ్యలేదా" ప్రకాశం అడిగాడు.

"చేస్తే చేశానేమోగాని ఇలాంటి వెకిలి అల్ల

రిగాదు''

"అహా-అల్లరిలో కూడా మంచీ చెడ్డానా- ఎవరికి వాళ్ళు తాము చేసింది మంచి అల్ల రనే అనుకుంటారు''

"మీ ఉద్యోగం కష్టమే'' కమలమ్మ ఆశ్చర్య పోయింది.

"లేకపోతే మీ అబ్బాయి ఉద్యోగంలా గంట పనిచేసి హాయిగా కూచోటమనుకున్నా రా. క్లాసులోఉన్న గంటా అగ్ని పరీక్షే. ఎంత టెన్షన్‌తో ఉండాలో''

"గొప్ప ఉద్యోగమేలే- సంవత్సరంలో సగం శలవలేగా'' ప్రకాశం తన ఉద్యోగాన్ని గొప్ప చేసుకున్నాడు.

"సరేలే-మీ కబుర్లతో కడుపు నిండదు- పాపను నాకిలాఇచ్చి వంట సంగతి చూడరా దూ'' కమలమ్మ పాపను ఎత్తుకుంది.

అరుణ వంటగదిలోకి నడిచింది.

★ ★ ★

అరుణ ప్రతి శుక్రవారం అసోసియేషన్ మీటింగుకి వెళ్ళటం ప్రకాశానికేగాక కాలేజీలో మిగిలిన లేడీ లెక్చరర్లకు కూడా యిబ్బందిగా నేఉంది.

"మీరు ప్రతివారం మీటింగు కెళ్తున్నారట గా''

వరలక్ష్మి అడిగింది.

"ఔను. మీరసలు రావటంలేదే''

"నాకెలా కుదురుతుంది? నేను ఐదు గంట లకంతా ఇంట్లో లేకపోతే ఇంటిదగ్గర పిల్లలూ ఆయనా చిందులూ శివాలూ! ఐనా ప్రతివార మూ ఏముంటుంది ఆ మీటింగులో'' నిరసన గా అంది.

"ఏ ముంటుందో వెళ్ళి చూడాలి. ఎవర్నడి గితే ఎవరు చెబుతారు?'' కినుక్కున నవ్వింది సుగుణ.

అందులో నవ్వటానికేముందో అరుణకి అర్థం కాలేదు.

"అయినా నాకసలు మీటింగులంటే చచ్చేంత బోరు. శలవు పెట్టమంటే పెడతాను. నల్లబాడ్జీ పెట్టుకోమంటే పెట్టుకుంటాను. లేదా పదికాదు ఓ నెల వంద రూపాయలు చందా ఇమ్మంటే ఇస్తాను. మీటింగులకి మాత్రం పోలేను తల్లీ'' తన గురించి మహ త్తర విషయాన్ని చెబుతున్నట్టుగా అంది విమ లకుమారి.

"ఐనా అంతంతసేపు యేం చెబుతారు? వొట్టి కాలక్షేపం. మనకేం పనీపాటు లేదా· యేంటి, ముచ్చట్లు పెట్టుకు కూచోటానికి''

"మరే''

అరుణకు వీళ్ళ ధోరణేమీ అంతుబట్టలేదు. వాళ్ళకు వీలుగాక వాళ్ళు రావటం లేదు. అది గొప్పగానూ తాను వెళ్ళి ఏదో కానిపని చేస్తున్న ట్లుగానూ మాట్లాడతారెందుకా అని విస్తుపో యింది.

'ఎందుకు వాళ్ళ గొంతుల్లో అంత వ్యంగ్యం? ఈ ఒక్క విషయంలో వాళ్ళకంటే వేరుగా ఉండేసరికి సహించ లేకపోతున్నారేం?,

ఆ శుక్రవారం మీటింగుకి వెళ్ళటానికి అరుణ మళ్ళీ ఆలోచనలో పడింది.ఆడవాళ్ళే తన గురించి అంత చులకనగా మాట్లాడితే మగవాళ్ళు వాళ్ళ మనసుల్లో యేమనుకుంటు న్నారో-

అయినా వాళ్ళొక మీటింగు పెట్టి అందర్నీ రమ్మని వచ్చినవాళ్ళను చులకనగానూ రానివా ళ్ళను గౌరవంగాను చూడటం అదేం న్యాయం. నిజానికి తన్నే గౌరవంగా చూడాలి, వాళ్ళతో సమానంగా అసోసియేషన్ గురించి ఆలోచిస్తున్నందుకు. ఐనా వాళ్ల గౌరవం కోసం పాకులాడటమేమిటి? అసోసియేషన్ మెంబర్ గా మీటింగుకి వెళ్ళటం తన హక్కు. విధి. దానిగురించి చెయ్యటానికి లోకమంతా ఏమ నుకుంటారోనని ఆలోచించటం దేనికి?

కానీ రేపు వాళ్ళు మళ్ళీ అట్లా మాట్లాడితే- ఆ మాటలు భరించటం కష్టం కదూ. అయినా వాళ్ళ మాటలకంత విలువ ఇవ్వటమేమిటి. వాళ్ళ దృష్టిలో మంచిగా కనపడాలనే తాప త్రయం దేనికి? వాళ్ళ దృష్టిలో తనెన్నటికీ మంచిగా కనిపించదు. అరుణకు ఆంజనే యులుగారు ఎవరో ఒకావిడ గురించి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

"ప్రభావతి గారు నిజంగా గొప్ప మని షండి. అంత చదివిందా ఎంత వినయమో.

ఇంటి దగ్గర దించిన తల యూనివర్సిటీలో డిపార్టుమెంటుకి వెళ్ళిన తర్వాతే ఎత్తుతుంది. అదైనా ఏదన్నా పనుంటేనే. ఇంకోరి జోలి పట్టించుకోదు. తన పనేమో తానేమో. మాటకూడా ఎంత నిదానం."

అరుణకి ఆ రోజు ఆ మాటలు వింటుంటే చిరాకేసింది. పరిసరాల జ్ఞానం లేకుండా తల ఎత్తకుండా పుస్తకాలు బట్టీ వేస్తే అది చదువవుతుందా? ఎవరి సంగతీ పట్టించుకోని స్వార్థపరురాలికి ఈయన మెచ్చుకోలేమిటి? అంత నిదానం మాటల్తో పిల్లలకు చదువేం చెబుతుంది? అసలు ఆ తల ఎత్తకుండా ఇంట్లోనే పడివుండక ఆవిడకీ ఉద్యోగమెందుకు అని తెగ చిరాకు పడింది.

ఇంతింత చదువుకున్నా ఆడవాళ్ళు మన్ను తిన్న పాముల్లా పడివుండటం ఇష్టమన్న మాట ఈ మగాళ్ళకు అని తిట్టుకుంది.

'వాళ్ళ విలువలేమిటో తెలిసినా వాళ్ళ మాటలు భరించటమంటే కష్టంగానే ఉంది. పోనీ తానూ మానేస్తే?

మిగిలిన ఆడవాళ్ళందరూ మీటింగులకి రాకుండానే పూర్తి జీతాలు తీసుకోరూ?

వాళ్ళంతా హాయిగా ఐదుగంటలకే ఇల్లు చేరుకుంటుంటే తాను ఏడున్నరదాకా ఇంటికి పోకుండా ఇంటి దగ్గర పాపకెలా ఉందో, ప్రకాశాని కెక్కడ కోపం వస్తుందోనని టెన్షన్ పడుతూ ఎందుకీ గోల.

వెళ్ళకపోతే ఏమవుతుంది? కానీ ఎందుకు వెళ్ళకుండా ఉండాలి? తనకు వెళ్ళాలని పిస్తోంది. పూర్తి జీతమనే కాదు. అందరూ కలిసి కష్టం సుఖం మాట్లాడుకోవటం, కాసేపయినా ఒక విషయాన్ని గురించి సీరియస్‌గా ఆలోచించటం తనకు చాలా బాగుంటోంది. కేశవరావు అన్నట్టు సమస్యల గురించి తెలుసుకోవటం తనకూ బాగుంటోంది. మీటింగుకెళ్ళిన రోజు అలసటా టెన్షన్ ఉన్నా మానసికంగా తనకు చాలా ఉత్సాహంగా ఉంటోంది. అలాంటప్పుడు మానట మెందుకు తనకు ఉత్సాహం ఉంది. వెళ్తుంది. లేని వాళ్ళు రారు. అంతే! ఇందులో వాళ్ళు మంచయ్యేది లేదు. తను చెడ్డయ్యేది లేదు. ఇలాంటి ఆలోచనలతో అరుణ మీటింగుకి వెళ్ళింది. అంత జరిగినా ఆ సంవత్సరమంతా వాళ్ళ డిమాండ్స్ కమిటీ వాళ్ళు పట్టించుకోలేదు.

ప్రకాశం మాత్రం అరుణ మీటింగుకి వెళ్ళిన రోజల్లా విసుక్కుంటూనే, ఎగతాళి చేస్తూనే ఉన్నాడు.అరుణ కోపం తెచ్చుకుంటూనే ఉంది.

మరుసటి సంవత్సరం తాడోపేడో తేల్చాల్సిందేననే పట్టుదలతో కాలేజీలు తెరవగానే ఆందోళన మొదలు పెట్టారు. నెల తిరగక ముందే సమ్మె ప్రారంభించారు.

కాలేజీ బయట టెంటు వేసి లెక్చరర్లందరూ అందులో కూచున్నారు.

వచ్చిన పిల్లలకి తమ సమస్యలు చెపితే పిల్లలు కూడా లెక్చరర్లకి మద్దతిస్తూ క్లాసులు మానేశారు.

జర్నలిస్టులు వొచ్చారు. ఫోటోలు తీసారు.

మర్నాటి నుంచీ నిరాహారదీక్షలు చేయాలని తీర్మానించుకున్నారు.

మర్నాడు పేపర్లో వీళ్ల సమ్మె వార్తతో పాటు ఫోటో కూడా వేశారు. టెంట్‌లో అరుణొక్కతే లేడీ లెక్చరర్ అవటంతో ఫోటోగ్రాఫర్లు అరుణ మీదకు బాగా ఫోకస్ చేశారు. అరుణ ప్లే కార్డు పట్టుకుని అరుస్తున్న ఫోటో పేపర్లో వచ్చింది.

ప్రకాశం పేపరు చూస్తూనే 'అరుణా' అని కేకపెట్టాడు. అరుణ పరిగెత్తుకొచ్చింది.

"ఇదేమిటి?" పేపరు చూపిస్తూ తీవ్రంగా అడిగాడు.

"అరే-మా ఫోటో వచ్చిందా? "సంతోషంగా పేపరు లాక్కుని చూసింది.

"నీ-వరస నాకేం నచ్చలా-"

"నేనేం చేశాను?"

అరుణకేమీ అర్థంకాలేదు.

"మీకాలేజీలో ఇంకా ఆడవాళ్ళున్నారుగా. వాళ్ళెవరి ఫోటోలూ రాకుండా నీదే వచ్చిందేం?"

"వాళ్ళెవరూ టెంట్‌లోకి రాలా. ఇళ్ళ దగ్గిరే ఉన్నారు."

"మరి నువ్వొక్కదానివే ఎందుకెళ్ళావు. ను

వ్వా ఇంట్లో ఉండొచ్చుగా. ఆవేశంగా ఆ అరుపులేమిటి.? ఈ ఫోటో అన్ని పేపర్లలోనూ వచ్చే ఉంటుంది. నీ పూనకాన్ని చూసి అందరూ నవ్వుకుంటారిక''

అరుణ ముఖం నెత్తురుచుక్క లేకుండా పాలిపోయింది.

''నీకు ఎందుకర్థంకాదో నాకు తెలియటంలేదు. ఇవాళ ప్రతివాడూ నన్నడుగుతాడిక. మీ ఆవిడ ఫోటో పేపర్లో పడిందే అని. పోనీ చాలామంది ఆడవాళ్ళుంటే అది వేరు. ఛీ ఛీ—''

అరుణ ప్రకాశంవంక అట్లాగే చూస్తోంది.

''ఎందుకట్లా చూస్తావు. ఇకనుంచయినా ఆలోచించి చెయ్యి ఏ పనైనా. అవసరమైన విషయాలగురించి బుర్ర బద్దలయ్యేలా ఆలోచిస్తావు గానీ అసలు విషయాలగురించి నీకేమీ తెలియదు. చిన్నపిల్ల నయం''

''ఏమైందిరా- ఏమయిందమ్మా అరుణా?''

కమలమ్మ వచ్చింది.

''ఆవిడగారి ఫోటో పేపర్లో వచ్చిందిలే'' ప్రకాశం అవతల గదిలోకి వెళ్ళిపోయాడు.

కమలమ్మ పేపర్‌తీసి ఫోటోచూసి

''బాగా వచ్చిందే! మరెందుకు అరుస్తాడు'' అంది అరుణవంక చూసి.

అప్పటికే అరుణ ముఖం కోపంతో ఎర్రబడింది. ప్రకాశం బట్టలువేసుకుని బయటకు వెళ్ళిపోయాడు. అరుణకు దుఃఖం ఆగలేదు. పేపర్లో ఫోటో వస్తే అవమానకరం అని ప్రకాశం ఎందుకనుకుంటున్నాడో అరుణకు అర్థంకాలేదు.

'తను టెంట్‌లోకి వెళ్ళటం ఇష్టంలేదు.

తను మీటింగులకి వెళ్ళటం ఇష్టంలేదు.

ఎందుకిలా మారిపోయాడు?

మారిపోయాడా?

తాను స్ట్రైక్‌చేస్తే, మీటింగులకి వెళితే, ప్రకాశానికి ఇష్టమోకాదో తనకు తెలియదు.

ఆ విషయం గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. ఇప్పుడు తెలిసింది.

తనకు సోషల్ లైఫ్ ఉంటే ప్రకాశానికి నచ్చదు. ఇష్టం ఉండదు.

ప్రకాశానికి ఇష్టంలేదని తాను తనకిష్టమైన పనులు మానెయ్యాలా?

నిన్న టెంట్‌లో కూచుంటే తనకు చాలా బాగుంది. కమిటీవాళ్ళకు వ్యతిరేకంగా నినాదాలివ్వటం. విద్యార్థులతో తమ సమస్యలు చెప్పటం,జర్నలిస్టులతో మాట్లాడటం!

ఇదంతా తనకు ఉత్సాహంగా ఉన్నప్పుడూ, ఇదేదీ తప్పుకాదని తన మనసుకి తెలిసినప్పుడూ ఎందుకు మానుకోవాలి?

అరుణ చటుక్కునలేచి పనులలో పడింది. పాపకు స్నానంచేయించి వంటచేసి బయల్దేరేసరికి పదవనే అయింది.

''వాడికిష్టం లేనట్టుంది. మానెయ్యకూడదా?'' అంది కమలమ్మ.

''కుదరదత్తయ్యా. చాలా అవసరం. వెళ్లాలి. రేపటినుంచీ నిరాహారదీక్షలు. దానిగురించి మాట్లాడుకోవాలి.''

కమలమ్మ సమాధానంకోసం చూడకుండా బైటికి నడిచింది.

మళ్ళీ రెండింటికి ఇల్లుచేరింది.

ఆ రోజంతా ప్రకాశం మాట్లాడలేదు.

అరుణా పలకరించలేదు.

మర్నాడు ఉదయం అరుణ త్వరత్వరగా పనులు చేసుకుపోతోంది. రోజూ సాయంత్రం ఉతికే బట్టలు ఆరోజు పొద్దునే ఉతికేసింది. కూరలుచేసి పాపకు స్నానంచేయిస్తుంటే కమలమ్మ బియ్యం కడగటానికి వచ్చింది.

''నేను అన్నం తిననత్తయ్యా. ఇవాళ నిరాహారదీక్ష. రాత్రికే భోజనం''

కమలమ్మకు ఏం మాట్లాడాలో తెలియక లోపలికెళ్ళి బియ్యం కాసిని తీసి వచ్చింది.

అరుణ పాపను లోపలికి తీసుకొచ్చి బట్టలు తొడుగుతుంటే,

''కాస్త ఉప్మా చేస్తాను తిని వెళ్ళు. సాయంత్రందాకా ఒట్టి కడుపుతో ఎలా ఉంటావు.'' అంది.

''ఫరవాలేదులే అత్తయ్యా. ఒకపూటేగదా. ఇక్కడ శుభ్రంగా ఉప్మాతినివెళ్ళి నిరాహారదీక్ష అని పేరెందుకు?''



"అమ్మా ఆవిడ సత్యసంధురాలు. నీకెందుకు? అయినా సాయంత్రందాకా నిరాహారదీక్ష చేసినా ఏమీ నష్టంలేదు. పనీపాటా లేకుండా అక్కడ కూచుని వస్తుంది. సాయంత్రం వచ్చి హాయిగా తిని నిద్రపోతుంది. అన్నీ అమర్చిపెట్టటానికి నువ్వున్నావుగా. నిరాహారదీక్ష చెయ్యొచ్చు. ఇంకేమైనా చెయ్యొచ్చు."

అరుణ మాట్లాడకుండా పాపను కూచోబెట్టి బొమ్మలు ముందు పడేసి వంటింట్లోకి నడిచింది.

అక్కడ పనిచూసి ఇల్లుచిమ్మి, తుడిచి స్నానానికి వెళ్ళింది.

పదింటికంతా టెంట్‌లో ఉండాలి. తొమ్మిదిన్నర అవనే అయింది.

హడావుడిగా స్నానంచేసి వెళ్ళింది.

టెంట్‌లో ఉన్నంతసేపూ నీరసం తెలియలేదు. కానీ లేచాక కళ్ళు తిరిగినట్లనిపించింది. బస్సుకోసం చూసే ఓపిక లేక ఆటోలో ఇల్లు చేరింది.

కమలమ్మ అరుణను చూస్తూనే టీ చేసి తెచ్చింది. అరుణ టీతాగి మంచం మీద పడుకుని నిద్రపోయింది.

మళ్ళీ మెలకువ వచ్చేసరికి ఒళ్ళంతా నొప్పులు.

లేచి నిలబడే ఓపికకూడా లేనంత నీరసం. ఒక్కపూట భోజనం లేకపోతే ఇలా ఉంటుందా అనుకుంటూ నెమ్మదిగా హాల్లోకి వచ్చింది.

అరుణను చూస్తూనే పాప గబ గబా నడుస్తూ వచ్చి అరుణ చీర పట్టుకుని లాగుతూ ఎత్తుకోమని పేచీ పెట్టింది.

"ఇందాకట్నుంచీ నీ దగ్గరకు రాకుండా కాపలా కాయలేకచచ్చానంటే నమ్ము. ఇక ఈ పిల్లను పట్టుకోవటం నావల్ల కాదమ్మా. అల్లరి ఎక్కువైపోయింది."

"పోనీ రానివ్వకపోయారా?"

పాపను ఎత్తుకుంది.

"అయ్యో! నువ్వు శోషకొచ్చినట్లు పడిపోతివి. ఎలా లేవను. ఇకనన్నా అన్నం తిను. పాప తినేసిందిలే"

'మళ్ళీ తింటా' అంది పాప.

కమలమ్మమీద అంతులేని కృతజ్ఞతతో అరుణ మనసు నిండిపోయింది.

పాపకు చిన్న చిన్న ముద్దలు తినిపిస్తూ తానూ అన్నం తిన్నది.

పాపను పక్కలో వేసుకుని కథలుచెబుతూ పాపతోపాటే నిద్రపోయింది.

ప్రకాశం ఆలస్యంగావచ్చి కమలమ్మ అన్నంపెడతానంటే వద్దని పడుకున్నాడు.

"ఆవిడ పొద్దుట తినలేదు. నువ్వీపూట. బాగానేవుంది వరస' కమలమ్మ విసుక్కుంది.

తర్వాత నాలుగైదు రోజులు ప్రకాశం అరుణా మాటలు లేకుండనే గడిపారు.

అరుణ ఒంటిగంటకు వచ్చి పాపతో ఆడుతూ కూచునేది. ప్రకాశం సాయంత్రంవొచ్చి కాసేపు పాపతో కబుర్లుచెప్పి బజారుకివెళ్ళి ఏ తొమ్మిదింటికోవచ్చి భోంచేసి పడుకునేవాడు.

వీళ్ళిద్దర్నీచూసి కమలమ్మ బాధపడుతూ కూచునేది.

ఆవిడ ప్రకాశంతో మాట్లాడబోతే అతను విసుక్కునేవాడు. అరుణ కమలమ్మ ఏంచెప్పినా మాట్లాడకుండా వినేది.

ఆరోరోజు సాయంత్రం అరుణ వికసించిన ముఖంతో ఇంటికివచ్చింది.

"అత్తయ్యా- మేం గెలిచాం. ఇకనుంచీ పూర్తిజీతం ఇచ్చేస్తారు" పాపను ఎత్తుకుని ముద్దుపెట్టుకుంటూ చెప్పింది.

"పోనీలే— ఇన్నాళ్ళూ కష్టపడినందుకు ఫలితం దక్కింది. కాలేజీ ఇక తెరుస్తారా?"

"ఆఁ రేపటినుంచీ కాలేజీ మామూలుగానే ఉంటుంది. ప్రకాశానికి కోపంవచ్చిందిగానీ మేం ఇంత పట్టుదలగా చెయ్యకపోతే కమిటీ వాళ్ళు ఒప్పుకునేవారుకాదు!"

"ఈమాట వింటే వాడి కోపమూ తగ్గిపోతుందిలేమ్మా. వాడు ఆవేశంలో అరుస్తాడు గానీ తర్వాత బాధపడతాడు."

అరుణకు చాలా సంతోషంగా అనిపించింది. కష్టపడి సాధించుకున్న విజయం ఎంత ఉత్సాహాన్నిస్తుందో అర్థమైంది.

ఇదంతా ప్రకాశంతో చెప్పాలి. అతనికి అర్థమయ్యేలా తన ఆలోచనలన్నీ వివరించాలి అనుకుంటూ ప్రకాశం రాకకోసం ఎదురుచూస్తూ కూచుంది.

అయిదుగంటలకు ప్రకాశం వస్తూనే— "మీ సమ్మె సక్సెసయిందటగా" అనడిగాడు.

అతనంత అతనే అడిగేసరికి అరుణకు కాస్త సంకోచమేదన్నా ఉంటే అదంతాపోయి ఉత్సాహంగా వివరాలన్నీ చెప్పింది.

"చూశావా! నేనిందులో యాక్టివ్‌గా ఉన్నానని నీకు కోపంవచ్చింది. ఇప్పుడుచూడు మేం ఎంతచక్కగా సాధించుకున్నామో"

ప్రకాశానికి తన ఆలోచనలన్నీ వివరించాలని అరుణ ఆరాటం.

"నువ్వు లేకపోతేమాత్రం ఇదంతా జరగదా?"

"నేను లేకపోతే ఇదంతా జరగదనికాదు. జరుగుతుంది. కానీ జరిగే విషయంలో నేను కూడా ఉన్నానన్నసంగతి నాకెంత తృప్తినీ, గర్వాన్నీ ఉత్సాహాన్నీ ఇస్తుందో గమనించవేం"

"ఏమో. అందరి దృష్టీ నువ్వాకర్షించటం, పేపర్లో ఫొటోపడి అందరూ నీగురించి మాట్లాడుకోవటం — ఇదంతా నాకెలాగో ఉంటోంది."

"పేపర్లో ఫొటో నేను కావాలని వేయించుకున్నట్లు మాట్లాడతావెందుకు? దాన్ని మామూలువిషయంగా చూడలేకపోతున్నావెందుకు?"

"ఇంక ఆ చర్చలెందుకులే అపేసెయ్. పాడుగొడవ వదిలిపోయింది. పద, ఏదన్నా సినిమాకు పోదాం"

"ఇప్పుడా? పనేమీ కాలేదు"

"అమ్మ చూస్తుందిలే. లే - నువ్వు తయారవ్వు"

"అత్తయ్య ఒక్కదానిమీద పనంతావదిలి మనం సినిమాకెళ్లటం ఏంబాగుంటుంది?"

"మహరాజుగా ఉంటుంది. కొడుకూ కోడలూ రాజీపడ్డారని సంతోషిస్తుంది. కావాలంటే అడుగుతానుండు. అమ్మా" అని పిలిచాడు ప్రకాశం.

కమలమ్మ వచ్చింది.

"అరుణా, నేనూ సినిమాకి వెళ్తాం. వెళ్ల మంటావా?" అడిగాడు.

"బాగుందిరా. నే వద్దంటే మానేస్తారా?" నవ్వింది కమలమ్మ.

"నీకిబ్బందయితే మానేస్తాం"

"నాకేం ఇబ్బందిలేదు. వెళ్లండి. పాపా, నేనూ గుడికి వెళ్తాం."

"మనం వెళ్లటం చూస్తే పాప ఊరుకోదు. దాన్నికూడా తీసికెళదాం" అంది అరుణ.

"సరేలే— అది సినిమా చూడనిస్తుందీ" అన్నాడు ప్రకాశం.

"ఒద్దమ్మా - మిమ్మల్ని చూడనివ్వదు. తనూ చికాకుపడుతుంది. నే పక్కింటికి తీసికెళ్తా- మీరు వెళ్లండి. కాసేపు అడిగి అదే ఊరుకుంటుంది." అని కమలమ్మ పాపను తీసుకొని పక్కింటికి వెళ్ళింది.

అరుణ గబగబా తయారైవచ్చింది. ప్రకాశం ఆటోతెచ్చాడు.

"మన సరదాకోసమైతే అత్తయ్యచేత సేవలు చేయించుకోవచ్చుగానీ నా పనులకోసం చేయించుకోగూడదేం" అరుణ ఎత్తిపొడుపుగా అంది.

"మన ఆనందంకోసం, మనిద్దరం ఆనందంగా గడపటం కోసం నేనేమైనా చేస్తానేయ్"

"అందరి కోసం కూడా యేదన్నా చెయ్యాలి గదా?"

"నాచేతగాదు. నే చెయ్యలేను. నా బదులు కూడా నువ్వే చెయ్యి"

"నేచేస్తే నీక్కోపం వస్తుందిగా"

"ఇక రాదులే" అరుణ భుజంమీద చెయ్యి వేసి ప్రేమగా నొక్కాడు ప్రకాశం.

★ ★ ★

కాలేజీ విషయాలూ, ప్రకాశం ప్రవర్తనా అంతా వివరంగా ఉమకి పెద్ద వుత్తరం రాసింది అరుణ. ఉమ వుత్తరం కోసం యెదురుచూసింది.

పెళ్ళయినా తాను స్వేచ్ఛ పోగొట్టుకోలేదని చెప్పటం అరుణ ఉద్దేశం.

ఉమ కూడా సంతోషంగా వుత్తరం రాసింది.

"ప్రియమైన అరుణా —

నీవుత్తరం చూసి చాలా సంతోషించాను. సంతోషం యెందుకంటే, యే అరమరికలూ లేకుండా నీ మనసులోనివన్నీ నాకు రాసినందుకు. నీ జీవితాన్నంతా నాకు పరిచయం చేసినందుకు.

స్నేహం అంటే అదేగదూ.

ఎప్పటికప్పుడు రిసెర్చి పనుల్లో రకరకాల ఇతర పనుల్లోపడి నేను నీకు నా గురించి రాయలేకపోతున్నాను. ఎప్పుడో వొకరోజు పెద్ద వుత్తరంరాసి నిన్ను ఆలోచనల్లో పడేస్తాలే - జాగ్రత్తగావుండు.

నీ పెళ్ళయి రెండు సంవత్సరాలవుతున్నా నువ్వింకా పూర్వపు అరుణలాగే వున్నావంటే నాకు ఆశ్చర్యంగానూ ఆనందంగానూ వుంది. నా అంచనాలు తారుమారైనాయనిపిస్తోంది.

పెళ్ళయితే సంసారం తర్వాతే మిగిలినవి యేమైనా అనుకునేదాన్ని.

నేనలా అనుకోటానికి లోకంనిండా బోలెడు ఆధారాలున్నాయి. అంతెందుకు — ఇప్పుడు నేనుండే గదిపక్కనే వో చక్కని సంసారం ఉదాహరణగావుంది.

ఆమె మాలతి బోటనీలో పి.హెచ్.డి చేసింది.

భర్త డాక్టరు.

ఈమె రోజూ యేంచేస్తుందో తెలుసా? వాళున్న యిల్లంతా అంగుళం అంగుళం మెరిసిపోయేలా చేస్తుంది.

'మీరు వుద్యోగం చెయ్యొచ్చుగదండీ' అంటే 'వుద్యోగం చేస్తే యిల్లెలాగండీ' అంటుంది.

వాళ్ళ డ్రాయింగ్ రూం ఫ్లోరింగుగానీ, కిచెన్ ఫ్లోరింగుగానీ చూడాలి. అద్దంలా వుంటుంది.

కిచెన్‌లో అలమరాలన్నీ లేత నీలంరంగు. అందులో డబ్బాలన్నిటికీ లేతనీలంరంగు.

ఆమె శక్తులన్నీ యింటిగచ్చుకీ, డబ్బాలు కడగటానికే పెట్టేస్తోంది. మీకు వుద్యోగం అవసరంలేకపోతే బీదపిల్లలకి చదువుచెప్పండి. ఏదో వొకపని చెయ్యండి అంటే వినదు.

నా గదిచూస్తే ఆవిడకెంతజాలో. ఎటుచూస్తే అటు పుస్తకాలూ కాగితాలూ, మాసిన బట్టలూ వీటితో నిండివుంటుందిగదా —

నా జీవితమంతా పాడైపోయిందనీ నేను వొంటరిగా దిగులుగా యే సుఖమూ లేకుండా యిలా రోజులు వెళ్ళబుచ్చుతున్నాననీ ఆవిడ వుద్దేశం.

మనుమలు యిలావున్నప్పుడు — నువ్వు నీకిష్టమైన పనులు చెయ్యటం, ప్రకాశానికి యిష్టంలేకపోయినా నీవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవటం, వీటన్నిటికీ - ముఖ్యం నీ స్పిరిట్‌కి నాకు చాలా ఆనందంగావుంది.

ప్రకాశం యీ చిన్న విషయాలకు యింత గొడవచేస్తాడనుకోలేదు. అది ఆశ్చర్యంగానూ ఆందోళనగానువుంది. నీ వుత్తరం యెన్ని కొత్త ఆలోచనలను రేపిందో చెప్పలేను. అవన్నీ మనం కలిసినపుడు మాట్లాడుకుందాం.

నా రిసెర్చి చివరిదశలోవుంది. ఇంకో ఆరు నెలల్లో పూర్తవుతుంది. తర్వాత యిక్కడే మా డిపార్ట్‌మెంట్‌లోనే వుద్యోగం దొరకవచ్చు.

దానిని గురించి నేనేం దిగులుపడటంలేదు. థీసీస్ పూర్తయ్యాక యింటికెళతాను. అప్పుడే నీ దగ్గరకు వస్తానని వేరేచెప్పాలా?

పాపకు 'అత్తా' అనటం వచ్చే వుంటుంది గానీ ఉమత్త గురించి చెప్పావా లేదా?

నీ,
ఉమ.




ఆ సంవత్సరం వేసవి శలవల్లో కమలమ్మ వూరువెళ్ళి వస్తానంది.

అరుణకు కూడా ఆవిడవూరు వెళ్ళి కొన్నాళ్ళుండి వస్తే బాగుంటుందనిపించింది. ఆవిడకిక్కడ యిల్లూ, గుడీ తప్ప మరోలోకంలేదు. అక్కడ వూళ్ళో ఆవిడకేదో వొకకాలక్షేపం వుంటుంది. నలుగురితో మాట్లాడే అవకాశం వుంటుంది. ఆవిడ యిన్నాళ్ళూ వోపికగా కొత్త చోట వుండటమే విశేషం. శలవల్లోనన్నా ఆవిడకు విశ్రాంతి కావాలి అనుకుని అరుణ ఆవిడ వెళ్తానంటే అభ్యంతరం పెట్టలేదు.

కమలమ్మ లేకపోవటంతో అరుణకు పాపతోటే ప్రపంచమయింది. అరుణ పనిచేసుకుంటున్నంతసేపూ పాప పక్కపక్కనే తిరుగుతూ తానూ పనిచేస్తుంటుంది.

అరుణ పెద్ద చీపురుతో యిల్లు వూడిస్తే పాప చిన్న చీపురుపట్టుకుంటుంది.

అరుణ పెద్దగిన్నెలు కడుగుతుంటే పాప లక్కపిడతలు కడుగుతుంది.

అరుణ కూర చేస్తుంటే చిన్న పళ్ళెం పట్టుకు తయారవుతుంది రుచులు చూడ్డానికి.

అరుణ పని ముగించటం ఆలస్యం "పుచ్చకాలు, పుచ్చకాలు— చూపిచ్చు" అంటూ యేదో బొమ్మలపుస్తకం పట్టుకొస్తుంది. పాపకు పుస్తకాలంటే యిష్టమైనందుకు అరుణకెంతనంతోషమో. రోజూ మధ్యాహ్నం పాపకు పుస్తకాలలో బొమ్మలు చూపిస్తూ పాటలు పాడుతూ కథలు చెబుతూ గడిపేస్తోంది.

కాలేజీకి వెళితే పాపకీ నాకూ కూడా ఈ ఆనందం వుండదు. అమ్మపక్కలో పడుకుని తీరికగా కబుర్లన్నీచెప్పి యెప్పుడో నిద్రపోవటం పిల్లలకు యిష్టంగానీ, పాపం వాళ్ళ కోరికతీరే అవకాశం యెప్పుడోగానిరాదు అనిపించింది. ముఖ్యంగా వుద్యోగాలు చేస్తున్న తల్లులున్న పిల్లలకు ఇది అసలే కుదరదు.

ఒకరోజు మధ్యాహ్నం అరుణ పాపకు పాట నేర్పుతోంది. "చిట్టి చిలకమ్మ"

"చిట్టిచిమలక్క"

"చిమలక్క కాదమ్మా చిలకమ్మ అను"

"చిమలక్క" అంది పాప స్పష్టంగా

"అబ్బ! అలాకాదు. ముందు చిలక అను"

"చిలక"

# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!



## పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు తల్లి మొట్టమొదటి ఎంపిక ఇదే–ఫారెక్స్®.

మేలుపర్చబడిన ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు. పెరుగుదలకు అవసరమైన ప్రొటీన్లు, సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదార్థాలు.

రక్త పుష్టికై తగినంత ఐరన్.

గట్టి ఎముకలు, పళ్ల కొరకు 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్.

పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి గల ఫారెక్స్‌ను కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చే అవసరం లేదు.
కేవలం నీళ్లలో
కలిపి ఇస్తే
చాలు

**ఫారెక్స్–శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

CLARION/B/GX/15/173

"ఆ— అది. ఇప్పుడు చిలకమ్మ అను"

"చిమలక్క" పాప చక్కగా స్పష్టంగా అంది.

"ఊఁ. సరేకానీ— చిట్టి చిమలక్క"

"చిట్టి చిలకమ్మ" అని పాప అనేసరికి అరుణకు నవ్వాగలేదు. "దొంగపిల్ల అన్నీ వచ్చినా రానట్టు చేస్తుంది" అంటూ గుండెల మీదకు తీసుకుని ముద్దుపెట్టుకుంది.

"అమ్మ కొట్టిందా"

"అమ్మ కొట్టింది."

"కొట్టింది. కాదు. కొట్టిందా? అమ్మ కొట్టిందా?"

"అమ్మ కొట్టింది"

"పెంకె పిల్లవెక్కడో - తోటకెల్లావా?"

"తోటకెల్లాను" పాప పాటంతా సమాధానాల రూపంలో పాడేసింది. అరుణెంత ప్రయత్నించినా ప్రశ్నలు వెయ్యకుండా, అరుణ ప్రశ్నలకు సమాధానాలే యిచ్చింది.

అరుణ కోపం వచ్చినట్లు నటించి మాట్లాడకుండా కళ్ళుమూసుకుని పడుకుంటే పాప అరుణను జోకొడుతూ "జో...రామా లాలీ మేగ చామాలాలీ" అని పాడినిద్రపుచ్చి తానూ నిద్ర పోయింది.

తలుపెవరో తడుతున్నట్లనిపించి అరుణకు మెలకువ వచ్చింది.

తలుపు తీస్తే యెదురుగా తన కొలీగ్ కేశవరావు.

ఆశ్చర్యపడుతూ లోపలకు ఆహ్వానించింది.

"మీ యింటికి వొద్దామని చాలాసార్లు అనుకున్నాను. కానీకుదరలేదండీ. యివాళ యిటు వైపు కొద్దిగా పనుండి వచ్చాను."

"పోనీలెండి. అలాగైనా వొచ్చారు. మంచినీళ్లు తాగుతారా?"

"ఇవ్వండి-"

అరుణ మంచినీళ్లుతెచ్చియిచ్చింది.

"శలవల్లో యేంచేస్తున్నారు.? మిమ్మల్ని వాల్యుయేషన్‌కి పిలవలేదా?"

"పిల్లారుగానీ వెళ్ళలేదండి. మా అత్తయ్య వూరెళ్ళారు. పాపను వొదిలి వెళ్ళటం కుదరదు."

"మీ పాప యేదండీ" గదంతా కలయజూశాడు.

"నిద్రపోతోంది. లేస్తుందిలెండి." అని అరుణ గదిలోకి వెళ్ళి చూసొచ్చింది.

"మీరేం చేస్తున్నారూ?" మళ్ళీ అడిగాడు కేశవరావు.

చెయ్యటానికేముందండీ- ఇంట్లోపని- పాపతో కాలక్షేపం. మంచి పుస్తకమేదన్నా దొరికితే చదువుతాను. అంతే! అంతకు మించి చేసేదేం లేదు."

"ఏం పుస్తకాలు చదివారూ ఈమధ్య"

"ఇబ్సన్ నాటకం డాల్స్‌హవుస్ చదివానండి. నాకు యింగ్లీషు పుస్తకాలు చదవటం అంతగా అలవాటు లేదు. ఈనాటకం చాలా గొప్పదని విని వోపిగ్గా కూచుని చదివాను. చాలా బాగుందండీ-"

"నేను చదవలేదులెండి" నవ్వాడు కేశవరావు.

"అయ్యో-తప్పకుండా చదవండి. నాదగ్గరుంది పుస్తకం యివ్వనా?"

"ఇవ్వండి." కొస్త యిబ్బంది పడుతూ అన్నాడు.

"మీకు పుస్తకాలు చదివే అలవాటుందా?" అతని యిబ్బందిని గమనించినట్టు అడిగింది అరుణ.

"ఉందిలెండి" అంటూ పుస్తకం తీసుకున్నాడు.

"ఇందులో నోరాపాత్ర అద్భుతంగా వుందండి. ఆఖరి సన్నివేశాలు యెలా చదువుతామంటే - మనం అందులో మునిగిపోతామండీ- నోరాచివరకు అంటుందీ- మీరు చదివాక మాట్లాడుకుందాంలెండి-" అని ఆపేసింది అరుణ.

అరుణ మాటలెప్పుడాపుతుందా అని చూస్తున్నాడేమో కేశవరావు వెంటనే అందుకున్నాడు.

"మీ దగ్గరకు వొకపనిమీద వచ్చానండీ." మళ్ళీ ఆగాడు సందేహిస్తున్నట్టు.

"ఏంపని?- చెప్పండి"

" మేం కొంతమంది మిత్రులంకలిసి ఒక చిన్న పత్రిక నడపాలనుకుంటున్నాం."

"ఏం పత్రికండీ"

"సాహిత్య పత్రిక కాదండి. సమాజంలో జరిగే అన్యాయాలగురించి రాసి ప్రచురించటం. అంటే వుదాహరణకు చిన్న పిల్లల్ని ఫాక్టరీల్లో పనికి పెట్టుకోగూడదు. కానీ సిటీలో చాలా ఫాక్టరీల్లో చిన్నపిల్లలు పనిచేస్తున్నారు. ఈవిషయం గురించి పూర్తిగా స్టడీ చేసి దాని మీద ఒకనెల పత్రికతీయటం. ఇలా నెలకొక విషయం తీసుకుని పరిశీలించి దానిని గురించి ఆనెల పత్రిక తీసుకురావటం. పత్రికంతా అవొక్క విషయాన్ని గురించే. దానిని గురించి యేవన్నా కవితలూ, కథలూ దొరికితే అవి కూడా వెయ్యొచ్చు. ఇట్లా సమాజంలో జరిగే అన్యాయాల్ని అందరిదృష్టికి తీసుకురావాలని మా వుద్దేశం."

"బాగానే వుంటుందండీ" అన్నదిగానీ అరుణకు అదెలా వుంటుందో దానివల్ల ప్రయోజనమేమిటో సరిగా అర్థంకాలేదు. "పత్రిక పేరేమిటండి"

"వెలుగు."

"పేరు చాలాబాగుంది."

"ఈపత్రికకు మీరు సహాయం చెయ్యాలండి" మొహమాటపడుతూ అడిగాడు కేశవరావు.

"నేనా- నేనేంచెయ్యాలి" ఆశ్చర్యపోయింది అరుణ.

"ప్రతినెలా 'వెలుగు' రెండువేలకాపీలు వేయించాలంటే దాదాపు రెండువేలు రూపాయలవుతుందండీ. పత్రికను చాలాచవగ్గా అమ్మాలి. అంటే ప్రతినెలా దాదాపు పెట్టుబడి మనమే పెట్టాలి. అందుకని నెలకు వందరూపాయలు యిచ్చేవాళ్లు యిరవైమంది వుంటే- సంవత్సరం పాటువాళ్లు నెలనెలా వందరూపాయలిస్తే సంవత్సరంలో పత్రికను నిలబెట్టుకోవచ్చని ఆలోచించామండి. ఆ యిరవైమందిలో మీరూఒకరుగా వుంటారేమోనని- అది అడగటానికే వచ్చాను" బరువు దించుకున్నట్లు కూర్చున్నాడు కేశవరావు.

అరుణ ఆలోచనలో పడింది. నెలకు వందరూపాయలంటె యెక్కువే- కాని సంవత్సరం పాటు నెలకు వందరూపాయలిస్తే ఒపత్రిక నిలబడుతుందే- మరీ తనివ్వలేనంత యెక్కువేం కాదు. తనకు ఐదువందలే జీతం వున్నపుడు అవే సరిపోలేదూ? కాస్త యిబ్బందయినా, వీళ్ళేదో మంచిపని చేస్తున్నారు గదా, దానికి సాయం చేస్తే? వృధాఖర్చులు యెన్ని చెయ్యటం లేదూ? ఇంతమంచిపనికి వెనకాడటమేమిటి?

"మీరు ఆలోచించుకోండి. నేను మళ్ళీ వస్తాను. అప్పుడు చెబుదురుగాని. వందయివ్వటం కష్టమనుకుంటే మీరెంత యివ్వగలిగితే అంతే యివ్వండి."

"ఇస్తాలెండి. ఆలోచించేదేముంది. మీరేదో మంచిపనిచేస్తున్నారు. ఓసంవత్సరం కాస్త యిబ్బందిపడితే మాత్రం ఏమవుతుంది?"

అరుణ లోపలికి వెళ్ళి వందరూపాయలు తీసుకొచ్చియిచ్చింది. కేశవరావు రశీదు యిచ్చి,

"జులై ఫస్టుకి మొదటిసంచిక వస్తుందండీ. రాగానే తెచ్చియిస్తాను" అన్నాడు.

"పత్రిక లేకుండా మా యింటికిరారా యేమిటి?

"అబ్బే- అదికాదండి. వూరికే రావటం యెందుకు?"

కేశవరావు యిబ్బందిని చూసి అరుణ నవ్వింది.

"ఆ పుస్తకం చదవగానే తెచ్చివ్వండి. మీరు యింకెవరికీ యివ్వకండి. ఆ పుస్తకం పోతే మీరే కొనివ్వాలి."

"అలాగే - నే చదవగానే తెచ్చిస్తా" కేశవరావు లేచాడు.

"ఉండండి. టీతాగివెళ్లురుగాని" అంటూ అరుణ వంటింట్లోకి వెళ్ళింది.

పాపనిద్రలేచి హాల్లోకి వచ్చికేశవరావుని 'నువ్వెవరు' అని అడుగుతున్నట్టు చూసింది.

కేశవరావు 'రాపాపా' అని పిలిస్తే గిర్రున వెనక్కు తిరిగి వంటింట్లోకి పరిగెత్తింది. అరుణ టీతీసుకొస్తుంటే అరుణ వెనకాలే తన

గ్లాసులో పాలు పోయించుకుని వచ్చి కేశవరావుకెదురుగా కుర్చీలో కూచుంది.

"మీ పాపపేరేమిటండి" అన్నాడు కేశవరావు.

"దాన్నే అడగండి" అంది అరుణ నవ్వుతూ

"నీపేరేంటమ్మా" అన్నాడు కేశవరావు

"నాకు పేరుపెత్తలా" అంది పాప

'ఆ'- అని ఆశ్చర్యపోయాడు కేశవరావు. అరుణ నవ్వింది.

"ఇంకా పేరు పెట్టలేదండి. వీళ్ళనాన్నా నేను. పేరు విషయంలో యేకాభిప్రాయానికి రాలేకపోతున్నాం. నేను 'చుక్క' అని గానీ 'మువ్వ' అనిగానీ పెడదామంటాను. ప్రకాశమేమో దివ్య అనో సౌందర్య అనో, ఐశ్వర్య అనో పెడదామంటాడు. నే చెప్పే పేర్లు ఆయనకు పిచ్చిపేర్లలా వుంటాయి. ఆయన చెప్పేపేర్లు ఆకాశంలో దేవతల పేర్లలా వుంటాయి. కానీ భూమ్మీద మనుషుల పేర్లలా వుండవు. పాపంటే ప్రకాశానికి ప్రాణం. నిజంగానే యీ పాప వొక్కతీ ఆకాశాన్నించి దిగి మా యింట్లోకి వచ్చిందనే అనుకుంటాడు"

అరుణనవ్వుతూ చెప్తుంటే కేశవరావు సరదాగా విన్నాడు. "నాక్కూడా మీరు చెప్పినపేర్లే బాగున్నాయండి. చక్కగా చుక్కలాగే వుంది మీ పాప". అంటూ లేచాడు.

సాయంత్రం పావకు స్నానం చేయించి పనిముగించుకొని ప్రకాశం కోసం చూస్తూ కూచుంది అరుణ.

"అమ్మా అబద్ధాలు వొచ్చింది" అంది పాప అరుణకు యెదురుగా నిలబడ్డ పక్కింటిఅమ్మాయిని చూపిస్తూ.

"అబద్ధాలేమిటి- అక్క పేరు శిరీషమ్మా" అంది అరుణ. "కాదాంటీ- పాప నన్ను అబద్ధాలనే పిలుస్తుంది. మీకు తెలీదా" అంది శిరీష పాపనెత్తుకుంటూ.

"ఎందుకంటా. ఇదప్పుడే నిక్‌నేమ్స్ కూడా పెడుతోందా?"

అరుణ ఆశ్చర్యపోయింది.

"ఒక రోజుమీరు కాలేజీనుంచి రాకముందే మీ అమ్మవొచ్చిందని చెప్పాను. పాపం యిల్లంతా వెతుక్కుంది. మామ్మగారు అక్క అబద్ధాలు చెప్పిందిలేమ్మా అన్నారు. ఇక అప్పట్నించీ నాపేరు అబద్ధాలని పెట్టింది" శిరీష పాపను ముద్దుపెట్టుకుంది.

అరుణ పాపతెలివికి ఆశ్చర్యపోతుంటే శిరీష పాపను తీసుకుని వెళ్ళింది.

ప్రకాశం రాగానే టీ యిచ్చి కేశవరావు గురించీ అతను నడపబోయే పత్రిక గురించీ తాను యిచ్చిన చందా గురించీ చెబుతుండగానే ప్రకాశం ముందు ఆశ్చర్యపోయి తర్వాత కోప్పడ్డాడు.

"నీకేమన్నా మతిపోయిందా? నెలకు వంద రూపాయలు చందానా? ఇది ఇల్లా ధర్మసత్రమా? నెలకు వంద రూపాయలంటే ఎంతనుకున్నావ్?"

" నెలకు వంద రూపాయలంటే ఎంతేమిటి? నెలకు వంద రూపాయలే" అరుణ చిరాగ్గా అంది.

"అదే - సంవత్సరానికెంతా అని"

"పన్నెండు వందలు"

"సిటీలో మంచి సెంటర్లో రెండుగజాల స్థలం వస్తుంది తెలుసా?"

"రెండు గజాల స్థలం కొంటావా?" చిత్రంగా చూసింది అరుణ.

"రెండు గజాలు సరిపోతే నువ్విలా ఎన్ని దానధర్మాలుచేసినా ఫరవాలేదు. కనీసం రెండువందలగజాలు కొనాలి" అరుణ అజ్ఞానానికి జాలిపడుతున్నట్టు అన్నాడు ప్రకాశం.

"ఈ పన్నెండు వందలతోనే మొదలెట్టాలా మన పొదుపు? అసలు నాకు ఐదువందల జీతమే వస్తున్నట్టయితే ఏం చేసేవాళ్ళం"

"బాగుంది. నీకసలు ఉద్యోగమే లేకపోతే ఏం చేసేవాళ్ళం? నాకు నెలకు రెండువేలుకాక ఐదువందలే జీతమైతే ఏం చేసేవాళ్ళం? ఇప్పుడున్నదాన్ని గురించి ఆలోచిస్తారా? ఎప్పటెప్పటి విషయాలో ఆలోచిస్తారా?"

"అయితే ఏంటి నువ్వనేది? నేను సంపాదిస్తున్న డబ్బులోంచి నెలకోవంద నా ఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టుకుంటాను. కుదర



దంటావా?'' తాడో పేడో తేల్చుమన్నట్టు తీవ్రంగా అంది అరుణ.

అరుణ తీవ్రతచూసి ప్రకాశం తగ్గాడు.

"నువ్వు మాట్లాడితే నా ఇష్టం నా డబ్బు నా ఖర్చు అంటావెందుకు? నేనెప్పుడన్నా అలా అన్నానా?''

"నువ్వనలేదు. నిజమే-కానీ నీ డబ్బునీ నీ ఖర్చునీ కంట్రోలు చెయ్యటానికి నేనెప్పుడూ ప్రయత్నించలేదు.''

అరుణ అసలు విషయం అదీ అన్నట్టు చూసింది.

"నిజమే. నువ్వు నన్ను డబ్బులెక్కలు ఎప్పుడూ అడగలేదు. ఆ అవసరం రాలేదు. ఎందుకో ఒక్కసారి ఆలోచించుకో! నేను అనవసరమైన ఖర్చులేవీ చెయ్యను. దుబారా చెయ్యను. కనీసం సిగరెట్లు తాగను. నాకే సిగరెట్లూ, తాగుడూ, పేకాటా ఇవన్నీ అలవాటుంటే అప్పుడు నీకు కంట్రోలు చెయ్యాల్సిన అవసరం వచ్చేది. ఇప్పుడేమని కంట్రోలు చేస్తావు?'' చాలా ఆత్మవిశ్వాసంతో మాట్లాడాడు ప్రకాశం.

"అంటే తాగుడూ పేకాటా ఎలాంటిదో నేనిచ్చిన చందా కూడా అలాంటిదేనా? ఆచందా దేనికో తెలుసా? విన్నావా నే చెప్పింది'' అరుణ గొంతు పెరగటంతో ప్రకాశం నిరసనగాచూసి ఊరుకున్నాడు.

"ఏంటి మాట్లాడవేం? చందా దేనికోసమో తెలుసా?'' అరుణ రెట్టించి అడిగింది.

"తెలుసులే! సమాజాన్నంతా ఉద్ధరించటానికి అసలా పత్రిక వస్తుందో లేదో ఎవడికి తెలుసు. చందాలు వసూలుచేసి అంతావాళ్ళు తింటే ఏంచేస్తావు?''

"నువ్వు పిచ్చిగా మాట్లాడి నాకు కోపం తెప్పించకు ప్రకాశం. ఆయన మా కొలీగ్. చాలా మంచి మనిషి. మన వందరూపాయల కోసం ఆయన్ని మోసగాడనకు'' అరుణ కోపాన్ని అణుచుకోవటానికి ప్రయత్నిస్తోంది.

"ఏమయినా నెలనెలా వంద రూపాయలు చందాగా ఇవ్వటం నాకుఇష్టంలేదు. కావాలంటే పదో పదిహేనో ఇవ్వు'' చర్చ ముగిస్తున్నట్టు చెప్పాడు ప్రకాశం.

"నీకిష్టంలేదు అన్న ఒక్కమాటతో అంతా అయిపోతుందనుకున్నావా? నా ఇష్టం సంగతేమిటి? నా మాట సంగతేమిటి? మా వారికి ఇష్టంలేదండీ అందుకని నేనివ్వనని వాళ్ళతో చెప్పనా? ఎందుకు చెప్పాలనలు? నేనేం నీ డబ్బు ఇమ్మనటంలేదే-ఇన్ని రోజుల్నించీ నాజీతం అంతా నువ్వే మానేజి చేస్తున్నావు. నేను నిన్నేమైనా అడిగానా? నువ్వు దుబారా చెయ్యవు. నిజమే కానీ అసలు నీ ఖర్చేమిటో మన జీతాల్లో ఎంత మిగులుతోందో దాన్ని ఏం చేస్తున్నావో నేను అడిగానా? నువ్వు నెలనెలా డబ్బుకట్టే పద్ధతిమీద నాకు టీ.వి. ఇష్టంలేదని తెలిసీ తెచ్చావు. నువ్వు టీ.వి. ఎందుకు తెచ్చావని నేనడిగానా? డబ్బు కట్టొద్దన్నానా? టీ.వి. ఇచ్చేసి రమ్మన్నానా? ఛీ-ఏంటిది! ఒక్క వంద రూపాయలు నా ఇష్టంవచ్చినట్లు ఖర్చుచేస్తే అది పెద్ద నేరమైనట్లు ఈ చర్చేమిటీ? ఈ విచారణ ఏమిటి? నేనేం చిన్నపిల్లనా? దేనికెంత ఖర్చు పెట్టాలో నాకు తెలియదా?"

అరుణకు ఆవేశంతో మాటలురాక ఆగింది.

"నువ్వు చిన్న పిల్లవేకాదు పిచ్చి పిల్లవు కూడా. నీకు తొందరా ఆవేశంతప్ప ఏమీ తెలియదు. తెలిస్తే మనింట్లో మనం కొనుక్కున్న టీ.వి.కి అయ్యేడబ్బూ- ఎవరికో చందా ఇచ్చిన డబ్బూ ఒకటన్నట్లు మాట్లాడవు."

"ఒకటికాదు. నాకు అన్నీ తెలుసు. నేనిచ్చే చందావల్ల లాభం రూపాయల్లో కనపడదు. కానీ ఒక మంచిపని చేస్తే వచ్చే తృప్తి ఎన్ని డబ్బులు వెనకేస్తే వస్తుంది?"

"నువ్వు చాలా తెలివిగలదానివి. నీతో నేను మాట్లాడలేను. నీ డబ్బు నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో-మీవాళ్ళు నిన్నంత కట్టడిలో ఎందుకు పెంచారో ఇప్పుడు తెలుస్తోంది-" ప్రకాశం కుర్చీలోంచి లేవబోయాడు.

"ఏమిటి? ఏమిటి నువ్వన్నది?" అరుణ పెద్దగా అరుస్తున్నట్లే అడిగింది.

"ఏమన్నాను? ఏంటా అరుపు" విసుక్కున్నాడు ప్రకాశం.

"నువ్విందాక అన్నమాటేమిటి? మా వాళ్ళు నన్ను కట్టడిగా ఎందుకు పెంచారో తెలిసిందా? ఎందుకు పెంచారు?"

"నీ అతితెలివిచూసి భయపడి" వెటకారంగా అన్నాడు ప్రకాశం.

"నాతెలివిచూసి వాళ్ళు భయపడ్డారు. నువ్వు ఇష్టపడ్డావు. వాళ్ళు కట్టడిచేసి నన్ను దూరంచేశారు. నువ్వు కట్టడిచేసి నన్నేం చెయ్యాలనుకుంటున్నావు?"

"నేనేం చేస్తాను? చెయ్యగల సమర్థత నాకేది? నీ విషయాల్లో జోక్యం కలగజేసుకుని చెంపదెబ్బలు తినటంతప్ప నిన్ను నేనేం చెయ్యగలను? నీ ఇష్టంనీది. నేనెవర్ని నా లెక్కేమిటి నీకు?" గబగబా బట్టలు వేసుకున్నాడు.

శిరీష పాపను ఇంట్లోకి తెస్తుంటే పాపనెత్తుకుని బజారుకి వెళ్ళిపోయాడు.

అరుణ కోపంతో బాధతో అట్లాగే కూచుంది.

'మీవాళ్ళు నిన్నంత కట్టడిగా ఎందుకు పెంచారో నాకిప్పుడు తెలిసింది' అన్న ప్రకాశం మాటలు అరుణ మనసుని కందిరీగల్లా కుట్టాయి.

తాను చిన్నతనం నుంచీ ఏ కట్టడి భరించలేక పోయిందో...

దేనిని అసహ్యించుకుందో...

ఏ కట్టడిని ప్రకాశం సాయంతో దాటాలనుకుందో...

దాటాననుకుందో...

ఆ కట్టడి తనకు అవసరమంటున్నాడు ప్రకాశం!

చిన్నప్పుడేకాదు జీవితాంతం తనకా కట్టడి అవసరమేనని ప్రకాశం ఉద్దేశం.

తను కదిలితే, మెదిలితే, నోరువిప్పితే, నవ్వితే తనమీద ఆంక్షలు పెట్టారు అత్తా, నాన్నా అన్నా.

తన కోరికలనూ ఆసక్తులనూ కాలికింద నొక్కిపెట్టారు.

తన ఆలోచనలను పైకి రానివ్వకుండా అణచాలని చూశారు.

వాళ్ళు హింసించారనుకున్నది తను.

అది హింస కాదంటున్నాడు ప్రకాశం.

తన అతితెలివితోనో తెలివితక్కువతనంతోనో, ఏ పిచ్చి పనులో చేస్తాననీ మంచేదో, చెడేదో తెలుసుకోలేక కొంపమీదకి ఏం తెస్తానో

నని వాళ్ళు భయపడి తనను జాగ్రత్తగా పెంచారు నిజమే.

వాళ్ళలాగే నమ్మి ఉంటారు. ప్రకాశమే అలా అనుకుంటుంటే వాళ్ళనుకోవటంలో వింతేముంది?

తన తెలివి గురించి ప్రకాశానికన్నా ఘనమైన అభిప్రాయం నాన్నకో అన్నయ్యకో ఉండే అవకాశంఏది?

వాళ్ళను కనీసం అర్థం చేసుకోవచ్చు.

ప్రకాశాన్నెలా అర్థం చేసుకోవాలి?

ప్రకాశం తనలోని స్వేచ్ఛాకాంక్షను గుర్తించలేదా?

దానిని ప్రేమించలేదా?

లేదు.

ప్రకాశం ఎప్పుడో చెప్పాడు. తన అందాన్నీ తెలివినీచూసి ప్రేమించానని!

తనే తెలివితక్కువది తనకు జీవితంలో కావల్సింది స్వేచ్ఛ అని తెలిసికూడా ఆ విషయం తేల్చుకోకుండానే ప్రకాశం తన స్వేచ్ఛను గౌరవిస్తాడని నమ్మి అతన్ని ప్రేమించింది.

ప్రకాశం తన అందాన్ని మాత్రమే ప్రేమించాడు.

తెలివి అని అంటున్నాడుగాని తనది తెలివికాదని అతనికిప్పుడు తెలిసిపోయింది.

కేవలం ఈ శరీరాన్ని ప్రేమించాడు.

వొట్టి మాంసాన్ని!

అబ్బా-ఎంత భయంకరం.

వెక్కి వెక్కి ఏడ్చింది అరుణ.

ఎంత అసహ్యం!

ఎంత అవమానం!

ఈ శరీరంతప్ప ప్రకాశానికి నాలో నచ్చేదేమీ లేదు.

తను చిన్నతనంనుంచీ స్వేచ్ఛకావాలని పడిన ఆరాటానికీ తానుచేసిన పోరాటానికీ ప్రకాశం దృష్టిలో అర్థమేలేదు.

'నేనిది భరించలేను.'

పిచ్చెక్కినట్లు ఆమాటే అనుకుంటూ ఏడుస్తోంది అరుణ.

ఎంతసేపలా గడిచిందో తెలియదు. ప్రకాశం నిద్రపోతున్న పాపను భుజాన వేసుకొస్తుంటే లేచి పాపను అందుకుందామనుకుందే గాని లేవలేకపోయింది.

ప్రకాశం పాపను లోపల పడుకోబెట్టి బట్టలు మార్చుకొని తలుపులన్నీ వేసివచ్చినా అరుణ అలాగే కూచుని ఉంది.

శూన్యంలోకి పిచ్చి చూపులుచూస్తూ కూచున్న అరుణనుచూసి ప్రకాశం భయపడ్డాడు.

"అరుణా - లే - లేచి పడుకో" అంటూ అరుణను చెయ్యిపట్టుకుని లేపాడు. అరుణ గబుక్కున తెలివొచ్చినదానిలా ప్రకాశం చేతిని విడిపించుకుని గదిలోకివెళ్ళి పడుకుంది. ప్రకాశం వెళ్ళి అరుణపక్కనే కూచున్నాడు.

"అన్నం తిన్నావా?"

అరుణ లేదన్నట్టు తల అడ్డంగా వూపింది.

"మరి లే, తిను"

మళ్ళీ తలవూపింది ఒద్దన్నట్లుగా.

"నామీద కోపం వచ్చిందా?"

అరుణేమీ మాట్లాడలేదు.

"బైటికి వెళ్ళాక ఆలోచిస్తే నేను తొందరపడ్డాననిపించింది. నువ్వుకూడా నన్ను రెచ్చగొడతావు. వెధవ వందరూపాయలకోసం ఇంత వాదన దేనికి పెంచుకున్నామా అనిపించింది. నా మూడ్ బాగోలేనప్పుడు చెప్పినట్లున్నావు. నా మూడ్ గమనించి మాట్లాడటం నీకిన్నేళ్లయినా తెలియలేదు. నువ్వంటే నాకెంత ప్రాణమో నీకు తెలియదా. నువ్వు మంచిగా సంతోషంగా నాకీపని చెయ్యాలనిఉందని చెబితే నే కాదంటానా? చెప్పుకునే పద్ధతి నీకు తెలియాలి. అది తెలుసుకోకుండా లేనిపోని వాదాలు చేస్తావు. ఇకనుంచీ నేనైనా వాదన పెంచనులే."

అరుణ మెడకింద ముద్దుపెట్టుకుంటూ "ఇట్లా ముద్దులుపెడుతూ వందకాదు వెయ్యి ఖర్చుచెయ్యి. నేనొద్దంటానా?" అని అరుణ చుట్టూ చేతులు వెయ్యబోయాడు.

"ప్రకాశం, నాకు ఏడ్చేఓపికకూడా లేదు. నువ్వు మాట్లాడకుండా పడుకో. మాట్లాడి నన్నింకా ఏడిపించకు."

"నువ్వింతే అరుణా. చిన్నవిషయాన్నికూడా రోజులతరబడి సాగదీస్తావు. నాదే తప్పని ఒప్పుకున్నానుగా. ఇంకేమిటి?"

"నీదే తప్పని ఒప్పుకున్నావా? ఎప్పుడు?"

"ఇప్పుడేగా, నే మాట్లాడినదంతా ఏంటి మరి?"

"అది తప్పు ఒప్పుకోవటమా? సరే. మంచిది. నీ తప్పేంలేదులే. పడుకో. నాకు తలనొప్పిగాఉంది"

అరుణ వ్యంగ్యంగా మాట్లాడేసరికి ప్రకాశం లేచి తన పక్కమీదికెళ్ళి పడుకున్నాడు.

"పాప భోజనం చెయ్యలేదుగా?" అడిగింది అరుణ.

"చేసింది. పాపా నేనూ ఇద్దరం చేశాం."

"ఎక్కడా?"

"మా ఫ్రెండు నిరంజనరావు ఇంట్లో."

అరుణ మాట్లాడకుండా కళ్ళుమూసుకుని పడుకుంది.

తల పగిలిపోయేంత నొప్పి. నిద్రపట్టే సూచనలేం కనిపించటంలేదు.

ప్రకాశం తప్పు ఒప్పుకుంటున్నానని చెప్పిన మాటల్ని గుర్తుతెచ్చుకుంటోంది అరుణ మెదడు.

దానివల్ల బాధ పెరగటమేతప్ప తరగదని వివేకం హెచ్చరిస్తున్నా మెదడులో ఆ మాటలే తిరుగుతున్నాయి.

'తనకేం కావాల్సినా అతని మూడ్ గమనించి అడగాలి. అతన్ని సంతోషపెడుతూ అడగాలి. అతన్ని ముద్దుపెట్టుకుంటూ అడగాలి. అప్పుడతను వరం ప్రసాదిస్తాడు. తన స్థితేమిటి? అరుణకు అసహ్యంతో వొళ్ళు జలదరించింది. ఎందుకిలా మాట్లాడుతున్నాడు ప్రకాశం?

ప్రకాశం ఇంతేనా?

సమయం వచ్చినపుడు బైటపడ్డాడా?

ఈ పరిస్థితులు ఇంతకుముందు రాలేదుగనక ప్రకాశం ఇలా ఆలోచిస్తాడని తనకు తెలియలేదు.

ప్రకాశం ఇంతే.

అతనిష్టప్రకారం తను నడవాలనుకుంటాడు.

పెళ్ళికి ముందు ఉమ ఈ విషయం హెచ్చరించలేదూ? మీ నాన్నా అన్నా అత్తా అందరి పాత్రలూ ప్రకాశమే నిర్వహిస్తాడేమో అంది.

ఎంత కరెక్టుగా చెప్పింది.

"ప్రకాశం తన పరిధిలో నిన్నుంచుకోవాలని చూస్తే?!" ఎంత దూరంఆలోచించింది ఉమ!

మరి అది తనకెందుకు తోచలేదు?

ప్రకాశం తనను ప్రేమిస్తున్నాడని నమ్మింది.

ప్రకాశం తనను ప్రేమించటంలేదూ?

ప్రేమిస్తున్నాడు.

ప్రకాశానికి తనంటే ప్రేమే.

అరుణ తనకుతాను నచ్చజెప్పుకుంటున్నట్టు అనుకుంది.

'తాను ఎక్కువగా ఆలోచిస్తోంది. నిజంగానే వాదన పెంచకుండా మంచిగా చెప్పాల్సిందేమో. ప్రకాశానికి ఎలా చెబితే ఇష్టమో గ్రహించి అలాగేచెబితే ఏమవుతుంది?

అసలు ప్రకాశానికి ఇష్టంలేనిపనులు మానేస్తే "

అప్పటిదాకా అరుణ మాటలు వింటున్నట్టున్న మనసు ఒక్కసారిగా ఎదురుతిరిగింది. ఆ తిరుగుబాటుని అరుణ అతి ప్రయత్నంమీద అణిచివేసింది.

ఔను—ఇకనుంచీ ఏపని చేసినా ముందు ప్రకాశంతో మాట్లాడి అతన్ని వొప్పించే చేస్తాను. నేను తనతో చెప్పకుండా చేస్తున్నానని ప్రకాశానికి కోపం. ఆ కోపంలో ఏవేవో మాట్లాడతాడు. నేనూ రెచ్చిపోతాను. లేనిపోని గొడవలు, బాధ. ఇక ఇట్లా ఉండకూడదు.'

ఈ ఆలోచనల్ని మందులాగా అరుణ తన మనసుకి అయిన గాయంమీద పూసింది. లోపలెక్కడినుంచో వినవస్తున్న అశాంతి కేకలను వినకుండా ఆలోచనల్ని పెంచుకుంటూ నెమ్మదిగా నిద్రపోవటానికి ప్రయత్నించింది.

ప్రకాశంకూడా అటూఇటూ కదలటంచూసి మళ్ళీ అతనెక్కడ మాట్లాడిస్తాడోనని గట్టిగా కళ్ళు మూసుకుంది.

మర్నాడు ఉదయాన్నే ఎవరో తలుపుకొట్టిన

ట్లనిపించి లేచింది అరుణ. కళ్ళు మసక వడ్డట్టుగా మండుతున్నాయి. గొంతంతా ఎండి పోయిందేమో గుటక వెయ్యటంకూడా కష్టమని పించింది. మంచంమీదనుంచి లేవగానే కళ్ళు తిరిగినట్లయి మళ్ళీ మంచంమీద కూచుండిపోయింది. మళ్ళీ తలుపు మోగింది. నెమ్మదిగా ఓపిక తెచ్చుకుని తలుపుతీస్తే ఎదు రుగా కమలమ్మ.

"అదేంటత్తయ్యా. ఉత్తరంరాస్తే బస్సుదగ్గ రకు వచ్చేవాళ్లంగా"

"అప్పటికప్పుడు పాపను చూడాలనిపించి బయల్దేరానమ్మా. ఆటోఅబ్బాయి జాగ్రత్తగానే తెచ్చాడు." సూట్‌కేసూ, బుట్టలూ లోపల పె ట్టింది కమలమ్మ.

"నువ్వేమిటి అలాఉన్నావు? కళ్ళు జ్యోతు ల్లా"

"కాస్త తలనొప్పిగాఉండి రాత్రి నిద్రపట్టలే దు. అంతకుమించి ఏంలేదు." కమలమ్మ చూపుల్ని తప్పించుకొని వంటగదిలోకి వెళ్ళి ంది.

ప్రకాశం లేచి అమ్మనుచూసి ఆశ్చర్యపోయా డు. సంతోషించాడుకూడా. అరుణ తొందరగా మళ్ళీ మామూలవుతుందని ఆశపడ్డాడు.

"అన్నయ్యా పిల్లలూ ఎలాఉన్నారమ్మా? అక్కయ్యలెవరైనా వచ్చారా?" అని తల్లిని పరామర్శించాడు.

"అందరూ బాగానేఉన్నారా. సుగుణా దాని పిల్లలూ వచ్చి నాలుగురోజులుండి వెళ్ళారు."

"అన్నయ్యనీ వదిన్నీకూడా తీసుకురాకూడ దూ?"

"వాళ్ళేం చిన్నపిల్లలా? దారితెలియనివా ళ్ళా నేను తీసుకురావటానికి. రావాలనుంటే వాళ్ళే వస్తారు" కమలమ్మ విసురుగా అంది.

పాప నిద్రలేచి "కమలమ్మా" అంటూ ఒళ్లో కెక్కింది.

"దీని పొగరు చూడరా. నాయనమ్మ అనటం మోటయిపోయింది కమలమ్మంట" అని పాపను ముద్దుపెట్టుకుంటుంటే అరుణ టీ తెచ్చిఇచ్చింది.

"అత్తయ్యా మీరెళ్ళాక దీని అల్లరి ఎక్కు వైపోయింది. మాట వినటంలేదు." అంటూ అరుణ పాపకబుర్లు చెబుతుంటే ప్రకాశం ఒక చెవితో ఆ కబుర్లు వింటున్నాడు. ఇంకోపక్క పేపర్లో తలదూర్చి అరుణతో మాట్లాడటం ఎట్లాగా, అరుణను మామూలుగాచేసి ఆ వందరూపాయల చందా మాన్పించటం ఎట్లా గా అని ఆలోచిస్తున్నాడు.

అరుణ ఉప్మాచేస్తుంటే కమలమ్మ ఊరు నుంచి తెచ్చిన సీసాలూ డబ్బాలూ అలమర లలో సర్దుతోంది.

"లీలక్కయ్య ఏమంటోందత్తయ్యా" అరుణ ఏదోఒకటి అడగాలన్నట్టు అడిగింది.

"ఏమైనా అంటుందమ్మా. అధికారం తన దైనపుడు ఎవరైనా ఏమైనా అంటారు."

అరుణ ఆశ్చర్యపోయింది.

కమలమ్మ ఇంత నిష్ఠూరంగా మాట్లాడటం అరుణ ఎప్పుడూ వినలేదు. ఊళ్ళో ఏదో గొడవ జరగబట్టే కమలమ్మ ఇంత తొందరగా వచ్చిందనీ, ఈ నిష్ఠూరపు మాటలుకూడా అందుకేననీ అరుణ గ్రహించింది.

"ఏమయిందత్తయ్యా"

"చెప్పుకోటానికి ఏమీలేదు. నేను అక్కడ వాళ్లదగ్గర ఉండి వాళ్ళ విషయాల్లో జోక్యం కలగజేసుకోవటం లీలకు ఇష్టంలేదు. అదా అమ్మాయి నోటితో సూటిగా చెప్పిన తర్వాత ఇహ అక్కడ ఉండలేక వచ్చేశానమ్మా. మీ రుండనిచ్చినన్నాళ్ళూ ఇక్కడ! తర్వాత ఏ గదో అద్దెకు తీసుకుని ఇంత ఉడకేసుకుంటాను. ఆయుస్సు ఉన్నన్నాళ్ళూ బతకాలిగా"

జరిగిన గొడవకు కమలమ్మ మనస్సు ఎంత గట్టిపడిపోయిందో గాని ఆమె కళ్ళల్లో తడిలే దు. గొంతు కఠినంగా ఉంది.

ఆవిడను చూస్తే అరుణకే దిగులు ముంచుకొచ్చింది.

"అదేంమాట అత్తయ్యా. మేము ఉండని చ్చేదేమిటి? ఇది మీ ఇల్లు కాదూ?"

"మీ మామయ్యా నేనూ కలిసి ఇటికిటికా చూసుకుంటూ కట్టిన ఇల్లే నాది కాకుండా పోయింది. ఇక ఈ అద్దె ఇల్లు నాదెలా అవు తుంది?"

"మీరెందుకో కోపంగా ఉన్నారు. ఆ ఇల్లు

మీది కాకపోవటం ఏంటీ? మీ ఇష్టప్రకారం వాళ్ళుంటున్నారు గానీ మిమ్మల్నికాదని వాళ్లెలా ఉంటారు." అరుణ ఓదార్పుగా అంది.

"నీకు తెలియదమ్మా. ఆ ఇంటిమీద నాకే మీ హక్కులేదు. ఆ స్థలమూ ఇల్లూ అన్నీ మీ మామయ్యపేరుతో ఉన్నాయి. ఆస్తి పంపకాల్లో అవి పెద్దాడికి వచ్చాయి. నాకేంహక్కు లేదమ్మా. ఆ ఇంటికి నేను చేసిన చాకిరీ నాకు దక్కింది. ఇంటిని అద్దంలా ఉంచుకోవాలని ఒక్క క్షణం నడుం వాల్చకుండా చాకిరి చేసేదాన్ని. ఇవాళ బైటికి నడవమనగానే చెంగు దులుపుకు వచ్చేశాను. ఒకవేళ ఆ ఇల్లు నాదే అయినా నేను వాళ్ళను బైటికి పొమ్మనలేనుగా తల్లీ. కొడుకు సంసారాన్ని వీధినపడేసి ముసలమ్మ ఇల్లంతా ఏం జేసుకుంటుందని నలుగురూ నన్నే అంటారు."

"పోన్లే ఊరుకోండత్తయ్యా. మీరిక్కడే ఉందురుగాని. మీకు ఇక్కడ తోచదేమో, శెలవల్లోనన్నా ఊళ్ళో ఉంటే మీకు బావుంటుందని గాని—మీరు వెళ్ళటం నాకిష్టమే లేదు. మీరు లేకపోతే ఇల్లంతా ఎలాగో ఉంది. పాప రోజూ గొడవ, నాయనమ్మేది, ఎప్పుడొస్తుందని" కమలమ్మ మనసు బాగుచెయ్యాలని గబగబా మాట్లాడింది అరుణ.

"మీ పిల్లలు పెరిగి పెద్దయ్యేదాకా బాగానే ఉంటుందమ్మా. తర్వాత నా అవసరం ఉండదు. అప్పుడు మీకు నేను లేకపోతేనే బాగుంటుంది."

కమలమ్మ మనసుని అంత కఠినంగా చేసిన లీలను మనసులోనే తిట్టుకుంది అరుణ.

"అత్తయ్యా — పాపకోసమేనా మీరిక్కడ ఉంటున్నది? ప్రకాశం అన్నా నేనన్నా మీకిష్టంలేదా? మీరంటే మాకు ప్రేమ లేదా? మీరట్లా అనుకోకండి. మీరు మాలో ఒకరు. అంతే గానీ మా అవసరాలకోసం ఎక్కడినుంచో వచ్చిన పరాయిమనిషి కాదు మీరు."

కమలమ్మ మాట్లాడకుండా కూచుంది.

అరుణ మనసంతా కమలమ్మపట్ల కరుణతో ప్రేమతో నిండిపోయింది. ముసలితనం ఎంత దయనీయమో అరుణకు మొదటిసారి స్పష్టంగా తెలిసింది.

"ఎంతో మంచిగా మనుషులతో సర్దుకుపోయే ఈవిడని కొడుకూకోడలూ భరించలేకపోయారు. ఇక్కడ కూడా అట్లాంటి నిరాదరణే ఎదురైతే ఆవిడెక్కడికి పోతుంది?

కొడుకులు ఆర్థికంగా ఇబ్బందులు లేనివాళ్ళు గనక నెలనెలా డబ్బిస్తారేమో. వాళ్ళిచ్చే డబ్బుకోసం ఎదురుచూస్తూ ఆ డబ్బు వాళ్లెంత చిరాకుపడుతూ తిట్టుకుంటూ ఇస్తున్నారో ఊహిస్తూ, ప్రత్యక్షంగా చూస్తూ ఉండటం ఎంత నరకం జీవితంలో!

దానికితోడు ఒంటరితనం. ఎంత కష్టమో ముసలితనం.

అత్తయ్యకు ఏ కష్టమూ కలగకుండా చూసుకోవాలి. పాప పనులు చెయ్యటంకోసం, అవసరంకోసమే తనతో మంచిగా ఉంటున్నామన్న అభిప్రాయం ఆమెలో పోగొట్టాలి. ఆమె ఇక్కడ స్వేచ్ఛగా, ఇది నా ఇల్లు అనుకునేలా ఉండాలి. ప్రతి వయసులోనూ ఆడవాళ్ళ స్వేచ్ఛకు అవరోధాలే. జీవితాంతం బానిసత్వమే—"

అరుణ ఆలోచనల్లో మునిగిపోయింది.

ప్రకాశం "అమ్మా అన్నం పెడతావా" అని కేకేశాడు.

"ఏం మళ్ళీ మీరు కీచులాడుకున్నారా? నన్ను పెట్టమంటున్నాడు" ఇంట్లోకి వచ్చాక మొదటిసారి హాయిగా నవ్వింది కమలమ్మ.

"అమ్మ చేతి అన్నం తిని చాలా రోజులయిందిగా. తినాలనిపిస్తోందేమో. పెట్టండత్తయ్యా. నేను పాపకు నీళ్ళుపోస్తాను." అరుణ పాపను తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళింది.

ప్రకాశం అన్నం తింటూ కమలమ్మతో నవ్వుతూ చెబుతున్న కబుర్లూ అడుగుతున్న వివరాలూ అరుణ చెవిలో పడుతూనే ఉన్నాయి.

"ఏమీ జరగనట్లు మామూలుగా ఎట్లా మాట్లాడుతున్నాడో. అతని దృష్టిలో జరిగింది చిన్న వాదన. అంతే. కానీ నాకది నా వ్యక్తిత్వానికీ ఆత్మగౌరవానికీ సంబంధించిన విషయం. ఒక విషయం గురించి ఇద్దరి దృష్టిలో ఎంత తేడా. ఈ తేడా ఎలా పోతుంది. ఎలాగన్నా సరే పోవాలి. పోకపోతే తనకు శాంతి ఉండదు. తన

శాంతికోసం తానే ప్రయత్నించాలి.

పాపకు బట్టలువేసి తల దువ్వుతుంటే ప్రకాశం బూట్లు వేసుకుని 'అరుణా నే వెళ్తున్నా' అన్నాడు. అరుణ తలెత్తి చూసింది ప్రకాశంవైపు.

ప్రకాశం చిరునవ్వుతో ఇటే చూస్తున్నాడు. అప్రయత్నంగా అరుణ కూడా నవ్వింది.

ప్రకాశం వికసించిన ముఖంతో పాపను అరుణ దగ్గర్నించి తీసుకుని గాల్లోకి ఎగరేసి ముద్దాడి అరుణకిచ్చి వెళ్ళిపోయాడు.

అరుణకు ఏమీ తోచలేదు. స్నానంచేసి కమలమ్మతో మాట్లాడుతూ భోజనం చేసేసరికి నిద్ర ముంచుకొచ్చింది. పాప నాయనమ్మపక్క జేరి కొత్త కథలన్నీ చెబుతోంది.

అరుణ సాయంత్రందాకా ఒళ్ళుతెలియని నిద్ర పోయింది.




పదిరోజుల తర్వాత వొకరోజు సాయంత్రం కేశవరావు వస్తే మునుపటిలా ఫ్రీగా ఆహ్వానించలేక పోయింది అరుణ.

ప్రకాశానికీ తనకూ మధ్య నడిచిన గొడవ కేశవరావుకు తెలిసే అవకాశమే లేకపోయినా అదంతా కేశవరావుకి తెలిసినట్లే సిగ్గుపడిపోయి "రండి, రండి" అని మొహమాటంగా ఆహ్వానించింది.

కేశవరావు "డాల్స్‌హవుస్" పుస్తకం అరుణకు యిచ్చాడు.

ఆ పుస్తకం చూడగానే అరుణకు ప్రాణం లేచొచ్చినట్టయింది. కొత్త ఉత్సాహం వొచ్చినట్లనిపించింది.

"ఎలా వుందండీ?"

"బాగానే వుంది!" మామూలుగా అన్నాడు కేశవరావు.

"బాగా'నే' యేమిటండీ - చాలాబాగాలేదా" కేశవరావు నిర్లిప్తత అరుణకు ఆశ్చర్యమనిపించింది.

కేశవరావు నవ్వివూరుకున్నాడు.

ఇంత అద్భుతమైన నాటకం చదివి మౌనంగా వున్నాడేమిటని విస్తుపోతున్న అరుణకు వొక్కసారిగా ఏదో తట్టినట్లయి, తానూ మౌనంగా కూచుంది.

ఈ నాటకాన్ని యిష్టపడే అర్హత తనకుందా? అన్న ప్రశ్న హఠాత్తుగా అరుణమనసులో మెదిలింది. మనసులో గిల్టీగా అనిపించింది.

"మీవారులేరా? సాయంత్రం పూటయితే ఆయనకూడా కలుస్తారని వచ్చాను." అనడిగాడు కేశవరావు.

"ఉన్నారు. స్నానం చేస్తున్నారు. మంచినీళ్ళు కావాలా?"

"ఇవ్వండి"

అరుణ మంచినీళ్ళు తెచ్చి యిచ్చింది. పాప కేశవరావు వొళ్ళో కూచుని ఆయనజేబులో పెన్నునో, మొహానున్న కళ్ళజోడునో పీకుదామని చూస్తోంది.

అరుణ కూడా యెదురుగా కూచుని "మీ కళ్ళజోడుకి మాబాధ్యత లేదండి. మీరే రక్షించుకోండి" అంది.

ఇంతలో ప్రకాశం స్నానంచేసి వచ్చాడు. అరుణ పరిచయాలు చేసింది.

"అరుణగారు మంచి పుస్తకాలు చదువుతారండీ. మీరుకూడా-"

కేశవరావు మాట పూర్తి చెయ్యకుండానే "అరుణకున్నంత పిచ్చిలేదుగానీ నేనూ చదువుతానండీ. పెళ్ళికాకముందు బాగా చదివేవాడిని. పెళ్లయింతర్వాత ఏదీ యీమధ్య అసలేం చదివినట్లులేను. కదు అరుణా" అన్నాడు ప్రకాశం.

అరుణ నవ్వి వూరుకొంది. కేశవరావూ నవ్వాడు.

"మామూలుగా పెళ్లయితే ఆడవాళ్ళు



సంసారంలో పడిచదువు బంద్‌చేస్తారంటారు. మీకేను రివర్సులాగుంది. అరుణగారు చదువుతూనే వున్నారు. మీరు కుదరటం లేదంటున్నారు.''

''మాదంతా రివర్సేలెండి. మా అరుణకు యిల్లూ, బరువూ బాధ్యతా యివేవీ పట్టవు. అన్నీ నేను చూసుకోవాల్సిందే.'' ఆ బరువంతా మోస్తున్నట్లు అన్నాడు.

''మీరు యింటి పనులుకూడా చేస్తారా?'' ఆశ్చర్యంగా అడిగాడు కేశవరావు.

''ఇంటి పనులు మేమెవరం చేయనక్కర్లేదు. మా అమ్మే చూసుకుంటుంది లెండి. నేననేది పనుల విషయంకాదు. సంసారం అన్నాక యెన్నిబాధ్యతలుంటాయి చెప్పండి. అవన్నీ మనసులోవున్నా బరువులాగే వుంటుంది. అరుణ అనలవి పట్టించుకోదు. హాయిగా పుస్తకాలు చదువుకుంటూ కూచుంటుంది. ఓ యిల్లు కట్టుకుందామనో, కాస్తడబ్బు బాంక్‌లో వేసుకుందామనో, యింట్లోకి కావాల్సినవి అమర్చుకుందామనో... అబ్బే, ఇవేవీ తనకు పట్టవు.''

అరుణ ముఖం పాలిపోయింది. ఆ వందా తనిలా వృధాచేసిందని ప్రకాశం కేశవరావుకి అర్థమయ్యేలా చెయ్యాడుగదా-

''అవన్నీ మీరుచూసుకుంటున్నారు గదండీ - అరుణగారిని హాయిగా పుస్తకాలు చదువుకోనివ్వండి.'' కేశవరావు యిబ్బందిగా నవ్వాడు.

ప్రకాశం అరుణమీద చేస్తున్న కంప్లయింట్లు సరదాగానా నిజంగానేనా అనే అనుమానం వచ్చిందతనికి.

''మీ పత్రిక యెందాకా వచ్చిందండీ'' ప్రకాశం అడిగాడు.

''జులై ఫస్టుకి మొదటి సంచిక వచ్చేస్తుందండీ- అసలు జూన్ చివరికే తేవాలని మాప్రయత్నం. తెస్తాంకూడా. మేం పదిమంది మి కలిసి చిన్నపిల్లలు ఫ్యాక్టరీల్లో యేయే పనులు చేస్తూ యెన్నెన్ని కష్టాలు పడుతున్నారో పదిరోజులపాటు సిటీ అంతా తిరిగి సమాచారం పోగుచేశాం. అదంతా మొదటి సంచికలో వస్తుంది.''

కేశవరావు వుత్సాహంగా చెబుతున్నాడు.

"దానిమూలాన యేమవుతుందండీ - వాళ్ల పరిస్థితులన్నీ మారిపోతాయా? మనవల్లేం అవుతుందండీ అవన్నీ మార్చటం" ప్రకాశం నిరసనగా అన్నాడు.

"మనవల్ల అవుతుందని కాదు-విషయం అందరికీ తెలుస్తుందని" కేశవరావు ప్రకాశం ధోరణికి కాస్త తగ్గాడు.

"మనవల్ల యేమవుతుందీ యేమవుతుందీ అనే మాటవినీ వినీ విసుగెత్తిందండీ. ఏదోఒకటి చేతనయింది చెయ్యటమే మంచిది. అలా చెయ్యకుండా తప్పించుకుంటానికి 'మనవల్లేం అవుతుందనే' మాట మంచిసాకుగా పనికొస్తుంది." అరుణమాటలకు కేశవరావు ముఖం వికసిస్తే ప్రకాశం ముఖం మాడిపోయింది.

"సరే చెయ్యండి చూద్దాం" బలవంతాన నవ్వుముఖానికి పులుముకుంటూ అన్నాడు.

కేశవరావు వెళ్తానంటూ లేచాడు.

ప్రకాశంకూడా లేచి షేక్‌హాండిచ్చాడు. అరుణకు నమస్కారం చేసి కేశవరావు వెళ్ళిపోయాడు.

ప్రకాశంకూడా కాసేపట్లో బయటికి వెళ్ళాడు.

★ ★ ★

"అబ్బా-యింకా యేం చదువు యిటురావోయ్-రోజూ రాత్రి పన్నెండింటిదాకా చదువుతావు. నీకు నిద్రెలా సరిపోతుంది." ప్రకాశం మంచంమీద బద్ధకంగా దొర్లుతూ అరుణను పిలిచాడు.

"రోజూ ఎక్కడ చదువుతున్నాను?" పుస్తకంలోంచి తల యెత్తకుండానే జవాబిచ్చింది.

"అదే-పుస్తకం దొరికిన రోజల్లా చదువుతావుగా"

"రాత్రి పన్నెండింటిదాకా మేలుకొని చదివే అవసరం నాకేముంది? ఇంటి బరువూ బాధ్యతలన్నీ నీవి, పనంతా అత్తయ్యది. నాకేంపనాపాటా? హాయిగా పుస్తకాలు చదువుకుంటూ కూచోవటమేగా" పుస్తకం మూసి పక్కనపెట్టేసింది అరుణ.

"అబ్బో - చాలాకోపం వచ్చిందే- నేనేదో సరదాకి అంటే - అందుకేనా రెండురోజుల్నించీ పలుకే బంగారంగా వుంటున్నావు"

"రెండు రోజుల్నించీ నేను సరిగా లేననితెలిసే నువ్వు యేమిటని అడగలేదన్నమాట!"

"ఏంటోయ్ నీసాధింపులు - యేం చేశాను నేను. సరదాగా నీకు బరువూ బాధ్యతలు లేవన్నాను. అంతేనా. ఇంకేమన్నా అన్నానా? తిట్టానా? కొట్టానా?"

"అంతకంటే ఘోరంగానే అవమానించావు. ఈ ఇంట్లో నాకేం బాధ్యతలేదా? ఇంటిపని నేను చూడటంలేదా? పొద్దున కూరలు తరగటం, మధ్యాహ్నం టిఫిన్లు,టీల పనితప్ప అత్తయ్యచేత నేనేపనీ చేయించటంలేదే–అంట్లూ, బట్టలు, ఇల్లు తుడుచుకోవటం-అన్నీ నేనే చేస్తున్నానే. ఆ టీ.వీ వొక్కటితప్ప మిగిలిన సామానంతా ఇద్దరంకలిసే ఆలోచించే కొన్నామే-ఎందుకట్లా మాట్లాడావు?"

"సరదా కన్నానుగా"

"నీకు సరదాగానే ఉంటుంది. ఆ మాటలు నన్నెంత బాధపెడతాయో నీ కర్థంకాదు. ఇంటిపనితో కుదరదులే అని యమ్.ఫిల్‌కి కూడా వెళ్ళటం మానుకున్నాను. నీవేమో ఇంటిపనిలో నేనసలు వేలే పెట్టనన్నట్టుగా మాట్లాడావు. ఈ సరదాలూ, విసుర్లూ ఎందుకో నాకూ తెలుసు. నేను నెలకో వంద వాళ్ళ పత్రికకు ఇచ్చేసరికి ఏ బాధ్యతలూ పట్టనిదాన్నయిపోయాను. ఏడాదికో రెండు గజాల స్థలం కొందామనే ఆలోచన లేకపోయేసరికి ఏ బరువూలేనిదాన్నయాను. నేచేసే పనులు కూడా మర్చిపోయావు"

"నీ ఇష్టం. నీకట్లా ఆలోచించటం బాగుంటే అలాగే అనుకో! నేనుమాత్రం సరదాగానే అన్నాను. నాకిష్టం లేకపోయినా నువ్వు ఇస్తూనే ఉన్నావుగా. మామాట చెల్లిందెక్కడ?"

అరుణకు కోపం ముంచుకొచ్చి మాట్లాడకుండా కూచుంది. 'ప్రకాశం సరదాగా అనలేదనటానికి అతనన్న చివరిమాటే ఆధారం. ఇప్పటికైనా తానా వందా ఇవ్వడం మానేస్తే చాలా

సంతోషిస్తాడు. తనమాట చెల్లిందని మురిసిపోతాడు. అరుణ మాట ఏమవుతుందని ఆలోచించనే ఆలోచించడు. ఎట్లా ఇతనితో మాట్లాడటం, మార్చటం, వొప్పించటం. ఇవేమీ పెట్టుకోకుండా ఆలోచించటం మానేస్తేతప్ప శాంతిగా ఉండేలాలేదు. ఆలోచించటం మానెయ్యాలి శాంతి అంటే ఏమిటి? జడ పదార్థంలా బతకటమా?'

అరుణ తలపట్టుకు కూచుంది.

"అరుణా-నీకో మంచి కబురుంది తొందరగారా" ప్రకాశం వూరిస్తున్నట్టు పిలిచాడు.

"ఏంటది" నిరాసక్తంగా అడిగింది.

"రా-చెబుతా"

ప్రకాశం దగ్గరకు వెళ్ళింది.

"మనం రెండు రోజుల్లో బయల్దేరి మైసూరు, బెంగుళూరూ వెళ్ళబోతున్నాం. నాలుగు రోజులు మనిష్టం వచ్చినట్లు తిరుగుదాం."

అరుణేం మాట్లాడలేదు.

"ఎందుకూ ఏమిటని అడగవేం?"

"చెబుతావుగా-చెప్పు"

"మాకు యల్.టి.సి. ఇస్తారుగా. అది వాడుకొని ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళలేదుగా. ఇప్పుడు వెళదాం. పాపని అమ్మ చూసుకుంటుంది. వారమేగా-"

"పాపనూ అత్తయ్యనూ వొదిలా?"

"మనిద్దరమే వెళితే సరదాగా ఉంటుంది. మన పెళ్ళయ్యాక ఎక్కడికన్నా వెళ్ళామా? పెళ్ళయిన రెండో నెలకే నీకు రెండో నెలాయె."

"అదేదో అరుణ తప్పులా అంటుంటే ప్రకాశంవంక విస్మయంగా చూసింది అరుణ. ప్రకాశం ఆ చూపు పట్టించుకోకుండా-

"అమ్మ అసలు తనంతటతనే రానంటుంది. అమ్మను నేను తిరుపతి తీసికెళ్తాలే- తర్వాత"

"పాప మనల్ని వొదిలి ఉంటుందీ-మనం లేనప్పుడు ఏదన్నా జరిగితే"

"ఏమీ జరగదు. నీకన్నీ అనుమానాలే-శుభ్రంగా తిరుగుతున్న పిల్లను పట్టుకుని ఏమన్నా జరిగితే అని ఆలోచిస్తావు. ఏమీకాదు. మనిద్దరమే హాయిగా చీకూచింతా లేకుండా గడిపివద్దాం."

అరుణను గట్టిగా కావిలించుకుని ముద్దులు పెట్టేస్తున్నాడు. పరిచయమైన ఆ స్పర్శలో ఆ కౌగిలింతలో అన్నీ మర్చిపోయి ఇమిడిపోయింది అరుణ.

కమలమ్మ కొడుకూ కోడలూ బెంగుళూరు వెళ్తారనితెలిసి వెళ్ళి రమ్మందేగాని వొద్దనలేదు. తానూ వొస్తాననలేదు. వీళ్ళ ప్రయాణానికి పెద్దగా సంతోషమూ ప్రకటించలేదు. ఆవిడ నిర్లిప్తతచూచి అరుణకు బాధనిపించింది. ఆవిడను రమ్మనలేదే, ఆవిడ నొచ్చుకుందేమో అనే అనుమానం వచ్చింది. కానీ ప్రకాశం మరో ఆలోచనకు చోటివ్వకుండా హడావుడిచేసి ప్రయాణపు ఏర్పాట్లు చేశాడు.

* * *

ఆదివారం తెల్లవారు ఝామునే బెంగుళూరులో బస్సుదిగారు అరుణా, ప్రకాశం. బస్ స్టాండ్ వదిలి బయటకివస్తే ఆటోల టాక్సీల ఆహ్వానాలు.

"బస్‌స్టాండ్ దగ్గిరే తప్పకుండా హొటల్స్ ఉండి ఉంటాయి. కాస్త దూరం నడుద్దాం. ఈ ఆటోలవాళ్ళు మనకు భాషరాదు గదా అని మోసం చేస్తారు. ఎంతెంత దూరాలో తీసుకుపోతారు." అన్నాడు ప్రకాశం, మెయిన్ రోడ్డువంక చూస్తూ.

"ఏమీ తెలియని ఊళ్ళో హొటళ్ళు ఎక్కడని వెతుకుతాం. పైగా ఈ సూట్‌కేసులతో. మహాచేస్తే పది రూపాయలు మోసం చేస్తాడేమో-దానికోసం నానా యాతనా పడొద్దా" అంది అరుణ.

"ఏం ఫరవాలేదు. నీకెందుకు నడువు. పది నిమిషాల్లో ఏదో ఒక హొటలు కనపడుతుంది. బస్‌స్టాండు దగ్గరా రైలుస్టేషన్ దగ్గరా హొటళ్ళు కడతారు" వ్యాపార రహస్యం అరుణకు

తెలియ జేశాడు.

ఇద్దరూ చెరో సూట్‌కేసూ పుచ్చుకుని రోడ్డు మీద పదడుగులు వేసేనరికి హొటళ్ళు కనపడ్డాయి.

"నీకు బాగానే తెలుసే. ఏ హొటలుకి పోదాం" అంది అరుణ ఇంత తొందరగా కనపడిన హొటళ్ళనుచూసి ముచ్చటపడుతూ.

"అబ్బే-ఇంత దగ్గరగాఉన్న హొటళ్ళు అంత బాగోవు. కాస్త లోపలికి వెళితే మంచివి ఉంటాయి. నీకెందుకు పది నిమిషాల్లో నిన్ను హొటలు గదిలో దించే బాధ్యత నాది" హామీ ఇచ్చాడు ప్రకాశం.

ప్రకాశం చెప్పినట్లే పది నిమిషాలు నడిచేసరికి పెద్ద హొటలొకటి కన్పించింది. సూట్‌కేసు బరువుకి చెయ్యి గుంజటంతో ఇంకో హొటల్‌కోసం చూడకుండా గబగబా లోపలికినడిచి కౌంటర్ దగ్గర సూట్‌కేసు దించుకుని అలుపు తీర్చుకున్నాడు.

"రూమ్స్ ఖాళీగా ఉన్నాయా?" అని ప్రకాశం అడిగిన ప్రశ్నకు "కాసేపు కూచోండి" అని ఎదురుగాఉన్న సోఫాలు చూపించాడు, కౌంటర్‌లో ఉన్నాయన.

ప్రకాశం అరుణా ఆ కబురూ యీ కబురూ మాట్లాడుకుంటూ కూచున్నారు. అరగంట గడిచింది. కౌంటరాయిన పిలవలేదు.

"ఈ సోఫానే రూం అంటాడా ఏమిటి, కనుక్కోపో" అని కోప్పడింది.

"ప్రకాశం కౌంటర్ దగ్గర ఇంకో అరగంటసేపు నిలబడి హొటలువాళ్ళు రాయమన్న వివరాలన్నీరాసి, పెట్టమన్న సంతకాలన్నీపెట్టి కట్టమన్న డబ్బులన్నీకట్టి అరుణ దగ్గరకు విజయగర్వంతో వచ్చాడు.

హొటల్ బాయ్ తానే సూట్‌కేసులు తెస్తానన్నేనరికి ప్రకాశం హాయిగా నిట్టూర్చి అతని వెనకాలే నడిచాడు. ప్రకాశం వెనకాలే అరుణ. మెట్లెక్కారు. ఎక్కారు. ఎక్కారు.



"ప్రకాశం" అంది అరుణ దీనంగా నాలుగో అంతస్థు చేరగానే "ఇస్తే ఇక్కడ గది ఇవ్వమను లేకపోతే లేదు. నేనుమాత్రం ఇంకొక్కమెట్టు కూడా ఎక్కను" అని మొండికేసింది.

హొటల్ బాయ్ మళ్ళీ కనిపించే మెట్లెక్కడం మానేసి గదులవైపు నడవటం చూసేనరికి ఇద్దరికీ ప్రాణాలు తెరిపిన బడ్డాయి. ఆ వరుసలో చివరి గదిలోకి వీళ్ళను ప్రవేశపెట్టి ఆ అబ్బాయి వెళ్ళిపోయాడు.

"మొత్తానికి గదిమాత్రం చాలా బాగుంది." అన్నాడు ప్రకాశం గదంతా కలయజూస్తూ.

విశాలమైన గదిల్లో రెండు బెడ్స్. మధ్యలో చిన్న టేబిలూ కుర్చీలూ. ఒక వక్క డ్రెస్సింగ్ టేబిలూ. రెండు మంచాలకూ అందుబాటులో ఉండేలా ఫోనూ, రేడియో. పెద్ద పెద్ద కిటికీలూ వాటికి లేతరంగు తెరలూ. టేబిల్‌మీద ఫ్లవర్ వాజులో తెల్లని పూలూ! ఆర్భాటంగానే ఉందా గది!

"ప్రకాశం. వేడినీళ్ళు కూడా వస్తున్నాయి. షవర్ కూడాఉంది." అరు ణ చిన్నపిల్లలా సంతోషపడిపోతూ కేకేసింది.

"ఎందుకు రావూ? బక్కెట్టు వేణ్ణీళ్ళకు పది రూపాయలిస్తే" అన్నాడు ప్రకాశం మహా నిర్లిప్తంగా.

"అదేంటి?" అంది అరుణ అయోమయంతో.

"మరీ గదికి అద్దె ఎంతనుకున్నావ్?"

"ఎంత?"

"ఎంతుంటుందీ-వూహించి చెప్పు"

"యాభై రూపాయలుంటుందా" అంది గదంతా కలయజూస్తూ.

"సరేలే-నూటయాభై రూపాయలు" అన్నాడు ప్రకాశం.

"అమ్మో" అంది అరుణ గుండెలమీద చెయ్యి వేసుకుంటూ

"ఇంత ఖరీదైన హొటలుకి ఎందుకొచ్చాం?"

"నేనూ ఇంత ఉంటుందనుకోలా. ముందు

రూమ్స్ ఉన్నాయా అని అడిగాం. అరగంట కూచున్నాం. అన్నీ రాసిన తర్వాత అద్దెన్ను ఐదొందలిమ్మంటే అప్పుడడిగా, రెండెంతా అని. నూటయాభై రూపాయలన్నాడు. ఇక అప్పుడు నాకొద్దని చెప్పటం నామోషి అని పించిం

నాలుగైదు బక్కెట్ల వేణ్ణీళ్ళతో స్నానంచెయ్యి. ఎలాగైనా నూటయాభై రూపాయలు గిట్టించాలి"

ప్రకాశం మాటలకు అవకుండా నవ్వింది అరుణ. "ఆటో అతను పదిరూపాయలు కాజేస్తాడని చూస్తే యిప్పుడేమయింది? అతనైతే మనకెంత అద్దెలో గదికావాలో చెబితే అక్కడికి తీసికెళ్ళేవాడు గదా"

"పోనీలేవేయ్!— ఇంతమంచి వాతావరణంలో మనిద్దరం హాయిగా వుంటాం. డబ్బుదేముంది? అసలు మనకు తోచలేదుగాని మన పెళ్ళిరోజు కూడా యిలాంటి హోటల్‌కి వెళ్ళాల్సింది."

అరుణకు గతం గుర్తొచ్చింది.

"ఆరోజు యెన్ని కష్టాలు పడ్డామోగదా,- నేను పదింటికి మీయింటి కొస్తే!-"

"మాయిల్లా?— నీయిల్లు కాదా?" అడ్డు తగిలాడు ప్రకాశం.

"అప్పటికి నీయిల్లేగా!— సరే మనిల్లు!— పొద్దున పదింటికి మనింటికొస్తే సాయంత్రం నాలుగింటిదాకా యిల్లు దులుపు కోవటంతోనే సరిపోయింది. ఇల్లంతా కడిగి తుడిచేసరికి యెంత అలసట వచ్చిందో!—"

"ఔను పావం!- నిన్ను చూస్తే జాలేసింది. పెళ్ళి కూతురిగా ముస్తాబై కూచుని కబుర్లు చెబుతుండాల్సిన రోజు యెంతకష్టపడ్డావో" జాలిగా అన్నాడు ప్రకాశం.

"కష్టమా పాడా!— సరేగాని గుర్తుందా ఇంట్లో అప్పుడు నీ మడతమంచంతప్ప చాప ముక్క కూడా లేదు. పక్కింటి వాళ్ళనడిగి చిరిగిన చాపొకటి తెచ్చావు" అరుణ నవ్వింది.

"గుర్తెందుకు లేదూ? నేను ఆ చాపమీద దుప్పటి వెయ్యబోతుంటే నువ్వు పెద్దకేకేశావు. ఆ దుప్పటి పొయ్యిలో పెట్టమని తిట్టావు. దుప్పటి కాస్త మురిగ్గానే వుందనుకో! అయినా పెళ్ళయిన రోజే అట్లా తిట్టాలా" అప్పటి తిట్లకి యిప్పుడలిగి కూచున్నాడు ప్రకాశం.

"ఆ చిరిగిన చాపమీద రాత్రంతా నిద్రలేక కళ్ళుమంటలూ ఒళ్ళు నెప్పులూ. ఎలా మొదలెట్టామో గదామన సంసార జీవితాన్ని" అరుణకు గతంలోంచి బైటికి రాబుద్ధి కాలేదు.

"ఆనాడీ తెలివుంటే మన పెళ్ళిరోజు యెంత మధురంగా వుండేదో" అన్నాడు ప్రకాశం.

"ఏం బాగోదు. నాకు మన పెళ్ళిరోజే బాగుంది." అంది అరుణ మురిపెంగా.

"సరే సరే!— త్వరగా స్నానం చేసిరా. బైటికెళదాం. ఏంటో నూటయాభై రూపాయలిచ్చాం, పగలంతా తాళం పెడుతున్నాం" నిట్టూర్చాడు ప్రకాశం.

విశ్వేశ్వరయ్య మ్యూజియంకు వెళ్లారు.

"ఉమకి మ్యూజియం చాలా నచ్చేది" అంది అరుణ.

"నీకు నచ్చలేదా?" అన్నాడు ప్రకాశం.

"నచ్చలేదని కాదు. ఉమకైతే హృదయం నిండిపోయేది. నాకెందుకో యిలా ఈ యంత్రాలూ, సైన్సూ వీటితో మనసు నిండినట్లనిపించదు. కొత్త విషయాలు తెలిశాయని సంతోషంగా వుంటుంది అంతే" అంది అరుణ.

లాల్‌బాగ్‌లో రకరకాల రంగురంగుల పూలమధ్య కళ్ళు విప్పార్చుకుని చూస్తూ నిలబడిపోయిన అరుణను భుజంమీద చేయివేసి దగ్గరగా తీసుకుంటూ అడిగాడు ప్రకాశం.

"ఇప్పుడు నీ హృదయం నిండిందా?"

"పూర్తిగా నిండిపోయింది" అంది అరుణ తన్మయత్వంతో

పువ్వు పువ్వునీ పలకరించాలనిపించింది అరుణకు.

"ఎంత బాగున్నాయో!— యెలా?— యేం చెయ్యాలి యింత సౌందర్యాన్ని?"

అరుణ పరవశత్వం చూసిచూసీ ప్రకాశం అన్నాడు. "నాకు అన్ని పువ్వుల కన్నా నువ్వే బాగున్నావు."

అరుణ మధురంగా నవ్వింది.

బెంగుళూరులో చూడాల్సినవన్నీ చూసి రాత్రి యెనిమిదింటికి హొటలు చేరుకున్నారు.

మర్నాడు మైసూరు వెళ్ళటానికి టూరిస్టు బస్సుకోసం అడిగితే అప్పటికే టిక్కెట్లు అయిపోయాయని చెప్పారు. ఆ తర్వాత రోజుకి టిక్కెట్లు కావాలని చెప్పి గదికి చేరుకున్నారు.

"రేపంతా యేంచేద్దాం?" అన్నాడు ప్రకాశం.

"హాయిగా గదిలో విశ్రాంతి తీసుకుందాం" అంది అరుణ.

"ఔను. అలాగన్నా నూటయాభై రూపాయలు గిట్టించొచ్చు".

ఇద్దరూ నవ్వుకున్నారు.

మర్నాడు ఉదయం పదిగంటలదాకా కబుర్లు చెప్పుకుంటూ గడిపారు. అరుణ అప్పుడంది.

"ఇదే మద్రాసు వెళితే యిలా హొటల్లో కూచునే అవసరం వుండేది కాదు. చక్కగా ఏ భానుమతినో, సుబ్బులక్ష్మినో చూసేవని" అని

"ఇక్కడమాత్రం చూడగూడదా?"

"ఎవర్నీ?— భానుమతినా?"

"అబ్బ కాదులేవోయ్!— ఇక్కడ ప్రముఖులైన తెలుగువాళ్ళ నెవళ్ళనన్నా చూడొచ్చుగదా"

"ఎవరున్నారు, ఈ కర్ణాటక దేశంలో తెలుగు ప్రముఖులు?"

"ఎవరో వొకరు వుండేవుంటారు. ఆలోచించు"

అరుణ కాసేపు ఆలోచించి,

"వఠాభి గారున్నారు" అంది వుత్సాహంగా.

"ఆయనెవరు?"

"వఠాభి తెలియదా? 'ఫిడేల్ రాగాల డజన్' రాశారు. 'సంస్కార' సినిమా తీశారు. 'ఫిడేల్ రాగాల డజన్' చదవలేదా?"

"లేదే"

"సరే!— హైద్రాబాదు వెళ్ళాక చదువుదువు గానిలే. ఆయన దగ్గరకు వెళదామా." అంది అరుణ వుత్సాహంగా

"వాళ్ళెక్కడుంటారో— మనకేం తెలుసు ఈ మహానగరంలో" ప్రకాశం నిరుత్సాహంగా అన్నాడు.

"ఇల్లెక్కడున్నా వాళ్ళింటికైతే ఫోన్ వుంటుందిగదా, ఫోన్ నంబరు చూద్దాం" అంటూ అరుణ టెలిఫోన్ డైరెక్టరీ తీసింది.

ఇద్దరూ కలిసి డైరెక్టరీలో వఠాభిగారి నంబరు పట్టుకున్నారు.

"ముందు ఫోన్‌చేసి అడ్రసు వివరంగా కనుక్కుందాం" అంది అరుణ.

ఆ ఫోను యెంతకూ దొరకలేదు. రిసెప్షనిస్టు ఆఫోను బాగోలేదని చెప్పింది.

"ఇక లాభంలేదు. డైరెక్టరీ అడ్రసుతో యిల్లు పట్టుకోవటం కష్టం" అని నిశ్చింతగా పడుకున్నాడు ప్రకాశం.

"ప్రయత్నించి చూద్దాం. చేసేదేముంది. కాస్త వూరన్నాచూసి నట్లుంటుంది" అంది అరుణ.

"అబ్బ హాయిగా పడుకుని నిద్రపోక యిప్పుడాయన రాగాలు వినటం యెందుకంటా"

"నిద్ర హైదరాబాదులో కూడా పోవచ్చు. బెంగుళూరు రానవసరంలేదు."

"వెళ్ళాల్సిందే నంటావా?"

"ఆఁ"

ప్రకాశం లేచి తయారయ్యాడు.

ఇద్దరూ ఆ అడ్రస్‌కి యేయేబస్సులెక్కి వెళ్ళాలో వివరంగా కనుక్కొని రెండు గంటలసేపు రకరకాల వాహనాల్లో ప్రయాణంచేసి చివరకు చేరవలసిన ప్రాంతానికి చేరారు.

ఇంటినంబర్లూ, పేర్లూ చదువుకుంటూ వీధులన్నీ తిరిగారు.

చివరకు వాళ్ళక్కావల్సిన యిల్లు దొరికేనరికి యిద్దరూ ఆనందంతో వుబ్బి తబ్బిబ్బయి గేటులోనుంచి లోపలకు చూశారు.

ఇంతశ్రమపడి వచ్చిన వాళ్ళిద్దర్నీ సాదరంగా ఆహ్వానిస్తున్నట్లు తళతళ మెరుస్తూ నవ్వుతోంది తాళం.

అరుణ ముఖంవంక వోరగాచూసి పెద్దగా నవ్వాడు ప్రకాశం.

"చాల్లే సంబరం" అంది అరుణమూతి ముడుచుకుని.

"నేరానంటే నీకెంత కోపంవచ్చేదే! చూశావా యిప్పుడేమయిందో ఎంతైనా పెద్దవాళ్ళ మాటలకు కాస్త విలువివ్వాలోయ్"

"నాకసలే కోపంగా వుంది నువ్వూరుకో" అంది అరుణ నీరసంగా. మళ్ళీ అన్ని రకాల వాహనాలూ యెక్కి హోటలు చేరుకున్నారు.

"ఏదన్నా సినిమాకు వెళ్ళొచ్చుగా" సాయంత్రం మళ్ళీ మొదలెట్టింది అరుణ.

"కన్నడ సినిమాకా. నేరాను" తేల్చి చెప్పేశాడు ప్రకాశం.

"నీకంత జాత్యహంకారం పనికిరాదు. కన్నడంలో యెంత గొప్ప సినిమాలొచ్చాయో తెలుసా?"

"తెలుసులేవోయ్. కానీ నాకిప్పుడు గొప్ప సినిమాలు చూసేమూడ్ లేదు"

"మరి యేం చెయ్యాలనిపిస్తోంది"

"ఇలాగే నీ వొళ్ళో పడుకుని కబుర్లు చెప్పాలనిపిస్తోంది. "

విశాలమైన అరుణ కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు ప్రకాశం.

"ప్రకాశం. నిజంగా నేనంటే ప్రేమేనా" అరుణ హఠాత్తుగా అడిగింది.

"అబ్బే- ప్రేమాలేదు యేం లేదు. యెవరు చెప్పారు నీ మీదనాకు ప్రేమని"

"నిజం చెప్పు- వేళాకోళం కాదు. "

"ఏంటి చెప్పేది. పిచ్చి ప్రశ్నలూ నువ్వూనూ" అరుణ తలమీద చిన్నగా కొట్టాడు.

"మరి అప్పుడప్పుడూ • నన్నెందుకమ్మా బాధపెడతావూ?"

"ఏంటో- నాకిష్టంలేని పనులు నా ప్రమేయం లేకుండా నువ్వు చేస్తుంటే నాకు చాలా కోపం వస్తుంది. నీకు లోకజ్ఞానం లేదు సరే నా సలహా అన్నాతీసుకోవచ్చుగదా అనిపిస్తుంది. నన్ను నువ్వు లెక్కచెయ్యటం లేదనే ఆలోచనవచ్చి యికభరించలేక పోతాను. నాకోపాన్ని అంత సీరియస్‌గా తీసుకోకు. అయినా నువ్వు నా కోపాన్ని పోగొట్టొచ్చుగా! నువ్వు దానికి ప్రయత్నించకుండా బిగుసుకుపోయి గొడవని యింకాస్త పెంచుతావు." అశాంతిగా అన్నాడు ప్రకాశం.

" మా అమ్మానాన్నలు నన్ను అంత కట్టడిలో పెంచటం సరైందని అన్నావు. ఆ రోజు నాకెంత బాధేసిందో తెలుసా? అది గుర్తొస్తే యిప్పుడు కూడా మనసంతా చేదుగా అయిపోతుంది. నువ్వు నాలో యేం చూసి ప్రేమించావా అనే ఆలోచన వచ్చి చెప్పలేనంత దుఃఖం కలుగుతుంది " అరుణ గొంతులో దిగులు వినపడింది.

"అవన్నీ యిప్పుడు గుర్తుచేసుకొని మనసు పాడు చేసుకోకు. నేనేదో తొందరలో వాకమాటంటే దాన్నే పట్టుకు కూచుంటేయెట్లా. పిచ్చి పిల్లా. నువ్వంటే నాకెంత ప్రేమో నిజంగా నీకు తెలియదూ" అరుణను గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు ప్రకాశం.

"ప్రేమంటే యేమిటి? " ప్రకాశం కళ్ళల్లో యేదో వెతుకుతున్నట్లుగా చూస్తోంది అరుణ.

"ఏమిటా. ప్రేమంటే యిదిగో యిది" అరుణ పెదవులమీదా, కళ్ళమీదా, చెక్కిళ్ళమీదా వూపిరాడకుండా ముద్దులు పెట్టి వుక్కిరిబిక్కిరి చేశాడు.

అంత వుక్కిరి బిక్కిరిలో కూడా అరుణ మనసులో యేమూలో 'యిదేనా ప్రేమంటే' అన్న చిన్న ప్రశ్న మొలకెత్తక మానలేదు.

మర్నాడు వుదయాన్నే టూరిస్టు బస్సులో మైసూరు బయల్దేరారు.

"కర్నాటక రాష్ట్రం చాలా బావుందిగదూ" అంది అరుణ కిటికీలోంచి పచ్చగా కనపడుతున్న ప్రకృతిని చూస్తూ.

"నాకు మన రాష్ట్రమే బాగుంటుంది" మొండిగా అన్నాడు ప్రకాశం.

"నీ రాష్ట్రాభిమానం వదిలేసి చూడు. ఇంత పచ్చ పచ్చగా ఆంధ్ర యెక్కడుంటుంది? "

" అసలు నువ్వు ఆంధ్రలో యేం చూశావూ? హైదరాబాదే ఆంధ్రప్రదేశనుకుంటున్నావా? ఇకనుంచీ మన రాష్ట్రంలో చూడాల్సినవన్నీ చూసిగాని పరాయి రాష్ట్రాలకు రాగూడదు " ఆవేశపడిపోయాడు ప్రకాశం.

" నిజమే. నేను యేమీ చూడలేదు. చివ



రకు హైదరాబాదు పక్కనున్న సాగర్ కూడా వెళ్ళలేదు. మా యింట్లో యెప్పుడూ పిక్నిక్కులకీ, ఎక్స్‌కర్షన్లకీ పంపేవారు కాదు '' అరుణ తన తెలియనితనాన్ని వొప్పుకుంది.

''ఇకచూడు. ప్రతి సంవత్సరం వొక్కోచోటికి వెళదాం ''

''ఆ చెట్లు చూడు యెలా పూశాయో '' విరగబూసిన చెట్లు వెనక్కి వెళ్ళి పోతుంటే తల వెనక్కు తిప్పి చూసింది అరుణ.

శ్రీరంగ పట్టణంలో దేవాలయం దగ్గర బస్సు ఆగింది. అరుణకి దేవాలయంలో యెంతసేపున్నా వొదిలి రాబుద్ధి పుట్టలేదు.

'' ఇంత మంచి ఆలయాలుంటే భక్తి కలిగేటట్లే వుంది '' అంది.

బస్సువాళ్ళు అరగంట కాగానే రమ్మని కేకలేశారు.

'' ఇలా టూరిస్టు బస్సుల్లో రాకూడదు. ఒక్కోరోజు వొక్కోచోటుకి వెళ్ళి చూడాలి ''

'' సరేలే అంత తీరికెవరికి '' అన్నాడు ప్రకాశం.

చాముండీ హిల్స్ మీదకు బస్సు యెక్కుతుంటే అరుణ ఆనందంతో కేరింతలు కొట్టింది.

నెమ్మది నెమ్మదిగా బస్సు కొండపైకెక్కుతుంటే హఠాత్తుగా ప్రత్యక్షమైంది పెద్ద లోయ. అరుణకు బస్సులోంచి ఆ లోయలోకి దూకెయ్యాలనిపించింది.

ఆర్ట్‌గేలరీలో చిత్రాలు చూస్తుంటే అరుణకి అక్కడ్నించి కదలాలనిపించలేదు. బస్సు పోతే పోయిందిలే. బెంగుళూరు రేపు వెళ్ళొచ్చు అనిపించింది.

రవివర్మ చిత్రాలని పరీక్షగా చూసింది. ఒక్కో చిత్రం దగ్గరా నిలబడి చూస్తుంటే,

'' అంతంతసేపు చూస్తే బస్సు వెళ్ళిపోతుంది. నడువు '' అని హడావుడి పెట్టాడు ప్రకాశం.

''రవివర్మ చిత్రాలు చాలా బాగున్నాయే '' అంది అరుణ పెద్ద ఆలోచనలో యిబ్బంది పడుతున్నట్లు ముఖం పెట్టి.

'' భలే దానివిలే- రవివర్మ చిత్రాలు బాగు

న్నాయే- యేం విలువైన మాట చెప్పావు. కొత్త సత్యం కనిపెట్టినట్టు " ఎగతాళిగా నవ్వాడు ప్రకాశం.

" అదికాదులే. నీకు తెలియదు " అని విసుక్కుంది అరుణ.

" ఏదికాదు. యేంటి నీ సందేహం రవివర్మ చిత్రాల గురించి " ఆశ్చర్యపోయాడు ప్రకాశం.

" నాకైతే యెంతో అద్భుతంగా వున్నాయి. గురజాడకెందుకు నచ్చలేదా అని, యెందుకలా అన్నాడా అని "

" రవివర్మ చిత్రాలు నచ్చలేదని గురజాడ నీతో అన్నాడా? "

అరుణకి పిచ్చెక్కలేదుగదా అని భయపడ్డాడు ప్రకాశం.

" అబ్బ- నాతో అంటాడా. అంతా తెలివితక్కువ మేళం. కాలేజీ లైబ్రరీలో ఈ మధ్య గురజాడ డైరీలు చదివా. అందులో రవివర్మ చిత్రాల్ని ఆయన విమర్శించాడు. నాకేమో చాలా బాగున్నాయి. గురజాడ కెందుకు నచ్చలేదా అని"

" అడుగుదువుగానిలే గురజాడని. నడువు. నడువు. "

ఆ హాల్లోంచి బైటికి లాక్కొచ్చాడు.

ఇద్దరూ కలిసి చందనంతో చేసిన చిన్న రాధాకృష్ణుల బొమ్మని యెంపిక చేసి కొన్నారు.

సాయంత్రానికి బస్సు బృందావన్ గార్డెన్ చేరింది.

" అబ్బ- భలే వుంది గదూ" అన్నాడు ప్రకాశం విద్యుద్దీపాల కాంతిలో మెరిసిపోతున్న బృందావనాన్ని చూసి ముగ్ధుడవుతూ.

" కొత్తగా చూస్తున్నట్లు అంత ముగ్ధుడవైపోతున్నావేం " అంది అరుణ నవ్వుతూ.

" కొత్తగా కాక- యెప్పుడు చూశాను? నువ్వు చూశావా?"

ప్రకాశం ఆశ్చర్యం పట్టలేకపోయాడు.

" ప్రతి సినిమాలోనూ చూస్తాంగా. మొన్న చూసిన సినిమాలో ఈ ఫౌంటెన్ దగ్గరే హీరో పిచ్చిగంతులేసినట్లు గుర్తొస్తోంది "

" అదా- భలేదానివే " నవ్వాడు ప్రకాశం.

గార్డెనంతా తిరిగి పక్కనున్న డామ్ యెక్కి అలిసిపోయారు. మళ్ళీ బస్సెక్కి బెంగుళూరు చేరేసరికి పన్నెండు దాటింది. హోటల్లో భోజనం లేదు.

ఆకలాకలంటూనే నిద్రపోయాడు ప్రకాశం. అరుణకు ఆకలితో అలసటతో వెంటనే నిద్రపట్టలేదు. చాముండీ హిల్స్ యెక్కుతుంటే హఠాత్తుగా ప్రత్యక్షమైన లోయ అరుణ మనసులో ముద్ర వేసుకుపోయింది. ఎంత హఠాత్తుగా యెంత పచ్చగా కళ్ళముందు పరుచుకుందో!

ఆలోయ నలా తల్చుకుంటుంటే యెందుకో అరుణకు ఒంటరితనంలో వున్నట్టనిపించింది. ప్రకాశం గాఢంగా నిద్రపోతున్నాడు.

ఆలోయ కూడా నాలాగే వొంటరిగా నిశ్శబ్దంగా ఆలోచనల్లో వుంటుందా. తన ఆలోచన తనకే చిత్రంగా అనిపించింది. తనెందుకు వొంటరిదవుతుంది? ప్రకాశం పక్కనే వున్నాడు. లోయ మాత్రం యెందుకు వొంటరిది? యెన్ని పక్షులో, జంతువులో మనుషులో-

కానీ తన మనసులో యెక్కడో వొంటరితనం వుంది.

తనకు యింకా యేదో కమ్యూనికేషన్ యెక్కడినుంచో కావాలి.

ఏమిటది?

ఎందుకు తెలియటం లేదూ?

లోయ వొంటరిదని యెవరికీ తట్టదు. తనకెందుకు తట్టింది?

తనకు ప్రకాశం, పాపా, అత్తయ్యా యింత మంది వుంటే వొంటరితనమేమిటి?

ఈ ఆలోచనలతోనే తెల్లవారింది.

ఉదయాన్నే బస్టాండుకి వెళ్ళి సాయంత్రం బస్సుకి టిక్కెట్లు తీసుకుని వూరంతా మళ్ళీ తిరిగారు. పాపకి గౌన్లూ, బొమ్మలూ- కమలమ్మకూ అరుణకూ చీరలూ కొన్నారు. ప్రకాశమే యేమీ కొనుక్కోలేదు.

సాయంత్రం బస్సెక్కికూర్చుంటూ—

" హోటలు బిల్లు తప్ప అంతా బాగానే వుంది" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

ఆనందంగా ప్రకాశం చెయ్యి తన చేతిలోకి తీసుకొని నిశ్చింతగా కూచుంది అరుణ.



బెంగుళూరు నుంచి తిరిగొచ్చి పాపతో కబుర్లు చెప్పి ప్రయాణపు బడలికంతా తీరేట్లు నిద్ర పోయి లేచింది అరుణ.

సాయంత్రం ఆరవుతోంది.

ఎండ తగ్గిపోయి చల్లనిగాలి వస్తుంటే, పాపను తీసుకుని వాకిట్లో నిలబడ్డాడు ప్రకాశం.

అరుణ టీ కలిపి కమలమ్మకూ ప్రకాశానికీ ఇచ్చి తానూ తాగుతూ కూచుంది.

కమలమ్మ ఏదో గుర్తొచ్చినట్లు లేచి ఒక పత్రికా, కవరూ తెచ్చి ఇచ్చింది.

'వెలుగు' పత్రిక. ఉమ రాసిన ఉత్తరం.

అరుణ ఆసక్తిగా 'వెలుగు' పేజీలు తిరగేసింది. పదహారు పేజీల పత్రిక అది. చిన్న పిల్లలు చట్ట విరుద్ధంగా ఫాక్టరీల్లో ఎలా పని చేస్తున్నారో ఎంతెంత కష్టమైన పనులూ, ప్రమాదాలతో కూడుకున్న పనులూ చేస్తున్నారో వివరాలన్నిటితో వ్యాసాలూ, ఫొటోలూ ఉన్నాయి.

''పాపం పుణ్యం ప్రపంచమార్గం<br>
కష్టం సౌఖ్యం శ్లేషార్థాలూ<br>
ఏమీ ఎరుగని పూవుల్లారా<br>
అయిదారేడుల పాపల్లారా''

అన్న శీర్షికకింద ఆ పసివాళ్ళు చేసే కఠినమైన పనుల ఫొటోలు చూసి అరుణ మనసు చివుక్కుమంది.

''మీ పత్రికేనా?'' కాస్త వ్యంగ్యంగానే అడిగాడు ప్రకాశం.

అరుణ అదేమీ పట్టించుకోకుండా ''ఔను. చూడు చాలా బాగుంది. అంటూ ప్రకాశానికి అందించింది.

''చదవకుండానే అంత బాగుందని తెలిసిందా'' అంటూ పత్రిక అందుకున్నాడు ప్రకాశం.

అరుణ ఉమ రాసిన ఉత్తరం విప్పింది.

అరుణా

నీకు ఉత్తరం రాసి చాలా కాలమయింది కదూ!

నా థీసిస్ పూర్తయింది. ఆ గొడవల్లోనే నీకు రాయటం కుదరలేదు.

నాకు మా డిపార్ట్‌మెంట్‌లోనే ఉద్యోగం వస్తుంది. కనుక ఇప్పట్లో అటువైపు రాను.

అమ్మా నాన్నా ఢిల్లీ వచ్చి నా పెళ్ళి గురించి చాలా గొడవ చేసి వెళ్ళారు. నేను పెళ్ళి చేసుకోననీ, చేసుకున్నా నా ఇష్టం వచ్చినవాడిని ఎవరికీ చెప్పకుండా, ఏ ఆర్భాటాలూ లేకుండా చేసుకుంటాననీ చెప్పాను.

నా ఇష్టం వచ్చిన వాడినే చేసుకోవచ్చు గానీ పెళ్ళంటూ ఒక తంతేదో జరపాలంటారు వాళ్ళు.

నా థీసిస్ పనీ, అమ్మా వాళ్ళతో ఈ పేచీ-ఎంత టెన్షన్‌తో గడిచాయో ఆ రోజులు, చివరకి వాళ్ళు చాలా బాధపడి వెళ్ళారు.

వాళ్ళ బాధచూసి నాకూ అయ్యో అనిపించింది గానీ వాళ్ళకోసం నేనేం చెయ్యలేని స్థితిలో ఉన్నాను. ఎందుకంటే నా పెళ్ళి అయిపోయింది.

ఆశ్చర్యపోతున్నావా?

పెళ్ళిలా తంతేమీ జరగలేదులే.

సుధీర్ నేనూ ఆరునెలల నుంచీ కలిసే ఉంటున్నాం. పని గట్టుకుని ఈ సంగతి ఎవరితోనూ చెప్పలేదు కూడా.

అతను నాకు ఢిల్లీలోనే పరిచయం. ఇంగ్లీష్ డిపార్ట్‌మెంటులో లెక్చరరు. మా స్నేహం చాలా సహజంగా ప్రేమ సంబంధంలోకి దారితీసింది. ఇద్దరం ఒకటయ్యాం. ఆ విషయం అందరికీ చెప్పి అది పెళ్ళిగా ప్రకటించి అందరి ఆమోదం కోరి- ఇదంతా మాకు ఇష్టం లేదు.

మేమేం చిన్నపిల్లలం కాదుగదా. మొన్న థీసిస్ హడావుడి లేకపోతే అమ్మావాళ్ళకు

చెప్పేదాన్నే! కాని, వాళ్ళు ఈ విషయాన్ని అర్థం చేసుకోలేరు. అప్పుడు వాళ్ళు గొడవ పెట్టటం- నా పని బాగా డిస్టర్బ్ అవుతుందని చెప్పలేదు. నాలుగైదు నెలల్లో ఊరెళ్ళి వాళ్ళకు చెబుతాను.

వాళ్ళున్న పదిరోజులూ సుధీర్‌కి యేదో పనుండి నా గదికి రాలేదు. నీకు ఆశ్చర్యంగా ఉంది కదూ. ఔను. మా ఇద్దరికీ ఎవరి ఇళ్ళు వాళ్ళకున్నాయి. మా ఇద్దరికీ తీరిక దొరికినపుడూ, ఒకరి స్నేహం, ప్రేమా ఇంకొకరికి కావాలనిపించినపుడూ కలిసి వొకింట్లో ఉంటున్నాం. తర్వాత మళ్ళీ ఎవరిళ్ళలోకి ఎవరి పనుల్లోకి వాళ్ళం. మా ఇద్దరికీ ఇలా ఎన్నాళ్ళు బాగుంటే అన్నాళ్ళుంటాం. ఇద్దరం వొకే ఇంట్లో ఉండాలనిపిస్తే ఉంటాం. ఇప్పుడైతే అంత తీరిక లేదు.

ఇది చాలా అరుదుగా జరిగే విషయమే. కానీ మాకిది చాలా సహజంగా సంతృప్తిగా ఉంది.

నీ అభిప్రాయం ఏమిటో రాయి. ప్రకాశం ఏమంటాడో రాయి.

మీ ఇద్దరూ వీలైతే ఢిల్లీ రాగూడదూ-

నేనూ సుధీరూ కలిసి ఇక్కడున్న ఊళ్ళన్నీ తిరగాలనుకుంటున్నాం. మాకు తీరిక దొరకగానే ఉత్తరం రాస్తాను. మీ ఇద్దరూ రండి. నలుగురం సరదాగా గడపొచ్చు.

మీ పాప ఏమంటోంది?

నా జీవితం గురించి నీ అభిప్రాయాలు వినాలని ఉంది.

వెంటనే ఉత్తరం రాయి'',

అరుణ ఆ ఉత్తరం పట్టుకుని అలాగే కూచుంది. ప్రకాశం పత్రిక చూసి పక్కన పెట్టి అరుణ వంక చూసి ఆశ్చర్యపోయాడు.

''ఏంటా ఆలోచన? ఏం రాసింది ఉమ.''

అరుణ ఆ ఉత్తరం ప్రకాశానికి అందించింది. ప్రకాశం ఆ ఉత్తరం చదివి ఛీత్కారం చేశాడు.

అరుణ ''ఏంటది'' అన్నది తీవ్రంగా.

''ఏంటా- మీ ఫ్రెండు చేసిన నిర్వాకం''

''అంతచీదరించుకోవాల్సిన పనేంచేసింది? ప్రేమించిన మనిషితో కలిసుండటం తప్పా?''

''ప్రేమాలేదు. పాడూలేదు. ప్రేమిస్తే పెళ్లి చేసుకోవాలి. కాపురంచెయ్యాలి. పెళ్ళిచేసుకోరు. ఒకింట్లో కలిసుండరు. వాళ్ళిద్దరిమధ్యా సంబంధం గురించి యెవరితోనూ చెప్పరు? ఏంటిది— ఒకరిమీద వొకరికి మోజుంది. తిరుగుతున్నారు. నాలుగునెలల్లో మోజుతీరగానే యింకొళ్ళని వెతుక్కుంటారు.''

ముఖంలో వాళ్ళంటే వున్న అసహ్యమంతా కనిపింపజేస్తూ అన్నాడు ప్రకాశం.

''ఎందుకంత అన్యాయంగా, అసహ్యంగా మాట్లాడతావు?''

ప్రకాశం ధోరణికి అరుణకు కోపంవచ్చింది.

''న్యాయంగా యేం మాట్లాడాలో కాస్త చెప్పు వింటాను''

అరుణేంమాట్లాడలేదు.

''చెప్పు. మీఫ్రెండు చాలా గొప్పపని చేసిందని వాదించు''

''గొప్పేమిటి- తక్కువేమిటి. ప్రేమించిన వాడితో కలిసుంటోంది. మనంచేసిన పనేగా''

''పెళ్ళి చేసుకోవచ్చుగా- యెందుకు చేసుకోలా- వాళ్ళతో మనల్ని పోల్చుకోవటం చాలా అసహ్యం. మనం చట్టబద్ధంగా పెళ్ళిచేసుకున్నాం. మన పెళ్ళేం రహస్యంకాదే. కలిసి కాపురం చేస్తున్నాం. పెళ్ళిచేసుకోటానికీ, వొకింట్లో కలిసి కాపురం చెయ్యటానికీ, వాళ్ళకేమిటి అభ్యంతరం? చెప్పు. నాకు తెలియటంలేదు'' వెటకారంగా అన్నాడు ప్రకాశం.

అరుణ మౌనంగా వూరుకుంది. నిజానికి ఆవిషయం అరుణకు కూడా అర్థం కాలేదు. ఉమ పెళ్ళెందుకు చేసుకోలేదూ? కనీసం యిద్దరూ కలిసి వొకింట్లో యెందుకుండటంలేదూ? కానీ ఉమ తెలివితక్కువదికాదు. మనిషిని ప్రేమించకుండా మోజుపడి ఆమోజు తీర్చుకోవటంకోసం యెవరితో పడితే వాళ్ళతో తిరిగే మనిషి కాదు. ఉమ చాలా తెలివైంది. చాలా స్థిరమైన అభిప్రాయాలు గలది. ఎందుకిలా చేసింది? ఎంతఆలోచించినా ఆప్రశ్నదగ్గరే ఆగిపోతోంది. ఉమను అడిగి తెలుసుకుంటే తప్ప తానుగా సమాధానం చెప్పలేననుకుంది

అరుణ.

"ఏమిట్రా మళ్ళీ యేదో తగువుపెట్టుకున్నారు?" అంటూ వచ్చింది కమలమ్మ. ముఖం నల్లగా చేసుకుని దిగులుగా కూచున్న అరుణనీ, యేదో నవాలు విసిరి నెగ్గినట్టు ఆవేశంతో కూచున్న ప్రకాశాన్నీ చూసి ఆవిడకు మళ్ళీయిద్దరిమధ్యా యేదో ముంచుకొచ్చిందనిపించింది.

"ఏం లేదమ్మా- ఈవిడ స్నేహితురాలు యెవరినో ప్రేమించిందంట. ప్రేమించుకున్న వాళ్లు పెళ్ళి చేసుకోవచ్చుగదా. పెళ్ళీగిళ్ళీ లేకుండానే కలిసుంటున్నారు" హేళనగా అన్నాడు ప్రకాశం.

"ప్రేమించుకుని కలిసుంటున్నారు. అది పెళ్ళి కాదుట్రా. మీరుచేసిందేమిటి?" కమలమ్మ ప్రకాశం మాటలను తీసేసింది.

"అదేంటమ్మా మేం రిజిష్ట్రారు ఆఫీసులో స్నేహితులందరిసమక్షంలో పెళ్ళి చేసుకున్నాం. మీ అందరికీ చెప్పాం"

"అరేయ్- నిజంగా చెప్పాలంటే ఆకాగితాలపెళ్ళి పెళ్ళని నాకు నమ్మకంలేదు. ఐనా మీ యిద్దరూ ఒకరంటే వొకరు యిష్టపడి భార్యాభర్తలమవుదామనుకున్నారు. ఇక ఆ అనుకోవటమే పెళ్ళిలే- పైపై తంతుదేముంది అని నర్దుకున్నాం మేమందరమూ. వాళ్లు ఆకాగితాలుకూడా వొద్దనుకున్నారు. అంతమాత్రాన వాళ్లు మొగుడూపెళ్లాలు కాకపోతారా"?

కమలమ్మ మాటలకు అరుణ విస్తుపోయింది. తనకు కూడా కొరుకుడు పడని విషయాన్ని యెంత తేలికగా తీసేసింది. ఈవిడ చాలా గొప్పమనిషి అనుకుంటూ అడ్మిరేషన్‌తో అత్తవంక చూస్తూ కూచుంది. ప్రకాశం కమలమ్మ మాటలకు పూర్తిగా రెచ్చిపోయాడు.

"నీకు తెలియదమ్మా. వాళ్లు వొకింట్లో కాపురం కూడాచెయ్యటంలేదు.. ఎవరిళ్లు వాళ్లుంచుకుని అప్పుడప్పుడూ కలిసి భార్యాభర్తల్లా నాటకం ఆడుతున్నారు" ఈసారి హేళనతో పాటు కసికూడా వుంది ప్రకాశం గొంతులో.

"కాపురం అనేపేరుతో వొకింట్లో చేరి అస్తమానం పిల్లీ యెలకల్లా కాట్లాడుకునేకంటే యెవరిళ్లు వాళ్ళుకుంటే నయమేలేరా- అయినా వాళ్ళిష్టం వాళ్ళది. మధ్యన మీతగవులెందుకంటా"

అరుణ ముఖం ఆనందంతో వికసిస్తే ప్రకాశంముఖం మాడిపోయింది.

"సరిపోయారు అత్తాకోడళ్లు" అని విసుక్కున్నాడు.

"అరుణా! లేచి ఆబెండకాయముక్కలు వేయించు. పాప ఆకలంటోంది. పెందలాడే తిని నిద్రపోతే దానికి మీకూకూడా సుఖం" అంటూ అరుణవొళ్ళోపాపను చంకనేసుకుని వాకిట్లోకి వెళ్ళింది కమలమ్మ.

ఆరాత్రి యీవిశేషాలన్నీ ఉమకు వివరంగా రాసింది అరుణ. ఉమను యెన్నోప్రశ్నలడిగింది. తనఅనుమానాల్నీ భయాల్నీ సందేహాల్నీ అన్నీ ఉమకు రాస్తేగాని ముళ్ళపొదలా వున్న అరుణ మనసు మంచి మైదానంలా మారలేదు.

అరుణ వుత్తరం రాస్తుంటే-

"మీ ఫ్రెండు రాసే సమాధానం మాత్రం నాకు తప్పకచూపించాలి" అంటూ నిద్రపోయాడు ప్రకాశం.

"ఎందుకో- వాళ్ళనింకా హేళన చెయ్యటానికా? నేను చస్తే చూపించను." అనుకుంది అరుణ.

అరుణ యెంతగానో యెదురు చూసిన ఉమవుత్తరం రాకుండానే శలవలయిపోయి కాలేజీలు తెరిచారు. 'వెలుగు' పత్రిక నెలనెలా వస్తూనే వుంది. అరుణ వందరూపాయలు నెలనెలా యిస్తూనే వుంది. రెండునెలల తర్వాత మళ్ళీ ఉమఉత్తరం వచ్చింది.

వుత్తరం చదవటం మొదలు పెడుతూనే ఆశ్చర్యపోయింది అరుణ. తను రాసిన వుత్తరం ఉమకి అందనేలేదు.

అరుణ సమాధానం యెందుకు రాయలేదో తనకి అర్థంకావటంలేదని రాసింది ఉమ.

"నేను రాసిన విషయాలు నీకు నచ్చలేదా- కోపంవచ్చిందా- నీకు యేమనిపిస్తే అది రాసే చనువు మనమధ్య వుందిగదా. ఎందుకు మౌనంగా వున్నావు? ఎవరి అభిప్రాయాలు వాళ్లుంచుకొని స్నేహం చెయ్యటం కుదరదా? ఈవిషయం వల్ల మనస్నేహం బలహీనపడు

తుందా అన్న అనుమానం నన్ను వేధిస్తోంది. వెంటనే వుత్తరం రాయి." అంటూ చాలా బాధపడుతూ రాసింది.

తన ఉత్తరం యెందుకందలేదూ?

ప్రకాశం అసలావుత్తరాన్ని పోస్టు చేశాడా?

భయంకరమైన అనుమానం వచ్చింది అరుణకు.

అప్పుడు శలవలవటంవల్ల తను బైటికి వెళ్ళటం లేదు. ఉత్తరం పోస్టుచెయ్యమని ప్రకాశానికి ఇచ్చింది. ప్రకాశం పోస్టుచెయ్యలేదా?

తర్వాత చాలాసార్లు ప్రకాశం ఉమవుత్తరం రాసిందా అని అడిగి రాయలేదంటే వ్యంగ్యంగా అనేవాడు. "ఏంరాస్తుంది? నువ్వు యేవో ప్రశ్నలు అడిగి వుంటావు. వాటికి సమాధానాలు యివ్వలేక వుత్తరం రాయటం మానేసుంటుంది" అని.

ఉమ వ్యవహారం యిష్టంలేక ప్రకాశం ఈ పనిచేశాడా? ఆరోజు సాయంత్రం ప్రకాశం రాగానే అడిగింది.

"నేను ఉమకి రాసిన వుత్తరం పోస్టుచెయ్యమని నీకిచ్చాను. పోస్టుచేశావా?"

"చేశానే. ఎందుకలా అడుగుతున్నావు?" చిత్రంగా చూశాడు ప్రకాశం.

"ఆ ఉత్తరం అందలేదట. ఉమ రాసింది"

"పోస్టులో మిస్ అయివుంటుంది" మామూలుగా అనేశాడు.

అరుణ యింకేంమాట్లాడలేదు. ప్రకాశాన్ని అనుమానించాల్సివచ్చిన తనపరిస్థితి తనకే చిరాకనిపించింది.

ఈసారి ఉమకు రాసిన ఉత్తరంలో ఉమనే ప్రశ్నలూ అడగకుండా ఉమ జీవిత విధానం తనకేమీ అభ్యంతరకరంకాదని రాసింది. ఉమబాధ పోగొట్టాలని ప్రయత్నించింది.

* * *

ఆరోజు పిల్లలు కాలేజీలో లాబ్‌సౌకర్యాలు సరిగాలేవని సమ్మె చేశారు. క్లాసులు లేకపోవటంతో అరుణ లైబ్రరీలో కూచుని చదువుకుంటోంది.

"అరుణగారూ" అంటూ మెల్లగా పిల్చాడు కేశవరావు.

"రండి. కూచోండి"— ఎదురుగావున్న కుర్చీ చూపించింది అరుణ.

"మీతో వొకవిషయం మాట్లాడాలని వచ్చానండి"

"మీరు చెప్పకుండానే నాకా సంగతి తెలుసండీ. విషయమేమీలేకుండా వుట్టి కబుర్ల కోసం మీరెప్పుడూరారు." అంది నవ్వుతూ. కేశవరావూ నవ్వాడు.

"చెప్పండి"

"పత్రికఎలా వుంటోందండి"

"'వెలుగు'లాగానే వుంటోంది. ఎన్ని విషయాలను వెలుగులోకి తెస్తోందో. సేల్స్ యెలా వున్నాయండి ?"

"ఫరవాలేదండి — ఇంకో నాలుగు నెలల్లో సంవత్సరం పూర్తవుతుంది. ఇక ఆ తర్వాత పత్రిక తన కాళ్ళమీద తాను నిలబడగలుగుతుంది"

కాసేపు మౌనం తర్వాత కేశవరావు అన్నాడు.

"మీరు పత్రికకు కేవలం చందాదారుగానే వుండటం నాకు బాగోలేదండి. పత్రికకు మీరింకా సహాయం చెయ్యాలి."

"ఏంచెయ్యాలండీ—" ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"పత్రికలో యే విషయాల గురించి రాయాలో, ఆ విషయాలు యెట్లా సేకరించాలో, యెట్లా వొకరూపానికి తేవాలో యివన్నీ మేం పదిహేనుమందిమి కలిసి ఆలోచిస్తున్నాం. మీరు కూడా మాలో చేరితే—"

"నేనేం చెయ్యగలనండీ—" మొహమాటంగా అంది అరుణ.

"మీరు చాలా చెయ్యగలరు. ఈసారి ఎలక్ట్రానిక్ పరిశ్రమలో పనిచేసే స్త్రీల గురించి పత్రిక తీయాలనుకుంటున్నాం. ఆ ఆడవాళ్ళను ఆడవాళ్ళే యింటర్వ్యూ చేస్తే బాగుంటుంది. వాళ్ళు ఫ్రీగా మాట్లాడగలుగుతారు. మా పదిహేనుమందిలో యిద్దరే అమ్మాయిలున్నారు. వాళ్ళు స్టూడెంట్సు. మీరు కూడా వాళ్ళతో కలిసి వెళితే చాలా ప్రయోజనం వుంటుంది."

కేశవరావు అరుణకు పని వొప్పజెప్పినట్లు ఫీలై నిశ్చింతగా కూచున్నాడు.

అరుణకు యేం చెప్పాలో తోచలేదు. 'నేనేం చెయ్యగలనండీ' అంది మళ్ళీ మొహమాటంగా -

"రేపు సాయంత్రం అందరం కలుద్దామండి. ఏంచెయ్యాలో యెలా చెయ్యాలో మాట్లాడుకుందాం" అన్నాడు కేశవరావు

"ఎక్కడ?"

"ఒక ఫ్రెండింట్లో. నేను మిమ్మల్ని తీసుకెళ్తాను. రేపు సాయంత్రం కాలేజీ అవగానే యిద్దరం కలిసి వెళదాం. మీరు రావటం చాలా అవసరమండీ—"

"నాకు కుదరదేమోనండి" అరుణ యిబ్బందిగా అంది.

"ప్రయత్నించండి. పోనీ వొకసారి రండి. మీకు మరీ యిబ్బందిగా అనిపిస్తే మానేద్దురుగాని"

అరుణ యింక బతిమాలించుకున్నట్టు వుంటుందని వొప్పేసుకుంది.

ఆరోజు సాయంత్రం నుంచే అరుణకు టెన్షన్ మొదలయింది.

ముందు ప్రకాశంతోచెప్పి వొప్పించాలా?

అసలు చెప్పకుండా మీటింగుకు వెళ్ళి తర్వాత అతనితో తగాదా పడాలా?—

ఏదీ తేలలేదు.

అరుణకు హఠాత్తుగా తన చిన్నప్పటి సంగతి గుర్తొచ్చింది.

అరుణ ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతుండగా 'దేవదాసు' సినిమా వొచ్చింది. క్లాసులో అరుణ స్నేహితులందరూ ఆ సినిమాకు వెళదామనుకున్నారు. అప్పుడే పరీక్షలు జరిగి సంక్రాంతి శలవలు మొదలవుతున్నాయి. ఆఖరి పరీక్షరాసి దేవదాసు సినిమా చూడాలని చాలామంది వుత్సాహ పడ్డారు.

కొందరిళ్ళల్లో చెప్పి పర్మిషన్ సంపాదించారు. కొందరు చెప్పకుండా రావటానికి సిద్ధపడ్డారు. అరుణకు యింట్లో వొప్పుకోరని ఖచ్చితంగా తెలుసు. అరుణ యింట్లో వాళ్ళందరూ కలిసి యే సినిమా చూడవచ్చని తీర్మానిస్తారో ఆ సినిమానేచూడాలి.

అదీ యింట్లో వాళ్ళతో కలిసి మాత్రమే చూడాలి.

దేవదాసు సినిమాకు స్నేహితులతోకలిసి వెళతానంటే యింటిల్లిపాదీ అరుణకు అడ్డంనించుంటారు. అడిగితే బతిమాలితే వొప్పుకునే సమస్యేలేదు.

చెప్పకుండా వెళితేనో అని మొదటిసారి ఆలోచించింది అరుణ. పరీక్షరాసి యింటికొచ్చేసరికి రోజూ వొంటిగంటవుతోంది. ఆరుగంటలదాకా యింటికి రాకుండా యేంకారణం చెప్పాలో అరుణకు అంతుబట్టలేదు. ఏ కారణమూ ఆలోచించకుండానే స్నేహితులతో కలిసి సినిమాకువెళ్ళి పోయింది. సినిమా చూస్తున్నంతసేపూ వొక్కక్షణం కూడా మనసు ప్రశాంతంగాలేదు.

'ఇంటికెళ్ళాక...ఇంటికెళ్ళాక...ఇంటికెళ్లాక ఏంజరుగుతుంది?'

ఇదే ప్రశ్న పెనుపాములా మెదడంతా తిరిగింది. సినిమా సరిగా బుర్రకెక్కటంలేదు. అయినా స్నేహితులు వెక్కిరిస్తారేమోననే భయంతో చివరిదాకా కూచుంది.

ఇంటికి వచ్చాక అత్త నిలదీసి అడిగితే నిజం చెప్పేసింది. ఇక పెద్ద పంచాయితీ జరిగింది. అరుణ చెంపలు వాచిపోయేలా కొట్టాడు తండ్రి.

అదంతా గుర్తొచ్చింది అరుణకు. 'ఆరోజు సినిమాకు వెళ్ళటానికి యెంత టెన్షన్ పడిందో యివాళ మీటింగుకు వెళ్ళటానికి అంతటెన్షన్ పడాల్సివస్తోంది. అప్పుడు తనకు పదహారేళ్ళు. మైనారిటీ వెళ్ళలేదు. పెద్దలవెనక నిలబడటం తప్ప మరేం తెలియదు.

ఇప్పుడు తనకు పాతికేళ్ళు దాటాయి. రెండుసార్లు ఓటేసింది. మూడేళ్ళ పిల్లకు తల్లి. బాధ్యత గలిగిన లెక్చరరు. సంపాదనాపరురాలు.

అయినాసరే మీటింగుకు వెళ్ళాలి అనే నిర్ణయం తనంతట తను తీసుకోలేకపోతోంది.

తన గార్డియన్‌కు కోపం వస్తుందేమోనని భయపడుతోంది.

ఇంట్లో విషయాలకి సంబంధించి తనకీ



బరుకులెదు కాని బైటి విషయాలొచ్చే సరికి ప్రకాశం తన కంట్రోలు చెయ్యాలని చూస్తున్నాడు. ఏకకంగా తానా కంట్రోలుని ఆమోదించాల్సి పరిస్థితి వస్తోంది.'

అరు బుర్ర వేడెక్కిపోయింది.

'ఏంటీ ఆలోచనలు?

ప్రశంతో మంచిగా విషయం చెబుతాను.

తన్ని వొప్పిస్తాను.

'ర్యాభర్తలు వొకర్నొకరు వొప్పించుకో వం, రాజీవడటం, వొకరికి నచ్చనివనులు ంకోరు మానెయ్యటం యివన్నీ తప్పవు.

నిజంగా ప్రకాశానికి మీటింగుకి వెళ్ళటం ఖ్టం లేకపోతే తాను మానేస్తుంది.

ప్రకాశం కంటే అతని ప్రేమకంటే ఎక్కువా యీ విషయాలు.

అయినా తాను అడగాల్సిన వద్ధతిలో అడిగితే ప్రకాశం కాదనడు. తనకెంతో యిష్టమని చెబితే వొద్దనడు.''

అరుణ వేడంతా దిగిపోయేలా తలారా చన్నీళ్ళ స్నానం చేసింది. తెల్లటి మెత్తటి చీర కట్టుకుని ప్రత్యేకంగా ముస్తాబయింది.

లోపలెక్కడో 'ఏంచేస్తున్నావు నువ్వు' అనే ప్రశ్న గోల చేస్తుంటే అణిచేసింది.

ప్రకాశాన్ని నవ్విస్తూ కవ్విస్తూ అన్నం తినిపించింది. ప్రకాశం కౌగిలిలో కరిగిపోయింది. చాలా రోజుల తర్వాత అరుణంత ఉత్సాహంగా ఆనందంగా వుండటం చూసి ప్రకాశం సంతోషించాడు.

ఇద్దరూ తరగని కబుర్లన్నీ చెప్పుకున్నారు. ప్రేమికులుగా వున్న రోజులు గుర్తుకు తెచ్చుకున్నారు. పాపని చూసి మురిసిపోయారు. భవిష్యత్తు గురించి ఆలోచించారు.

ఇక అలిసి నిద్రపోబోయే సమయంలో అరుణ మెల్లగా అంది.

''రేపు నువ్వు ఆఫీసునుంచి త్వరగా రావాలి''

''ఎందుకో! ఏం ప్రోగ్రాం వేశావేయ్'' ఇంకా ఇంకా అరుణను దగ్గరకు లాక్కున్నాడు.

''ప్రోగ్రాం నాకే. నీకు కాదు. నువ్వింటికొచ్చి పాపను చూడాలి. నేను ఆలస్యంగా వస్తాను.''

"నన్నొదిలి ఒక్కదానివే ఎక్కడికోయ్" గారాం చేశాడు.

"మీటింగుకి"

"మీటింగా?"

"ఊ!— అదే ఆ పత్రిక లేదూ— వెలుగు! దానికి సంబంధించి. అందులో ఇంకా ఏ ఏ విషయాలు రావాలీ, ఇలాంటివి మాట్లాడటానికి ఒక మీటింగ్ పెట్టారు. నన్ను కూడా పిలిచారు. నేను వెళ్తాను."

ప్రకాశం మెడకింద మొహం దాచుకుంటూ చిన్నపిల్లలా చెప్పింది అరుణ.

ప్రకాశం వెల్లికిలా తిరగటంతో అరుణ ముఖం పక్కమీద ఆనింది.

"నీకింకా ఆ పత్రిక పిచ్చి వదల్లేదా అరుణా"

చాలా అనంతృప్తి ధ్వనించింది ప్రకాశం గొంతులో.

"పిచ్చేమిటి?"

"కాకమరేమిటి? ఎవరో ఏదో పనిలేని వాళ్ళు పత్రిక పెడితే నెలకు వంద చందా ఇస్తున్నావు. పోన్లే అనుకుంటే ఇప్పుడీ మీటింగులు"

"మీటింగులకి వెళితే ఏమవుతుంది?"

"వెళ్ళకపోతే ఏమవుతుంది?" పంతంగా అడిగాడు.

"నాకు చాలా అసంతృప్తిగా వుంటుంది. తెలుసుకోవాల్సినదేదో తెలుసుకోలేకపోయినందుకు బాధగా వుంటుంది. నాకు ఇష్టమై కూడా మీటింగుకు వెళ్ళలేని నా పరిస్థితి మీద చాలా అసహ్యం" చాలాస్పష్టంగా తన మనసుని అర్థం చేసుకోటానికి తానే ప్రయత్నిస్తున్నట్టు చెప్పింది.

"నీకు నేనేం చెప్పనూ? నాకయితే ఇష్టంలేదు. నాకు ఇష్టం లేకపోయినా సరే నీకిష్టమున్న పని చెయ్యకపోతే నీ ఆత్మగౌరవం దెబ్బ తింటుంది. నువ్వెలాగూ ఆ పని చేస్తావు. ఎందుకు మన జీవితం ఇలాగవుతోంది?—"

"నేను మీటింగుకెళ్ళటం నీకెందుకిష్టం లేదూ?"

"వాటన్నిటితో మన జీవితం అశాంతిమయం అయిపోతుంది అరుణా. నాకు సంబంధం లేని ఏవేవో విషయాలు నీ జీవితంలోకి రావటం నాకిష్టంలేదు. నువ్వూ నేనూ, మన పిల్లలూ మన ఇల్లు. ఏ లోటూ లేని జీవితం. ఇవన్నీ నాకు కావాలి. నా కోసం పిల్లల కోసం నువ్వు. నీకోసం నేను. అంతేగానీ నాకు తెలియని- నాకు సంబంధంలేని జీవితం నీకుండటం నాకిష్టంలేదు. అలాగే నీకు సంబంధంలేని జీవితం నాకూ వుండదు. అరుణా. నామాట విను. ఆ మీటింగులూ అవన్నీ పెట్టుకోకు" బతిమాలుతున్నట్టు అన్నాడు ప్రకాశం.

"పోనీ నువ్వు రావొచ్చుగా- అపుడది నీకు సంబంధంలేని విషయమవదుగా"

"నువ్వు వెళ్ళటం నాకిష్టంలేదు. నేనెందుకు వస్తాను? ఈ ప్రపంచంలో లక్ష అన్యాయాలు జరుగుతున్నాయి. నేనూ ఒప్పుకుంటాను. కానీ ఆ అన్యాయాలకు నేను బాధ్యుడ్ని కాను. వాటి విషయం నాకక్కరలేదు. అవన్నీ పట్టించుకుని నా జీవితం పాడు చేసుకోను. నాకు శాంతిగా బతకటం ఇష్టం"

అరుణేమీ మాట్లాడలేదు.

"ఈ మీటింగు కోసమా ఇవాళింత ప్రేమగా వున్నావు?" నిరసనగా అన్నాడు ప్రకాశం.

అరుణ ఉలిక్కిపడింది.

ప్రకాశం అటు తిరిగి పడుకున్నాడు.

అరుణ కళ్ళల్లో నీళ్ళు నిండుకొచ్చాయి.

'ఈ మీటింగు కోసమా ఇవాళింత ప్రేమగా వున్నావు' అన్న ప్రకాశం మాటలు సూదిగా గుచ్చుకున్నాయి.

హఠాత్తుగా అక్కడనించి మాయం అయిపోవాలనిపించింది అరుణకు.

'నిజం కదూ- ప్రకాశాన్ని బాగా సంతోషపెట్టి ఆ విషయంలో ఒప్పించాలనుకుంది. ఎందుకా పని చేసింది.? ఇదంతా ముందే సూటిగా ప్రకాశంతో మాట్లాడితే ఏమయ్యేది? ఎంత అజ్ఞానంగా ప్రవర్తించింది? ఎంత అవమానం? ప్రకాశం చివరకు ఆ మాట అననే అనేశాడు. కానీ ఈ ప్రకాశమే ఒక రోజు తనతో ఏం మాట్లాడాడు? తనని సంతోషపెడుతూ ఒప్పించుకోవాలనలేదూ? ఆ రోజు ఆ మాటకి తనకూ అసహ్యం వేసింది. ఐనా అందులో

తప్పేముందిలే- భార్యా భర్తలు ఒకరినొకరు ఒప్పించుకోవటం నేరం కాదే అని తనను తాను సమాధానపరుచుకుంది. ఇవాళ అతన్ని సంతోషపెడితే ఇంత అవమానం జరిగింది.

ఏంచెయ్యాలితను?

ఎట్లా ప్రవర్తించాలి?

ఎట్లా ప్రవర్తించినా తనదే తప్పయిపో తుంది. అసలు తన ఆలోచనలోనే ఎక్కడో పొరపాటుంది.

ప్రకాశం ఏమన్నాడు? ప్రకాశానికి సంబంధంలేని జీవితం తనకుండకూడదట.

ప్రకాశంతో సంబంధంలేని జీవితం తనకు కావాలా వొద్దా?

ప్రకాశం తనకు కావాలి.

కానీ తనకు మిగిలిన విషయాలు కూడా కావాలి.

ప్రకాశానికిష్టంలేకపోతే అతను సంబంధం పెట్టుకోడు.

తన జీవితం మొత్తం అతనిదేనా? తన జీవితం తనది కాదా? ఇదీ తేల్చుకోవాల్సిన ప్రశ్న.

తన జీవితంలో ప్రతీదీ ప్రకాశంతో ముడిప డి వుండాలా? తనకు వేరే జీవితం వుండకూడ దా?

ఆ జీవితాన్ని ప్రకాశం తెలుసుకోవచ్చు. పంచుకోవచ్చు. ప్రోత్సహించవచ్చు. కానీ అణి చెయ్యటానికి అతనికేం అధికారంవుంది?

కన్నతల్లిదండ్రులకు ఆ అవకాశం ఇవ్వని తను ప్రకాశానికి యెందుకివ్వాలి? ఇచ్చిందంటే తాను మళ్ళీ పంజరంలో పక్షే. తను కోరుకున్న స్వేచ్ఛ తనకు లేనట్లే'

కొలిమిలా మండుతున్న తలను .రెండు చేతులతోనూ పట్టుకుని దిండులో తల దూ ర్చింది అరుణ.

మర్నాడు సాయంత్రం కాలేజీ అవగానే కేశవరావుతో కలిసి ఆ మీటింగుకి వెళ్ళింది.

అది కృష్ణమూర్తి అనే అతని ఇల్లు. ఇల్లంతా ఒకటే పెద్దగది. మేడమీద అదొక్కటే గది కావటంతో ప్రశాంతంగా వుంది.

గదిలో ఎక్కడ చూసినా పుస్తకాలూ, సిగరె ట్టుపీకలూ. ఒక చాపా రెండు దుప్పట్లూ పరిచి పదిహేను మంది కూర్చున్నారు.

కేశవరావు అరుణని అందరికీ పరిచయం చేశాడు.

అమ్మాయిలిద్దరూ ఉమెన్స్ కాలేజీలో బి.ఎ. చదువుతున్నారు. సుజాత, భారతి. మగవా ళ్లలో నలుగురు స్టూడెంట్సు ఉన్నారు. మిగిలి నవాళ్ళు ఉద్యోగాలుచేసేవాళ్ళు. కేశవరావు అరుణను వాళ్లందరికీ పరిచయంచేస్తూ ఎల క్ట్రానిక్ పరిశ్రమలో పనిచేసే ఆడవాళ్ల గురించి విషయాలు సేకరించటానికి అరుణకూడా వెళ్తుందని చెప్పాడు. ఆ అమ్మాయిలిద్దరూ అరుణను చూసి సంతోషించారు. తర్వాత కృష్ణమూర్తి భారతదేశంలో ఎలక్ట్రానిక్ పరిశ్రమ లగురించీ, అవి భారతదేశానికి ఎంతవరకూ అవసరం, భారతదేశానికి అత్యవసరమైన పరి శ్రమలేమిటి అన్న విషయాలగురించీ మాట్లా డాడు. కృష్ణమూర్తి మంచి టీచరేమో అరుణ సర్వం మర్చిపోయి శ్రద్ధగా విన్నది. అన్ని విషయాలు ఆయనంత ఆసక్తికరంగా చె ప్పటం చాలా ఆశ్చర్యకరంగా అనిపించింది.

మీటింగ్ నుంచి వచ్చేస్తూ మిగిలిన ఇద్దర మ్మాయిలతో "కృష్ణమూర్తిగారు ఎన్ని విషయా లు ఎంతబాగా చెప్పారోగదా" అంది అరుణ.

"సార్‌కి తెలియని విషయం ఉండదండి. ఆయనెప్పుడూ పుస్తకాలు చదువుతూ, దేశ మంతా తిరుగుతూవుంటారు. గొప్ప మేధావి. మన పత్రిక 'వెలుగు'లో దాదాపు అంతా ఆయనే రాస్తారు" అంది సుజాత

"ఆయనేం ఉద్యోగం చెయ్యరా?"

"లెక్చరర్‌అండీ - క్లాసులో పాఠాలు చె ప్పటం, పుస్తకాలు చదూకోటం ఇదేనండీ ఆయన పని" అంది భారతి.

"పెళ్లవలేదా?"

"లేదండీ" అంటూ నవ్వారు ఇద్దరూ.

"అందుకే అలా కుదురుతోంది" అంది అరుణకూడా నవ్వుతూ.

"పెళ్లవలేదనే కాదండి. ఆయన మిగిలిన విషయాలు కూడా పెద్దగా పట్టించుకోరండి. ఆకలేసినపుడు ఏదోఒకటి తినడం. చదువుకో వటం. రాసుకోవటం" భారతి చెప్తోంది.

అరుణ ఆలోచనల్లోపడిపోయింది.

'ఆకలేసినపుడు తినటం, చదువుకోవటం, రాసుకోవటం, దేశమంతా తిరగటం. ఏం అద్భుతమైన జీవితం. మరి అంత జ్ఞానం ఉండమంటే ఉండకేంజేస్తుంది'. తన దినచర్య గుర్తొచ్చింది అరుణకు.

'ఉదయం లేస్తూనే అంట్ల గిన్నెలు. పాచి పని.

కాఫీలు, పాపకు స్నానం, వంటా.

ఇంత తిని హడావుడిగా కాలేజీకి పరిగెత్తటం.

రాగానే మళ్ళీ బట్టలుతకటం, ఇస్త్రీ.

మళ్ళీ వంటా - ఇల్లు సర్దుకోవటం.'

అలసటతో నిద్ర.

నిద్రపట్టకపోతే ఏ పుస్తకమో చదివినరోజు కాస్త తృప్తిగా ఉంటుంది.

ఆయనకు పెళ్ళికాలేదుగనక అంత సైముందా? అదేంకాదు. పెళ్లయినమగాళ్లకు మాత్రం అంత పనులేం ఉంటాయి. ఇంటి చాకిరీ అంతా ఆడవాళ్ళే చేసిపెడతారు'

అరుణకు ఎదురింటి లాయరుగారు గుర్తొచ్చారు. ఆయన చాలా పేరున్న లాయరు. క్రిమినల్‌లాలో ఆయనంతటివాడు దేశంలోనే లేడంటారు. ఉదయం ఆరింటికల్లా ఆఫీసు రూంకి వచ్చేస్తాడు. కాఫీలూ, ఫలహారాలూ అన్నీ అక్కడికే వస్తాయి. కోర్టుకి వెళ్లబోయే ముందు భోజనానికి ఇంట్లోకి వెళతాడు. కోర్టు నుంచే క్లబ్బులూ షికార్లూ పూర్తిచేసుకునివచ్చి మళ్ళీ ఆఫీసురూంలో కూచుంటాడు, రాత్రి పన్నెండింటిదాకా.

ఆ లాయర్నే పొద్దున్నే లేచి అంట్ల గిన్నెలు తోముకుని, ఇల్లు తుడుచుకుని, పిల్లల్ని సముదాయించుకుంటూ వంటచేసుకుని కోర్టుకెళ్లమంటే?

మళ్ళీ కోర్టవగానే ఇంటికొచ్చి బట్టలుతకమంటే?

వంటింట్లో ఆడవాళ్లను బంధించటాన్ని మించిన క్రైం లేదని అప్పుడైనా ఆయనకు తెలుస్తుందా?

తనకు పెళ్ళికాకపోయినా కృష్ణమూర్తిలా ఆకలేసినపుడు హోటలుకెళ్ళి తినగలదా?

హోటలు తిండంటే తనకసహ్యం!

ఆ గదిని అంత చిందరవందరగా దుమ్ము దుమ్ముగా ఉంచుతుందా?

మగవాళ్ళు అవన్నీ పట్టించుకోకుండా వుంటున్నప్పుడు ఆడవాళ్లలా ఉండలేరెందుకని?

హోటలు భోజనం బాగుండదని ఒక్కసారన్నా హోటల్లో తినకముందే తనకు తెలును. ఎవరు ఎలా నేర్పారు ఆ ఆలోచనలు - శక్తంతా ఇంటికి ధారపోసే ఆలోచనలు!

తనుకూడా ఏమీ పట్టించుకోకుండా వుండగలిగితే'?

అరుణ ఊహల్లో విశాలమైన గది ప్రత్యక్షమైంది. ఆ గదిలో అరుణొక్కతే. బోలెడు పుస్తకాలు— రోజంతా అవి చదువుకుంటూ!

దిగాల్సిన స్టాపు వచ్చేసరికి ఉలిక్కిపడి గబగబా బస్సు దిగింది.

ఇల్లు ప్రశాంతంగానేవుంది. పాప అరుణ చీరపట్టుకొని 'ఆలిసెంగా వచ్చావు' అని కొట్టింది.

"ఆలస్యంగావస్తే యేమ్మా. నాయనమ్మ ఉందిగా" అంది అరుణ పాపనెత్తుకుంటూ.

"తొందరగా రా" అంది అరుణ పళ్ళు లాక్కుంటూ.

"వచ్చి ఏంచెయ్యను"?

"నాకు పుచ్చకాలు చూపిచ్చు. అం పెట్టు. యిత్తిరీ చెయ్యి" పాప వరసగా చెబుతుంటే అరుణకు నవ్వాగలేదు.

"నేనేంచెయ్యను. అన్నీ నువ్వే చేసుకో ఫో" అని పాపనుదించి పనిలో ప్రవేశించింది.

ప్రకాశం ఇంట్లోలేదు. కమలమ్మనడిగితే ఆరింటికి బైటికెళ్ళాడని చెప్పింది. అరుణ స్నానంచేసి పాపకు అన్నంపెట్టి నిద్రపుచ్చింది. ఇస్త్రీచేయాల్సిన బట్టలుంటే అవిచేస్తూ ప్రకాశంకోసం ఎదురుచూస్తూ కూచుంది. పదింటికి వచ్చాడు ప్రకాశం. అరుణ అన్నంపెడితే మాట్లాడకుండా తిని వెళ్ళి పడుకున్నాడు.

అరుణ వంటిల్లు సర్దుకుని వచ్చి పక్కనే

పడుకుని "మీటింగు విశేషాలడగవేం" అంది ప్రకాశం చెంప నిమురుతూ.

"నాకనవసరం"

ఎందుకనీ - నా జీవితంగురించి నీకు తెలియాలన్నావుగా. నీకు తెలియని జీవితం ఉండటం నాకూ ఇష్టంలేదు. విను నే చెప్పేది"

"నీకా జీవితం వుండటమే నాకిష్టంలేదు" కఠినంగా అన్నాడు ప్రకాశం.

"అదన్యాయంకదూ" అనునయంగా అంది అరుణ.

"ఏదీ?"

"నాకసలు జీవితమే ఉండగూడదనటం. నాకు జీవితం వుండాలి. అది నీకు తెలియాలి. అది న్యాయం.

"అరుణా నన్ను విసిగించకు" విసుక్కున్నాడు ప్రకాశం.

"విసిగించనులే - అసలు నీకు భారతదేశంలో ఎలక్ట్రానిక్‌పరిశ్రమ గురించి తెలుసూ?" తమాషాగా అంది అరుణ.

"మధ్యలో అదెందుకు? తిక్కా"?

"ఇవాళ మరి మీటింగులో అదే చెప్పారు. అసలు భారతదేశంలో ఈ పరిశ్రమ—" ప్రకాశం రెండు చెవులూ మూసుకుంటే అరుణ పకపకా నవ్వింది.

ప్రకాశం కోపంగా వెళ్ళి పాప పక్కలో పడుకున్నాడు.

ప్రకాశానికి కోపం వచ్చినా యిప్పుడు అరుణకు దిగులనిపించలేదు. ఒక విషయం తెలుసుకున్న తృప్తీ, వుత్సాహం మనసంతా ఆవరించగా హాయిగా నిద్రపోయింది.

వారం పదిరోజుల్లో తాను చెయ్యబోయే పని యెలాంటిదా అన్న కుతూహలం నిద్రలో కూడా ఆమెను వొదల్లేదు.

★ ★ ★

పదిరోజుల తర్వాత ఒక శనివారం నాడు మొదటిసారి పత్రిక పనిమీద ఎలక్ట్రానిక్ పరిశ్రమలున్న ప్రాంతానికి బయలుదేరింది అరుణ. అనుకోకుండా ఆ ముందురోజే ప్రకాశం ఓ స్నేహితుడి పెళ్ళికని బెజవాడ వెళ్ళాడు. శనివారంనాడు అతను లేకపోవటం అరుణకు చాలా రిలీఫ్‌గా అనిపించింది. తను చేసేపని యెవరితోనూ చెప్పాల్సిన అవసరం, యెవరి అనుమతీ తీసుకోవాల్సిన అవసరం లేకపోతే యెంత నిశ్చింతగా వుంటుందో మొదటిసారి తెలిసినట్లయింది అరుణకు.

కాలేజీకి ఆ రోజు సెలవు పెట్టి వుదయాన్నే బయలుదేరింది.

బస్సులు అంది, సిటీకి చివరవున్న ఆ పారిశ్రామిక ప్రాంతానికి చేరేసరికి పదిగంటలయింది. సుజాతా, భారతీ బస్‌స్టాప్‌లో అరుణ కోసం యెదురు చూస్తున్నారు.

ఆ ప్రాంతమంతా యెక్కడ చూసినా ఇంజనీరింగు కంపెనీలూ, ఎలక్ట్రానిక్ కంపెనీలే. ముందు యెక్కడనించి యెలా మొదలుబెట్టాలో వీళ్ళకో పట్టాన అంతుబట్టలేదు. చివరకు కాస్త పెద్దదిగా కనిపిస్తున్న వొక కంపెనీలోకి వెళ్ళారు.

గేటు దగ్గరున్న సెక్యూరిటీ గార్డు వీళ్ళను లోపలికి వెళ్ళనివ్వలేదు. 'మాకు లోపల పనుంది. మీ మానేజర్ని పిలవ'మంటే వీళ్ళని విజిటర్స్ రూంలోకి వెళ్ళనిచ్చారు. కాసేపటికి మానేజరు వచ్చాడు. ముగ్గురాడవాళ్ళ వంకా చిత్రంగా చూసి వీళ్ళొచ్చిన పనేమిటని యింగ్లీషులో అడిగాడు.

"మీ కంపెనీలో పనిచేస్తున్న ఆడవాళ్ళ పరిస్థితులూ, వాళ్ళ సమస్యలూ యివన్నీ కనుక్కుందామని వచ్చామండి" అని చెప్పింది అరుణ.

"వాటితో మీకేం పని" అన్నాడాయన కనుబొమలు ముడేసి.

"మేం వొక పత్రిక తరఫున వచ్చామండి. ఆ పత్రికలో యీ విషయాలన్నీ రాయాలని"

"అంటే మా కంపెనీలో లేని సమస్యల్ని సృష్టించటానికి వచ్చారన్నమాట. మా కంపెనీలో పనిచేసే వాళ్ళకి యే సమస్యలూ లేవు. చక్కగా పని చేస్తారు. జీతం తీసుకుంటారు. మీరు వెళ్ళొచ్చు" అంటూ ఆయన లోపలికి వెళ్ళిపోయాడు.

ముగ్గురూ హతాశులై బయటికి నడిచారు.

"ఈ లెక్కన యెవరు మాత్రం మనని

లోపలికి రానిస్తారు?'' అంది సుజాత.

''ఇట్లా లాభం లేదండి. మనం పత్రికల రాయటానికి వచ్చామని చెబితే మనల్ని కంపెనీ గేటుదాటి వొక్కడుగు లోపలికి వెయ్య నివ్వరు. మనం యూనివర్సిటీ నుంచి వచ్చా మనీ, ఈ పరిశ్రమ గురించి రిసెర్చి పేపరు రాయాలనీ, ఈ వివరాలన్నీ కావాలనీ చెబు దాం. అలాగయితే వీళ్ళు కాదనరు''

భారతి ముఖం గొప్ప విషయం కనిపెట్టిన ఆనందంతో వెలిగింది.

''మా అన్నయ్య ఇండస్ట్రియల్ రిలేషన్స్‌లో వొక విషయం గురించి రిసెర్చి చేశాడు. అప్పు డిలాగే కొన్ని ఫాక్టరీలు తిరిగి సమాచారం సేకరించాడు'' అని కూడా చెప్పింది తన వూహ కేవలం నిరాధారం కాదని చూపటానికి.

''సరే పదండి. ఇంకొక కంపెనీలో యీ పప్పు వుడుకుతుందేమో చూద్దాం'' అంది అరుణ నవ్వుతూ.

ఆ ఇంకో కంపెనీలో యీ పప్పు బాగానే వుడికింది. ఆ మేనేజరు వీళ్ళను సాదరంగా ఆహ్వానించి టీలు కూడా యిప్పించి ఆ కంపె నీలో పని చేస్తున్న ఆడవాళ్ళను విజిటర్స్ రూంలోకి వొక్కొక్కరినే పిలిపించే ఏర్పాటు చేసి తన పనిమీద వెళ్ళిపోయాడు.

అరుణకు యింటర్వ్యూ చెయ్యటం మొ దట యిబ్బందిగా అనిపించింది గానీ నెమ్మది గా అలవాటయింది.

ఆ కంపెనీల్లో ఆడవాళ్ళు చెయ్యాల్సిన పనులు చాలా వోపికగా కదలకుండా కూచుని చేయాల్సిన పనులు. చాలా సున్నితంగా చే యాల్సిన పనులు.

ఆడవాళ్ళనే యీ కంపెనీలోకి యెందుకు తీసుకుంటున్నారనే ప్రశ్నకు అక్కడ పనిచేసే స్త్రీలూ, యజమానులూ కూడా వొకే సమాధానం చెప్పారు.

ఆడవాళ్ళకు వోర్పెక్కువ. చాలాసేపు కదల కుండా ఒక చోట కూచుని పని చెయ్యగలరు. సున్నితమైన పనులు జాగ్రత్తగా చేస్తారు. అందుకే ఎలక్ట్రానిక్ కంపెనీల్లో ఆడవాళ్ళనే తీసుకుంటారు. ఉదయం ఎనిమిది నుంచి సాయంత్రం అయిదు గంటల దాకా పనిచేస్తే వాళ్ళకొచ్చేది నెలకు నూటయాభై రూపాయ లు. ఉదయం నుంచీ సాయంత్రం దాకా వెనక ఆనుకోటానిక్కూడా లేని స్టూలు మీద కూచుని పని చెయ్యాలి. సోల్డరింగు, అసెంబ్లింగ్ లాంటి పనులు యెంతో జాగ్రత్తగా చెయ్యాలి. ఏ చిన్న పొరపాటు జరిగినా వాళ్ళు జీతంలో నష్టపోతారు. ఆ పనులవల్ల వాళ్ళ ఆరోగ్యం ాడవుతుందో లేదో వాళ్ళకు తెలియదు. ము ంగా వాళ్ళ గర్భధారణ శక్తి మీద వాళ్ళు చె పని ప్రభావం వుందా అన్న ప్రశ్న చాలామందికి అర్థమే కాలేదు. వాళ్ళ జీవితాల గురించి వివరాలన్నీ తెలుసుకుంటున్న అరు ణకు నుతిపోయింది. చాలా మందికి జీతం కూడా యివ్వరనీ బస్సు ఛార్జీలిచ్చి మధ్యాహ్నాం తిండిపెట్టి పని చేయించుకుంటారనీ, వాళ్ళు వొక్కొక్కళ్ళు చేసే పనివల్ల యజమానులకు రోజుకు యాభై రూపాయలపైన లాభం వస్తుందనీ తెలుసుకొని ముగ్గురూ నివ్వెర పోయారు.

ఎంతెంత దూరాల్నుంచో పొద్దున్నే వచ్చి మళ్ళీ రాత్రి యింటికి చేరుకుంటారు.

ఇళ్ళ దగ్గర అంతులేని సమస్యలు.

చిన్న పిల్లలూ, యింటి చాకిరీ, తాగివచ్చి తన్నే భర్తలూ...

వాళ్ళ జీవితాలు తెలుసుకుంటున్న కొద్దీ అరుణకు యేదో తెలియని ఆవేశం వొచ్చింది.

ఒక కంపెనీ తర్వాత యింకో కంపెనీకి మూడింటి దాకా ఆకలి కూడా మర్చిపోయి తిరిగారు ముగ్గురూ.

వీళ్ళు అన్ని వివరాలూ రాసుకుంటుంటే వొక కంపెనీలో వొకావిడ అడగనే అడిగింది.

''మీకిలా అన్ని వివరాలూ చెబితే మాకేమ న్నా లాభం వుంటుందా'' అని. ముగ్గురికీ యేం మాట్లాడాలో తెలియలేదు. అరుణే అన్నది.

''మీకేం లాభం వుండచ్చో. మా లాభం కోసమే మేం వచ్చాం. ఈ వివరాలన్నిటితో మేమొక పుస్తకం రాస్తే మాకు పెద్ద డిగ్రీ వస్తుంది. మంచి వుద్యోగం వస్తుంది. మా లాభం కోసమే మేమిక్కడికి వచ్చాం''

ఆ అమ్మాయేం మాట్లాడలేదుగానీ వీళ్ళ

వంక చాలా నిరసనగా నిర్లక్ష్యంగా చూసింది.

ఈ వివరాలన్నీ సేకరించి సాయంత్రానికి కృష్ణమూర్తి యిల్లు చేరారు. అక్కడ మిగిలిన వాళ్ళందరూ వీళ్ళ కోసం యెదురు చూస్తున్నారు. అరుణ వుత్సాహంగా తాము చేసిన పనంతా చెప్పింది. యూనివర్సిటీలో రిసెర్చ్ చేస్తున్నామని చెప్పి యెంత తెలివిగా సమాచారం సేకరించుకొచ్చిందీ భారతి వుత్సాహంగా చెప్పింది.

ఆ విషయానికి మిగిలిన వాళ్ళంతా వాళ్ళ తెలివికి అభినందిస్తారని యెదురు చూసిన అరుణ ఆశ్చర్యపోయింది.

ఆ విషయాన్ని మిగిలిన మగవాళ్ళంతా చాలా నిర్లిప్తంగా విన్నారు. అది పెద్ద విషయం కానట్లు దానిని పట్టించుకోకుండా మిగిలిన వివరాలు అడిగారు. వగ్గురూ తాము రాసుకొచ్చిన నోట్సు చూపించారు.

"ఈ సారి యీ విషయం గురించి ప్రధాన వ్యాసం అరుణగారు రాస్తే బాగుటుందేమో" అన్నాడు కృష్ణమూర్తి.

"అమ్మో నేనా నాకూడదు" అంది గుండెల మీద చేయి వేసుకొని నిజంగానే భయపడుతూ!

అరుణ భయం చూసి అందరూ నవ్వారు.

"మీరు తెలుగు లెక్చరరు అయిఉండి తెలుగులో రాయమంటే చిన్నపిల్లల్లా భయపడుతున్నారేమిటి" అన్నాడు కేశవరావు.

"తెలుగు లెక్చరర్నయితే యే నన్నయ గురించో, తిక్కన గురించో పోనీ శ్రీశ్రీ గురించో రాయమంటే రాస్తానుగానీ ఈ విషయం గురించి నేనేం రాయలనండీ"

"మీరు రాయగలరండీ. ప్రస్తుతం పత్రికలో అంతా కృష్ణమూర్తే రాస్తున్నాడు. అట్లా వొక్కళ్ళే రాయటం మంచిది కాదు" అన్నాడు సుబ్బారావు.

"పత్రిక క్షేమం దృష్ట్యా అది మంచిదేనండీ" అంది అరుణ. అందరూ నవ్వారు.

"నిజంగా అది మంచిది కాదండి. కృష్ణమూర్తికి యే జబ్బో చేస్తే పత్రిక ఆగిపోవాల్సిందేనా?" సూర్యనారాయణ అన్నాడు.

"కృష్ణమూర్తిగారికి జబ్బుచెయ్యటం యెందుకుగాని, నేను రాయగలిగింది రాస్తాను. అది పనికొస్తే వేసుకోండి. లేకపోతే మళ్ళీ రాసుకోండి" అంది అరుణ.

అందరూ ఒప్పుకున్నారు.

అరుణ పగలంతా తిరుగుడుతో అలిసిపోయినా ఇంటికి రాగానే పాప అలకతీర్చక తప్పలేదు. అమ్మ ఆలస్యంగా వచ్చిందని అలిగింది పాప. పాప అలకతీర్చి పాలు తాగించి స్నానం చేయించింది. కమలమ్మ గుడికి వెళతానంటే పంపించి, పాపకు కథ చెబుతూ పనంతా పూర్తిచేసింది.

పాప నిద్రపోయాక తాను సేకరించి తెచ్చిన నోట్సు టేబిల్‌మీద కనపడుతుంటే దానివంకే చూస్తూ నిద్రపోయింది.

మర్నాడు ఉదయాన్నే ప్రకాశం ఊరునించి వచ్చాడు.

పెళ్ళి కబుర్లన్నీ ఉత్సాహంగా చెబుతుంటే అరుణకూడా మామూలుగా విన్నది. ప్రకాశం తనుచేసే పనులకు కోపగించుకోవటం, తాను ఆ పనులు చెయ్యటం, కొన్నాళ్ళు ప్రకాశం కోపంగావుండి తర్వాత మామూలవటం ఇవన్నీ తప్పవని అరుణకు అనిపించింది. నెమ్మదిగా దానికే సిద్ధపడుతోంది అరుణ మనసు.

సోమవారం రాత్రి అరుణ రాసుకోవాలని ప్రయత్నించిందిగానీ ప్రకాశం కుదరనివ్వలేదు. పదకొండింటిదాకా ఏవో కబుర్లు చెబుతూనే ఉన్నాడు. అరుణకూడా బద్ధకంగా ఆ కబుర్లు వింటూ నిద్రపోయింది.

మంగళవారం రాత్రి తొమ్మిదిగంటలకు ఆ నోట్సులు ముందేసుకుని కూచుంది అరుణ. ప్రకాశం, పాపా తొందరగా నిద్రపోయారు.

మొత్తం చిందరవందరగాఉన్న విషయాలన్నీ చదివి యే విషయంతర్వాత యే విషయం వస్తే బాగుంటుందో ఆలోచించి ఆప్రకారం ఆ నోట్సులో విషయాలపక్క నంబర్లు వేసుకుని ఒక పద్ధతికి తెచ్చేసరికి పదకొండయింది. అంతసేపు ఒకేవిషయంమీద అంత శ్రద్ధగా కేంద్రీకరించే అలవాటు లేకపోవటంవల్ల అరుణ బుర్ర మరి పనిచెయ్యనని మొండికేసింది.



తలను రెండుచేతుల్లోనూ పట్టుకుని ప్రకాశంవైపు చూస్తే అతను హాయిగా నిద్రపోతున్నాడు. వేడిగా టీ తాగితే బాగుండునని పించింది. మళ్ళీ లేచి టీ పెట్టుకోవాలంటే బద్ధకంగానూ అనిపించింది. ప్రకాశం కాస్త టీచేసి తెస్తే ఎంత బాగుండుననిపించి తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది.

"ప్రకాశం ఇంతశ్రద్ధగా ఒకపనిచేస్తుంటే నన్ను నిద్రపోనిస్తాడూ? అసలు నేను నిద్రపోతానూ? ప్రకాశానికి కావాల్సినవన్నీ అమర్చిపెట్టనూ?

కానీ... ప్రకాశం తనకు అలా చెయ్యాలనుకోవటం దురాశగా కనపడుతోంది.

ఎందుకని?

అది నాకే దురాశగా కనపడేంతగా మామధ్య సంబంధం మారిపోయిందేం?

ప్రకాశం నా విషయాలన్నిటిలో తోడుగా వుంటే - ఆసక్తిగావుంటే ఎంత బాగుంటుంది?

అరుణ నిట్టూర్చింది.

అది జరగదు.

జరగని విషయాన్ని గురించి ఆలోచించి అశాంతి పెంచుకోవటం అనవసరం.

అరుణ లేచి వంటింట్లోకి వెళ్ళి టీ పెట్టుకుని తాగి మళ్ళీ రాతపనిలోపడింది.

మూడవుతుండగా ఆ వ్యాసానికి ఒక రూపంఇచ్చి పడుకుంటే నిద్రపట్టలేదు. రాసిన విషయాలే మనసులో తిరుగుతూ గందరగోళం చేశాయి. ఆ ఆలోచనలతో నిద్రపట్టే సమయానికి పాలుపోసే అబ్బాయొచ్చి తలుపు కొట్టాడు. పాపకూడా లేచి కూచుంది.

అరుణ బద్ధకంగా లేచి మళ్ళీ పనిలోపడిపోయింది.

సాయంత్రం ఆరవుతోంది.

ప్రకాశం రాలేదని ఎదురుచూస్తూ, పాపతో కబుర్లు చెబుతోంది అరుణ.

పాప మాటలకు నవ్వుతూ అరుణపక్కనే కూచుంది కమలమ్మ.

పాప కబుర్లుమాని డాన్సు మొదలెట్టింది. రోజూ టీవీ చూడటంవల్ల పాప డాన్సుఅంటూ గంతులెయ్యటం, అందరూ నవ్వటం మామూలే.

''పాపకు డాన్సు నేర్పించాలత్తయ్యా'' అంది అరుణ పాపవంక మురిపెంగా చూస్తూ.

''డాన్సుకన్నా సంగీతం నేర్పితే మంచిదమ్మాయ్'' అంది కమలమ్మ.

''ఎందుకనీ?''

''డాన్సు నేర్పితే ఇక జీవితమంతా అదే సాధనగా చెయ్యాలమ్మా. ఒకసారి జనంముందు డాన్సు చెయ్యాలంటే ఎంత హడావుడి! ఎంత తతంగం! చాలామంది చిన్నప్పుడు డాన్సు నేర్చుకుని పెద్దయ్యాక ఇక దానిసంగతి మర్చిపోతారు. సంగీతమంటే అది వేరు. మనం ఒక్కళ్లం కూచుని పాడుకున్నా పాడుకోవచ్చు. పాపది మంచి గొంతు. సంగీతం నేర్పించుదామమ్మా''

అరుణ నవ్వుతూ ''మీరు ప్రతి విషయం చాలా బాగా ఆలోచిస్తారత్తయ్యా. మీరు చదువుకుంటే సమాజానికెంత మేలుజరిగేదో'' అంది.

''మనం చదువుకుంటే మనకే మేలు. ఎవరికేం వొరగబెడతాం. సంపాదించుకుంటాం. తింటాం. పొలంచేయించి నేనూ చాలా సంపాదించానమ్మా. ఎంత సంసారాన్ని ఈదాను. చదువుంటే అంతకన్నా ఎక్కువ సంపాయించేదాన్నా''

''సంపాదన అనికాదులే అత్తయ్యా - నలుగురికీ మంచిమాటలు చెప్పి సాయంచేసేవారు.''

''మంచిమాటలు చెప్పటానికి చదవాలేమిటి? సాయంచేసే బుద్ధి ఉండాలి.''

అరుణ యేదో అనబోతున్నంతలో 'అరుణా' అంటూ కేకేస్తూ ప్రకాశం వచ్చాడు. అతని ధోరణిచూసి ఇద్దరికీ నోటమాటరాలేదు.

''పిలుస్తుంటే పలకవేం'' గద్దిస్తున్నట్లే అన్నాడు.

''ఏంటీ?'' మెల్లగా అడిగింది అరుణ. ఆమెకు విషయం కొంత అర్థమైంది.

''నువ్వు పోయిన శనివారం ఎలక్ట్రానిక్ కంపెనీలకు వెళ్ళావా?''

''వెళ్ళాను''

''ఎందుకు?''

''పత్రికకోసం. అక్కడ పనిచేసేవాళ్లగురించి పత్రికలో రాయటానికి''.

''దేశోద్ధారకురాలు బయల్దేరింది. నాతో చెప్పలేదేం? ఒద్దన్నపని ఎలాగూ చేస్తావు. కనీసం చెప్పొచ్చుగా''

''ఆ విషయాలేవీ చెప్పొద్దన్నావుగా''

''ఔను— నామాట తూచా తప్పకుండా పాటించే పరమ పతివ్రతవుగదూ. చెప్పొద్దు అనగానే మానేశావు. మరి వెళ్ళొద్దు అనగానే వెళ్లటం మానెయ్యలేదేం?''

''ప్రకాశం — నువ్వనవసరంగా ఎక్కువ మాట్లాడకు'' అరుణ కోపంగాఅంది.

''ఏంట్రా - ఏంటా చిందులూ శివాలూ'' కమలమ్మ కల్పించుకోకతప్పలేదు.

''మొన్న శనివారం యీవిడగారు వెళ్ళి ఆ కంపెనీలన్నీ తిరిగొచ్చిందట. మా ఫ్రెండొకడు అక్కడ చిన్న కంపెనీ నడుపుతున్నాడు. ఇవాళ వాడు 'మీ ఆవిడిలా వచ్చిందీ - ఎందుకు, ఏమిటి? ఆవిడ తెలుగు లెక్చరర్గదా - ఎలక్ట్రానిక్స్‌మీద రిసెర్చ్ ఏమిటీ' అనడుగుతూంటే నేను వెర్రిముఖం పెట్టుకు నుంచోవాల్సివచ్చింది. నిజంగా నేనో వెధవనైపోయానీ ఇంట్లో''

కమలమ్మకు ఏం మాట్లాడాలో తెలియలేదు

''అరుణా-ఇక ఈ విషయం తేల్చెయ్. నువ్వా తిరుగుళ్ళు, మీటింగులూ మానేస్తావా? లేదా? చెప్పు'' ఇక ఆ విషయం అక్కడే ఆ నిముషానే తేల్చేట్టు మాట్లాడాడు.

అరుణ ఏమీ మాట్లాడలేదు.

''చెప్పు. చెప్పవేం. నేనింక ఈ గొడవలు భరించలేను మానేస్తావా? లేదా?''

చిన్న పిల్లను బెదిరించినట్టు బెదిరిస్తున్న ప్రకాశాన్నిచూస్తూ స్థిరంగా అంది అరుణ.

''మానెయ్యను''

''మానెయ్యవూ—'' ప్రకాశం చెయ్యిపైకి లేచింది.

కమలమ్మ ప్రకాశం చెయ్యి పట్టుకుని, ''చాల్లే ప్రతాపం— ఫో అవతలికి'' అని ప్రకాశాన్ని గదిలోకి నెట్టింది.

బిక్కచచ్చినట్లు నిలబడిన పాప నెత్తు

కుంది.

"అమ్మాయ్-నీక్కూడా అంత పంతం పనికి రాదు. వాడికిష్టంలేని పనులు చెయ్యటమెందుకూ? ఈ గోలంతా ఎందుకు?" అరుణ కమలమ్మ మాటల్ని వినిపించుకోకుండా అక్కడే కూలబడింది.

"కొట్టటానికి సిద్ధమయ్యాడు.

అతని కిష్టంలేని పనిచేస్తే కోపగించుకుంటాడు. తిడతాడు, కొడతాడు.

ఎట్లాగైనా ఆ పని మాన్పించాలని చూస్తాడు.

తిట్టనీ కొట్టనీ, తానుమాత్రం ఆ పని మానదు.

ఇదెక్కడికి దారి తీస్తుంది?

ప్రకాశాన్నిక తాను ప్రేమించగలదా?

ఇవన్నీ మానెయ్య గలదేమో—

అతను చెప్పినట్లు వినగలదేమో—

స్వేచ్ఛ లేకుండా బతకగలదేమో—

కానీ ప్రకాశాన్ని మాత్రం ప్రేమించలేదు-" అరుణకు దుఃఖం గుండెల్లోంచి తన్నుకొచ్చింది.

అరుణ ఏడుస్తుంటే కమలమ్మ విసుక్కుంది.

"చిన్నపిల్లముందు ను వ్వేడిస్తే ఎలా! చూడూ, ఇది ఎలా బిక్కముఖం పెట్టిందో లే-లేచి దీనికి అన్నంపెట్టు" అంటూ అరుణను లేవదియ్యబోతే అరుణ ఆమె చెయ్యి విడిపించుకుంది.

"మీరు పెట్టండత్తయ్యా" అని లేచివెళ్ళి గదిలో పాప మంచంమీద పడుకుంది.

అరుణ గదిలోకి రాగానే ప్రకాశం బైటకెళ్ళిపోయాడు.

అరుణ ఆలోచనలు లేకుండా పిచ్చి పట్టినట్లు ఏడ్చి ఏడ్చి ఎప్పటికో నిద్రపోయింది.

వారం గడిచినా ప్రకాశం అరుణతో మాట్లాడలేదు. అరుణా ప్రకాశాన్ని పలకరించలేదు.

ఈ మౌనం ఎప్పటికి ఎట్లా తెగుతుందా అని ఎవరికి వారు మనసులో మధనపడుతున్నా పైకి మామూలుగానే ఎవరి పనులు వాళ్ళు చేసుకు పోతున్నారు.

అరుణ తప్పు వొప్పుకుంటే క్షమించటానికి సిద్ధంగా ఉన్నాడు ప్రకాశం. కొన్ని ఆలస్యంగానైనా తప్పు వొప్పుకుంటుందనే నమ్మకంతో కూడా ఉన్నాడు.

అరుణ మనసు నిరామయంగా ఉంది. ప్రకాశంమీద తనకు ప్రేమలేదు. పోయింది అన్న విషయం స్పష్టం చేసుకోవటమే పని అన్నట్లుగా ఆ విషయం గురించి ప్రతి నిమిషం ఆలోచిస్తోంది.

ప్రకాశం తనని ప్రేమించాడంటే తన శరీరాన్ని ప్రేమించాడు.

తను కోరుకున్న స్వేచ్ఛ అతనికి అర్థం కాలేదు.

తన కిష్టమైన విషయాల పట్లా, తన అభిప్రాయాల పట్లా అతనికి గౌరవంలేదు.

అతన్ని తానెట్లా ప్రేమిస్తుంది?

కానీ తను అసలు ప్రకాశంలో ఏంచూసి ప్రేమించింది?

అప్పటికి తనకుమాత్రం ఏం అభిప్రాయాలున్నాయి.

ప్రకాశం తనని ప్రేమిస్తున్నాడు అన్న విషయాన్ని తాను ప్రేమించింది.

తాను ప్రకాశాన్ని ప్రేమించలేదు.

ప్రకాశం ప్రేమను ప్రేమించింది.

ప్రకాశాన్ని ప్రేమించటానికి తనకు ప్రకాశం గురించి ఏమీ తెలియదు.

సరదాగా కబుర్లు చెప్పుకోవటం, సినిమాలకూ షికార్లకూ తిరగటంతప్ప ప్రకాశానికి జీవితం గురించిఉన్న అభిప్రాయాలు తనకు తెలియవు.

అలాగే ప్రకాశానికీ తన గురించి ఏమీ తెలియదు.

మా ఇద్దరిదీ ప్రేమకాదు.

అసలెప్పుడూ మేం ప్రేమించుకోలేదు,

వెయ్యి రకాలుగా ఈ విషయాన్ని మనసులో తిప్పుతూ చిత్రహింస పడింది అరుణ.

అరుణ రాసిన వ్యాసం 'వెలుగు" పత్రికలో వచ్చింది.

చాలా నిర్లిప్తంగా ఆ వ్యాసాన్ని చూసింది.

దీన్నిచూసి ప్రకాశం సంతోషించడు.

ఇది ప్రకాశానికి అర్థంకాదు. అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యడు.

ఈ రచన తానెంత ఉత్సాహంగా రాసిందీ, ఇది రాసేప్పుడు తనలో జీవశక్తి ఎంత వేగంగా ప్రవహించిందీ, తనకెంత తృప్తి కలిగిందీ—ఇవేవీ ప్రకాశానికి అర్థంకావు.

ప్రకాశాన్ని తానెట్లా ప్రేమించ గలుగుతుంది?

ఈ ధోరణిలో అరుణకు పిచ్చెక్కి పోతోంది.

లైబ్రరీలో పుస్తకమయితే కళ్ళముందు ఉంది. గానీ ఆ పుస్తకంలోని ఒక్క అక్షరంకూడా అరుణ మెదడులోకి ఎక్కడంలేదు.

కేశవరావు తన దగ్గరకు రావటంచూసినా ఏమీ చలనం లేకుండా అలాగే కూచుని ఉంది.

కేశవరావు 'వెలుగు' పత్రిక అరుణకు యిచ్చాడు.

''అరుణగారూ, ఆదివారం పత్రికగురించి సమీక్షించుకుందాం వస్తారుగా'' అన్నాడు.

అరుణ సమాధానం చెప్పకుండా వెర్రిగా కేశవరావు ముఖంలోకి చూస్తూ వుండిపోయింది.

''అరుణగారూ, యేంటలా వున్నారు? వొంట్లో బాగాలేదా?''

అరుణ హఠాత్తుగా అంది.

''కేశవరావుగారూ, యివాళ మీ ఇంటికి వస్తానండీ''.

కేశవరావు ఆశ్చర్యపడి, వెంటనే తేరుకుని ''అలాగే రండి. తప్పకుండా రండి. సాయంత్రం వెళదాం'' అంటూ క్లాసుకి వెళ్లిపోయాడు.

అరుణకు యేదో ఆలోచించాలని వుంది గానీ యేమీ ఆలోచించకుండా పుస్తకంవంకే చూస్తూ కూచుంది. కాలేజీ అయ్యాక కేశవరావు కోసం చూస్తే కనిపించలేదు. ఇంటికి తీసికెళ్తానన్న విషయం మర్చిపోయాడేమోననుకుని డల్‌గా యింటికెళ్ళింది.




మర్నాడు కేశవరావు అసలా విషయమే ఎత్తకపోయేసరికి ఆశ్చర్యమనిపించింది. ఈ మనిషికింత మతిమరుపేమిటనుకుంటూ మళ్ళీ తనే అడిగింది.

''నిన్న మీ యింటికి తీసికెళ్తానని ముందే వెళ్ళిపోయారేం?''

''ఏదో పనిలోపడి మర్చిపోయానండీ-సారీ'' కాస్త తడబడుతూ క్షమాపణ చెప్పినట్లు చెప్పాడు కేశవరావు.

''ఫరవాలేదులెండి. ఇవాళ వెళదాం'' అంది అరుణ.

సాయంత్రం కేశవరావు అరుణని ఆటోలో తనింటికి తీసికెళ్ళాడు. బస్‌లో వెళ్దామన్న అరుణమాట విన్పించుకోలేదు. ఆటోదిగి లోపలకు వెళ్తూనే ''ఏమే-ఇదిగో నిన్నే- ఏం చేస్తున్నావు'' అంటూ ఓ కేకపెట్టాడు.

సమాధానంగా లోపల గదిలోంచి ఒకావిడ బయటకొచ్చింది.

''ఈవిడే మా ఆవిడ'' నీరసపు నవ్వొకటి నవ్వాడు. ఆవిడ నమస్కారం చేసింది.

కేశవరావు భార్యని పేరుతో ఎందుకు పిలవలేదా అనుకుంటూ ''మీ పేరేమిటండీ'' అంది అరుణ.

''మురళీ అండీ'' అందావిడ సిగ్గుపడుతూ.

''ఎంత చక్కనిపేరండి'' అంది అరుణ చటుక్కున.

ఆవిడ యింకాస్త సిగ్గుపడింది.

''ఈవిడ అరుణగారు. మాకాలేజీలో లెక్చరరు'' అని అరుణను పరిచయం చేశాడు.

'కూచోండి' అంటూ అరుణను కూచోబెట్టి

ఆవిడ వంటింట్లోకి వెళ్ళింది.

అరుణ కాసేపు మౌనంగా కూచుని "ఆవిడ ఏదో చేస్తున్నట్లున్నారు, వద్దని చెప్పండి" అంది.

"ఏం చేస్తుంది. కాసిని టీ పెడుతుంది" అని "ఇదిగో టీ కాసేపాగి పెడుదువుగానిలే, యిలారా" అని పిల్చాడు.

మళ్ళీ 'యిదిగో' అన్న పిలుపువిని అరుణ ఆశ్చర్యపోయింది.

"నేవెళ్తాలెండి" అంటూ కేశవరావు వారిస్తున్నా వినకుండా వంటింట్లోకి నడిచింది.

మురళి టీ పెడుతున్నదల్లా వెనక్కు తిరిగి "అయ్యో మీరొచ్చారేమిటండీ- అయిపోయింది. నేవస్తూనే వున్నా" అంటూ హడావుడి పడింది.

"వంటిల్లు చక్కగా సర్దుకున్నారు. ఎంత శుభ్రంగా వుంచారో! మీ డ్రాయింగురూంకీ వంటింటికీ తేడా లేకుండా వుందండి" అంది అరుణ.

"దానికి చేతనైన పని అదేగా. అదికూడా చెయ్యకపోతే ఆవిడెందుకంటా" అన్నాడు వెనకగా వచ్చిన కేశవరావు.

అరుణ విచిత్రంగా కేశవరావువంక చూసిందిగానీ అతనాచూపు పట్టించుకోలేదు.

"పదండి. నే తెస్తున్నా" అంది మురళి.

"రండి" అన్నాడు కేశవరావు.

ముగ్గురూ టీలు తాగుతుండగా కేశవరావుని ఎవరో పిల్చారు. ఇప్పుడే వస్తానంటూ సగం తాగిన కప్పు వదిలేసి వెళ్ళాడు కేశవరావు.

"ఇదేవరసండీ- పదినిముషాలు కూడా తీరిగ్గా యింట్లో కూర్చోరు" నొచ్చుకుంటూ కప్పు మీద మూతపెట్టింది మురళి.

"ఆయన చాలా మంచిపనులు చేస్తారు గదండీ" అంది అరుణ మెచ్చుకోలుగా.

"ఏం పనులు చేస్తారండీ" ఆసక్తిగా అడిగింది మురళి.

అరుణ ఆశ్చర్యంగా మురళివంక చూసింది. మురళి ముఖంలో నిజాయితీతోకూడిన ఆసక్తితప్ప నవ్వే, వేళాకోళమో కనిపించలేదు.

"ఆయనేం చేస్తారో మీకు తెలియదా?"

"నిజంగా తెలియదండి. ఆయన నాకేం చెప్పరు"

మురళి ముఖం చూస్తుంటే అరుణకు ఏమీ అర్థంకాలేదు.

"పత్రిక సంగతి తెలియదూ? మీరు 'వెలుగు' పత్రిక చూడటంలేదూ?"

"ఏం పత్రికండీ?" మురళి అమాయకంగా అడుగుతుంటే అరుణ నమ్మలేనట్లుగా చూసింది.

బాగ్‌లోనుంచి పత్రికతీసి మురళికి యిస్తూ "ఈ పత్రిక మీరు చూడలేదూ?" అనడిగింది.

"లేదండీ"

"కేశవరావుగారు యీ పత్రిక యింటికి తీసుకురాలేదా?"

"తెలియదండీ. ఆయన కాగితాలూ, పుస్తకాలూ అన్నీ ఆ బీరువాలో పెట్టి తాళం వేస్తారు. పిల్లలు పాడుచేస్తారనీ, ఎవరన్నా తీస్తారనీ అందులో పెట్టారేమోనండి"

"ఈ పత్రికపనంతా కేశవరావుగారే చూస్తున్నారు" అంతకంటే ఏంమాట్లాడాలో తెలియలేదు అరుణకు.

"మీరు పుస్తకాలు చదవరా?" కాసేపాగి అడిగింది అరుణ.

"నాకు తీరిక దొరకదండీ. పైగా అంత చదవాలనీ వుండదు. ఇంటిపనీ, పిల్లలపనే సరిపోతుంది. ఉదయం ఆయన కాలేజీకి వెళ్ళే దాకా ఆయనవెంట వెంటనే తిరగాలి. ఆయనకు ఎప్పుడేం కావాలో అది చేతికందకపోతే తగనిచిరాకు."

"కేశవరావుగారు మీకేం సాయం చెయ్యరా?"

"సరే-ఆయన సంగతి మీకు తెలియదు ఇటు పుల్లతీసి అటు పెట్టరు. కొంతమం మగాళ్ళు ఎంతపని చేస్తారో. ఈయనకి బ్ర మీద పేస్టెయ్యటం దగ్గర్నించీ నేను చెయాల్సిందే. కనీసం బజారునుంచి సరుకులనా తెచ్చివ్వరు. సమస్తం నేతెచ్చుకోవాల్సిం మళ్ళీ దేనికీ లోటు వుండగూడదు. ఇవా పొద్దున నబ్బాయిపోయింది. మధ్యాహ్నం తె

ను, నున్నిపిండితో చేసెయ్యండీ అని కాస్త వళ్ళెంలో వేసిచ్చాను. ఇక చూసుకోండి! ఆ నున్నిపిండంతా నేలమీద పోసి నా నిర్లక్ష్యానికి నానాచివాట్లూ పెట్టి వట్టినీళ్ళు గుమ్మరించుకొని వెళ్ళారు.''

మురళి ఈ విషయాలన్నీ మురిపెంగానే చెబుతోంది. కేశవరావుని విమర్శిస్తున్నట్టు గా కుండా కేశవరావు లీలలగురించి తన్మయత్వంతో మాట్లాడుతున్నట్టే చెబుతోంది.

అరుణ తల తిరిగిపోయింది.

కేశవరావు నచ్చలేదని భార్యను తిడతాడు. కొడతాడు కూడానేమో. ఆ వూహకే వులిక్కిపడింది.

అంతలో కేశవరావు వచ్చాడు.

''ఏంటీ, బాగా బోరుకొడుతున్నట్టున్నావు ఆవిడకు'' అని మురళిని కసిరాడు.

''ఈవిడ మన పత్రికే చూడలేదంటున్నారు'' అరుణ వుండబట్టలేక అన్నది.

''దానికవన్నీ పట్టవులెండి. ఎంతసేపూ వంటగదిలో కూచోమంటే కూచుంటుంది.'' కేశవరావు నిర్లక్ష్యంగా అన్నాడు.

అతని ధోరణి అరుణకు చాలా చిరాకనిపించింది. ''నే వెళ్తానండీ.'' అంటూ లేచింది.

''అదేంటి అప్పుడే-మా పిల్లల్ని చూడకుండానే''

''ఔనూ-మీ పిల్లలేరి?'' పిల్లల్ని గురించి అడక్కుండా కూచున్నందుకు తిట్టుకుంటూ అంది అరుణ.

''ఆటలకని గ్రౌండుకెళ్లారు. వచ్చే వేళయింది'' అంది మురళి.

''ఈసారి వచ్చినపుడు చూస్తాలెండి. నాకిప్పుడు పనుంది. వెళ్ళాలి'' అంటూబయల్దేరింది అరుణ.

కేశవరావు మళ్ళీ ఆటో పిల్చి ఆటో అతనికి డబ్బులు కూడా యిచ్చి అరుణను యెక్కించాడు.

ఇంట్లో అశాంతిని భరించలేక, ఆదర్శంగా వుండే వాతావరణంలో కాసేపు గడపాలనే కేశవరావు యింటికి వెళ్ళింది అరుణ.

కేశవరావు భార్యను గౌరవంగా చూస్తాడనీ..

భార్యాభర్తలిద్దరూ అనేక విషయాల గురించి మాట్లాడుకుంటారనీ...

కేశవరావు పత్రిక కోసం చేస్తున్న పని చూసి ఆవిడ గర్వపడుతుందనీ...

వాళ్ళిద్దర్నీ చూసి తను శాంతి పొందవచ్చనీ....

ఈ ఆలోచనలన్నిటితోనూ అరుణ కేశవరావు యింటికి వెళ్ళింది.

ఇవన్నీ యిలాగే వుంటాయని అరుణకెంత నమ్మకమంటే యిప్పుడు జరిగిన విషయాల్లో యే వొక్కటైనా జరగొచ్చనే అనుమానమే రాలేదు.

'కేశవరావుకి భార్యంటే గౌరవంలేదు.

భార్యని పేరుపెట్టి పిలవడు.

ఇతరుల దగ్గరకూడా 'అదీ, యిదీ' అంటాడు.

అతను చేసే పనుల గురించి భార్యకేమీ చెప్పడు.

భార్య చేత సేవలు చేయించుకుంటాడు.

ఆ సేవల్లో లోపం జరిగితే తిడతాడు.

కొడతాడు కూడా నేమో...'

అరుణకు వూపిరాడనట్లనిపించింది. ఎలా కుదురుతుంది?

బైట జరిగే అన్యాయాల గురించి అంత ఆరాటపడే వాడు భార్య గురించి యెందుకు ఆలోచించడు?

భార్యకవన్నీ యెందుకు చెప్పడు?

ఆవిడ నెందుకు మీటింగులకి తీసుకురాడు?

ఆవిడ కిష్టంలేక రాకపోతే అది వేరే నంగతి- కానీ అతను చేస్తున్న పని గురించి ఆవిడకు చెప్పకపోవటం, అతని అనుభవాలు పంచుకోకపోవటం యెంత అన్యాయం!

ప్రపంచాన్ని గురించీ మనుషుల గురించీ తెలుసుకోవటం చాలా బాగుంటుందని కేశవరావు అన్నమాట గుర్తొచ్చింది అరుణకు.

అతనికి ప్రపంచం కావాలి గాని అతని భార్యకు మాత్రం అతను తప్ప వేరే ప్రపంచం లేదు...అనుకుంటే కేశవరావు మీద ఉన్న గౌ

రవం పోయిందనిపించింది.

'ప్రకాశం తనకు బైటి ప్రపంచం వుండొద్దంటాడు.

కానీ...

అదే సమయంలో అతను కూడా భార్యాపిల్లలూ తప్పవేరే ప్రపంచం లేకుండా గడుపుతానంటున్నాడు.

కేశవరావు ప్రకాశం కంటే అన్యాయంగా వున్నాడు. అతనికేమో ప్రపంచమంతా కావాలి. భార్యకు మాత్రం అతనే ప్రపంచం.

ఎంత అన్యాయం?

అరుణ మనసు వుడికి పోయింది.

మిగిలిన వాళ్ళంతా అంతేనా?

కాకపోతే తమ భార్యల్ని యెందుకు యీ పనిలోకి రానివ్వరు?

తన లాంటి వాళ్ళని ఒప్పించి యీ పనిలోకి దించిన వీళ్ళు భార్యల్ని వొప్పించలేరా?

పోనీ కనీసం భార్యల్ని గౌరవంగా చూడలేరా?

ఆదివారంనాడు మీటింగుకి వెళ్ళబుద్ధికాలేదు అరుణకు.

శనివారం రాత్రి కమలమ్మ పప్పునానబెట్టబోతుంటే "రేపు మీటింగుంది అత్తయ్యా. పెందలాడే వంట చేసేస్తాను. టిఫిన్ పని వొద్దులే" అని చెప్పింది.

కమలమ్మ "ఏం మీటింగులో యింట్లో రావణకాష్టం వెలిగించుకుని" అని గొణుక్కుంది.

ప్రకాశం కోపం పట్టలేక చేతిలోవున్న గ్లాసు గిరాటేసి వెళ్లాడు. అరుణ వాటినేమీ పట్టించుకోలేదు. కానీ తీరా వుదయం లేచాక, మీటింగుకి వెళ్ళి కేశవరావు మాటల్ని విని యెప్పటిలా ఇన్స్పైయిర్ అవలేననిపించింది.

'అవన్నీ వుత్తమాటలు. నిజాయితీలేదు. తనకాపని యిష్టమోలేక అవని చేస్తూ దేశాన్ని వుద్ధరిస్తున్న తృప్తి పొంది మిగిలిన వాళ్ళకంటే గొప్పవాడిననుకుంటాడో- అంతేగాని నిజంగా అతనికి ఆర్తిలేదు. ఉంటే భార్యనలా చూడడు. ఇన్ని విషయాలు తెలిసిన అతనికి భార్యని మనిషిలా చూడాలని తెలియదా? అతని అసలు స్వభావం భార్యదగ్గరే బైటపడుతోంది'

ఈ ఆలోచనలతో అరుణ పని ముగించి స్నానం చేసి పాపకు అన్నం పెట్టింది.

ప్రకాశం కూడా కమలమ్మచేత అన్నం పెట్టించుకొని తిన్నాడు. పుస్తకమేదో పట్టుకొని హాల్లో సోఫామీద పడుకున్నాడు.

అరుణ భోజనం చేసి పాపకు కథలు చెప్పి నిద్రపుచ్చి తానూ అలాగే పడుకుంది.

అరుణ మీటింగుకి వెళ్ళనందుకు ప్రకాశం కమలమ్మా యిద్దరూ సంతోషించారు.

అరుణ మారుతుంది. తప్పక మారుతుంది అనుకుంటే ప్రకాశానికి మనసంతా తేలిక పడింది.

అరుణకీ పిచ్చి వొదిలి తామిద్దరూ హాయిగా కాలం గడిపే రోజులు తల్చుకుంటే ప్రకాశానికి హుషారొచ్చింది. అరుణకి యీ పిచ్చి వొదిలితే చాలు. ఎంతో అపురూపంగా చూసుకుంటాడు. గుండెల్లో పెట్టుకుంటాడు. అప్పటికప్పుడు అరుణని దగ్గరకు తీసుకోవాలనిపించి బలవంతాన ఆ కోరిక అణుచుకున్నాడు. హాల్లోకీ గదిలోకీ కాలుగాలిన పిల్లిలా తిరుగుతుంటే అతనికి హఠాత్తుగా గుర్తొచ్చింది.

అది ఆగస్టు నెల. ఆవేళ పదకొండో తారీకు. ఇంకో నాలుగురోజుల్లో వాళ్ళపెళ్ళి రోజు.

"అరుణా" మరో ఆలోచన లేకుండా గదిలోకి వెళ్లాడు.

అరుణ నమ్మలేనట్లుగా ప్రకాశం వంక చూసింది.

నెలరోజులయింది ప్రకాశం అరుణా అని పిల్చి. పిచ్చిగా తన వంకే చూస్తున్న అరుణని చూస్తే జాలి ముంచుకొచ్చింది ప్రకాశానికి.

"అరుణా—ఆగస్టు పదిహేను నాలుగు రోజులే వుంది. ఇవాళ పదకొండు"

అరుణకు ఒక్కసారిగా దుఃఖం ఉబికి వచ్చింది.

అరుణ ఏడుస్తుంటే ప్రకాశం పక్కన కూచుని వోదార్చాడు.

"అరుణా, ఇద్దరం తొందర పడ్డాం. ఇ




యీ వంతాలొద్దు. నువ్వు మాట్లాడకపోతే నాకు పిచ్చెక్కినట్లుగా వుంది. లే—అరుణా—ఊరుకో'' అరుణ తలమీద ముద్దు పెట్టుకొంటూ వొళ్ళోకి లాక్కున్నాడు.

అరుణ లేవబోతుంటే గట్టిగా పట్టుకున్నాడు. అరుణ మెదడంతా ఖాళీగా శూన్యంగా వుంది. అరుణ శరీరం ప్రకాశం స్పర్శకు పులిక్కిపడుతోంది.

జరిగిన దానికి సంతోషించాలో విచారించాలో కూడా తెలియనంతగా మొద్దుబారిపోయింది అరుణ మనసు.

నెల రోజుల నుండీ ప్రకాశం అంటే ప్రేమ లేదన్న విషయాన్ని పెంచి పోషించిన మనసు— ఇవాళ ప్రకాశం కౌగిలిలో నలుగుతున్న శరీరాన్ని చూసి యేం చెయ్యాలో తెలియక నిశ్శబ్దంగా వూరుకుంది.

మర్నాడు ఉదయం ప్రకాశం హుషారుగా లేస్తే అరుణ లేవకుండా అలాగే పడుకుంది. లేవాలనిపించలేదు.

కాసేపు చూసి కమలమ్మా ప్రకాశం యిద్దరూ వచ్చారు. ఒంట్లో బాగోలేదని చెప్పి మళ్ళీ పడుకుంది. ప్రకాశం లీవ్‌లెటరు రాసి సంతకం పెట్టించుకు వెళ్ళాడు.

కమలమ్మ బలవంతంగా టీ తాగించి వెళ్ళింది. టీ తాగి మళ్ళీ అలాగే పడుకుని పన్నెండు గంటలకు లేచింది. ఒళ్ళంతా చికాగ్గా వుంటే స్నానం చేసింది. పావ అన్నంతిని నిద్రపోతోంది. కమలమ్మ బలవంతం మీద అన్నం తిన్నాననిపించి వాకిట్లోకి వచ్చింది అరుణ. కడుపులో తిప్పుతున్నట్లుంటే యెదురుగా ఉన్న పాన్‌షాప్‌లో వక్కపొడి కొనుక్కుందామని వాకిట్లోకి వచ్చింది. ఎదురుగా కృష్ణమూర్తి.

''ఇదా మీ యిల్లు'' అంటూ వెళ్తున్న వాడల్లా ఆగాడు.

''ఔను యిదే! మీరిటు వచ్చారేమిటి?'' అంది.

''లాయర్‌గారితో పనుండి వచ్చాలెండి. లాయర్‌గారింటి యెదురిల్లే మీదని నాకు తెలియదు. మీరు కాలేజీకి వెళ్ళలేదా?''

కృష్ణమూర్తి అన్ని మాటలు మాట్లాడు

తుంటే నవ్వొచ్చింది అరుణకు.

"శలవు పెట్టాను. రండి యింట్లోకి" అంటూ లోపలికి నడిచింది.

"నిన్న మీటింగుకి మీరెందుకు రాలేదూ?" నంజాయిషీ కోరుతున్నట్టుగా వుందతని ధోరణి.

"ఒంట్లో బాగాలేదండి. అందుకని" తప్పు చేసి వొప్పుకుంటున్నట్టుగా చెప్పింది అరుణ.

"ఇప్పుడెలా వుందీ? అందుకేనా కాలేజీకి శలవు పెట్టారూ?"

"ఔనండి. మీటింగు విశేషాలేమిటి?" వొద్దనుకుని కూడా ఆ ప్రశ్న అడక్కుండా వుండలేక పోయింది.

"మీ వ్యాసం గురించి పొగడటంతోనే సరిపోయింది. చాలా బాగా రాశారు. నేనేదో విషయం రాస్తాను గానీ, మీరు చదివే వాళ్లకు ఆసక్తి కలిగేలా మంచి భాషలో రాశారు. నా మటుకు నాకు చాలా నచ్చింది"

కృష్ణమూర్తి తన రచనను మెచ్చుకుంటుంటే అరుణకు యెంత నిగ్రహించుకుందామన్నా సంతోషం ఆగలేదు. ముఖమంతా వెన్నెలలా సంతోషం పాకి వింత కాంతితో వెలిగింది. నిన్నటి నుంచీ వున్న దిగులూ, నీరసం, నిస్సత్తువా అన్నీ మాయమై రక్తంలోకి కొత్త ఉత్సాహమేదో వచ్చినట్లయింది.

కృష్ణమూర్తి తన రచనను మెచ్చుకున్నాడు. అతను మొహమాటానికి చెప్పే మనిషికాదు. అందరికీ అతని అభిప్రాయాలంటే యెంతో గౌరవం.

అతనికి నచ్చేలా రాయగలిగి నందుకు అరుణకు చాలా సంతోషమనిపించింది.

"ఈసారి పత్రిక యే విషయం గురించి తీసుకు రావాలనుకుంటున్నారు?" తన ప్రమేయం లేకుండానే అడిగింది.

"మెహందీ గురించండీ—"

"మెహందీ గురించా?" నమ్మలేనట్లుగా అంది అరుణ.

"ఔను మీరు మొన్న పేపర్లో చూడలేదా. పోలీసులు కొడుతున్నారనీ, హింసలు పెడుతున్నారనీ మెహందీ వాళ్ళంతా పోలీస్ స్టేషన్ ముందు ధర్నా చేశారు గదా. మనం వెళ్ళి వాళ్ళ విషయాలన్నీ కనుక్కొని పత్రిక తీసుకొద్దాం"

మెహందీ స్త్రీల దగ్గరకు వెళ్ళి మాట్లాడి వాళ్ళ గురించి రాయటం అరుణకు యెలాగో అనిపించింది.

కృష్ణమూర్తి వెళతానంటూ లేచాడు. అరుణ కూడా లేచింది. ఎవరితోనన్నా యీ విషయం చెప్పాలనిపిస్తోంది అరుణకు.
మెహందీకి వెళ్ళటం. వాళ్లతో మాట్లాడటం — చాలా కుతూహలంగా ఆసక్తిగా అనిపించింది.

'ఐనా తనీ మీటింగులకి వెళ్ళొద్దనుకుంది గా—'

కేశవరావు గుర్తొచ్చాడు.

కేశవరావు భార్యని సరిగా చూడకపోతే తాను పత్రిక పనినుంచి తప్పుకోవటం కరెక్టేనా? ఏవిషయమూ యెవరితో మాట్లాడటానికి లేదు. ఎవరితోనన్నా తన సందేహాలు చెప్పుకొని సలహా అడిగితే బాగుండుగానీ యెవరూ లేరు. కేశవరావుతో చెప్పుకోవచ్చునుకుంటే అతని స్వభావం బైటపడింది. కృష్ణమూర్తితో అంత పరిచయం లేదు. పైగా అతను ఈ విషయాలన్నిటికీ అతీతుడిలాగే ఉంటాడు.

ఉమ ఉత్తరం రాయలేదెందుకనీ?

ఉమతో యివన్నీ చెబితే? తనతో మాట్లాడితే బాగుంటుంది. ఉత్తరంలో యివన్నీ రాయటం కుదరదు. ఉమని రమ్మని వెంటనే ఉత్తరం రాయాలి. నాలుగురోజులు నువ్విక్కడ ఉండాలి. నీతో మాట్లాడాలి. చాలా అవసరం అని రాస్తే ఉమ తప్పకుండా వస్తుంది. అన్ని విషయాలూ ఉమతో మాట్లాడితేగాని తన మనసు తేలికపడదు.

తన సమస్యలన్నిటికీ యేదో పరిష్కారం దొరికినట్లే నిట్టూర్చింది. సాయంత్రం ప్రకాశం కొత్తబట్టలు తీసుకుని హుషారుగా వచ్చాడు.

"ఇద్దరంకలిసి వెళ్ళి కొంటే బాగుండేది గాని నీకుబాగోలేదుగా బజారుకి రాలేనంటావేమోనని నేనే తెచ్చేశా. రెండు రోజుల్లో కుట్టించాలి గదా- చూడు నీకునచ్చాయా?"

ప్రకాశం ఉత్సాహంగా చూపిస్తుంటే నిర్లిప్తంగా చూసింది. అన్నీ బాగున్నాయని చెబితే ప్రకాశం గర్వపడ్డాడు. పాపకొత్తబట్టలుచూసి గంతులేస్తుంటే అరుణకు నవ్వొచ్చింది. పాపను దగ్గరకుతీసుకుని ముద్దుపెట్టుకొంటుంటే?

"అమ్మా జ్వరం తగ్గిందా?" అనడిగింది పాప.

పొద్దుట్నుంచీ తనకు జ్వరంగా వుందనీ, తనని విసిగించకూడదనీ దూరదూరంగా తిరిగిన పాపను చూస్తే అరుణకు గుండెల్లోంచి ప్రేమ పొంగింది.

'తగ్గిపోయిందమ్మా' అంది పాపను గుండెలకు హత్తుకుంటూ.

"అయితే కథచెప్పవా?" ఆశగా అడిగింది పాప.

"ఇప్పుడా? పని చేసుకోవద్దూ?"

"ఎప్పుడూ పనే- కమలమ్మ చేస్తుందిలే" అన్న పాపమాటకు ముగ్గురూ నవ్వుకున్నారు.

ప్రకాశం బట్టలు టైలర్‌కిచ్చి వస్తానని వెళ్లాడు. అరుణ పాపకు కథలు చెబుతూ పడుకుంది.

మర్నాడు కాలేజీకి వెళ్లింది.

కేశవరావు పలకరించాడు. ముక్తసరిగా మాట్లాడి తనటేబిల్ దగ్గరికెళ్ళి కూచుంది.

"నిన్న కేశవరావుగారు రెండుమూడు సార్లడిగారు. అరుణగారెందుకు శలవండీ అని. మాకేంతెలుసు- తెలిస్తే మీకే తెలియాలిగాని మాకేం తెలుస్తుదండీ అన్నాం మేం"

అదేదేజోక్ అయినట్లు పెద్దగా నవ్వింది విమలకుమారి.

మిగిలిన వాళ్ళంతా ముసిముసినవ్వులు నవ్వారు.

కేశవరావూ తానూ కొంత సన్నిహితంగా వుండటం వీళ్ళందరికీ వేళాకోళంగా, సహించరానిదిగా వుందని అరుణకు తెలుసు. కేశవరావు యేదన్నా మాట్లాడటానికి వస్తే అందరూ రెప్పవాల్చకుండా వాళ్లవంకే చూస్తారు. చెవులు రిక్కించి వింటారు.

"నాలుగురోజులు నేనూ కేశవరావూ వుదయంనుంచీ సాయంత్రం దాకా యిక్కడే నెమ్మదిగా మాట్లాడుకుంటూ కూచుంటే వీళ్లలో కొందరిచెవులు అయిదారు అంగుళాల పొడవు సాగుతాయి, అనుకుని నవ్వుకునేది అరుణ. ఎంత నవ్వుకున్నా పట్టించుకోకుండా వుందామన్నా వాళ్ళచూపులు వొక్కోసారి కంపరం పుట్టేలా వొంటికీ మనసుకీ తగుల్తూనే ఉండేవి.

తన గురించి వీళ్లందరూ చెడ్డగా అనుకుంటున్నారా అన్న అనుమానం అప్పుడప్పుడూ మనసులోకి వచ్చి అశాంతి రేపేది.

అనుకొంటే అనుకున్నారు అని పూర్తిగా వాళ్లను తీసెయ్యలేకా, వాళ్లమాటలకూ చూపులకూ విలువిచ్చి కేశవరావుతో మాట్లాడటం మానెయ్యలేకా నలుగుతుండేది అరుణ.

'నామంచితనాన్నీ శీలాన్నీ జడ్జి చెయ్యటానికి కూచున్నట్టు కూచుంటారు వీళ్ళెవరసలు- నామీద వీళ్ల అధికారాలేమిటి' అనుకుని కోపం తెచ్చుకునేది. తన భయమే, తన అశాంతే వాళ్లకా అధికారాన్నిస్తోందని అరుణకి మధ్యే అర్థమవుతోంది.

ఇవాళ కేశవరావంటే కూడా కోపంగా వుందేమో వీళ్ళుఅన్న మాటలకు చిర్రెత్తుకొచ్చింది. బలవంతాన నిగ్రహించుకుని మాట్లాడకుండా కూచుంది.

తరవాతి రోజుకూడా అరుణ కాలేజీలో కేశవరావుతో మాట్లాడకుండానే గడిపింది. మూడు గంటలకు కాలేజీలో క్లాసు తీసుకుని వొచ్చేసరికి డిపార్టుమెంటులో కేశవరావూ, కృష్ణమూర్తీ, సుజాతా, భారతీ కూచుని వున్నారు. అరుణను చూస్తూనే 'రండి' అంటూ కేశవరావు బైటికి నడిచాడు. అందరూవెళ్ళి లైబ్రరీ ముందున్న అశోకచెట్టుకింద నిలబడ్డారు.

"అరుణగారూ—యివాళ పేపరు చూశారా?" కేశవరావు అడిగాడు.

"చూశాను. యేం" అయోమయంగా అడిగింది.

"సిటీచివరున్న పల్లెటూళ్ళో జరిగిన రేప్‌కేసు గురించిన వార్తచదివారా?"

"చదివాను"

"మీరు, ఈపిల్లలిద్దరూ కలిసి రేపామెను

యింటర్వ్యూ చెయ్యాలి. మేంకూడా వస్తాంగానీ ఆమె మాతో అన్నివిషయాలూ మాట్లాడలేదు. మీతో అయితే అన్నీఫ్రీగా చెప్పగలుగుతుంది''

''రేపా?''

''ఔను. రేపు శలవుగదా. అందరికీ వీలవుతుంది. పొద్దున్నే వెళితే మధ్యాహ్నానికి తిరిగి రావచ్చు. మీరెలాగైనా రావాలి. మీరు లేకపోతే యింటర్వ్యూ కుదరదు. ఈనెల పత్రికలో ఈకేసు గురించిరాసి జనరల్‌గా రేప్‌కేసుల గురించి కొంత రాద్దామనుకుంటున్నాం.''

''రేపు పదిగంటల తర్వాతే నాకు కుదురుతుంది'' ఆలోచిస్తూ అంది అరుణ.

''పోనీ పదింటికేరండి. పదినించీ మేం బస్‌డిపోలో మీకోసం చూస్తుంటాం. మీరు రాగానే వెళదాం. సాయంత్రానికి తిరిగి రావొచ్చు.''

''సరేలెండి. అలాగే వస్తాను'' అంటూ డిపార్ట్‌మెంటులోకి వచ్చింది.

అప్పటిదాకా చాలా ఆసక్తికరంగా యేదో మాట్లాడుతున్న వాళ్ళల్లా అరుణను చూసి హఠాత్తుగా మాటలాపేశారు. అందరూ హడావుడిగా యెవరిపనుల్లో వాళ్లు పడినట్లు పుస్తకాలు చూసుకుంటున్నారు. అరుణ మనసంతా పాడైపోయింది. వీళ్ళంతా తనని వేరుగా విచిత్రంగా, యేదో నేరంచేసినట్లు చూడటం నిజంగా తన తప్పేనన్నట్లు దిగులుగా కూచుంది.

'రేపు ప్రకాశానికేమని చెప్పాలి? పెళ్ళిరోజు. రెండురోజులనుంచే వాతావరణం కాస్త మామూలుగా వుంది. ఇప్పుడీవిషయం చెబితే పెద్దగొడవవుతుంది.

ఈ విషయం చెప్పకూడదు. ఇంకేదో కారణం చెప్పి యింట్లోంచి బైటపడాలి.

కొలీగ్ పెళ్ళికి వెళ్ళాలి- సాయంత్రానికి వొచ్చేస్తానని చెప్పాలి. దానికేమనడు. సంతోషంగా పంపుతాడు.

కానీ అబద్ధాలు చెప్పాల్సివచ్చిన తన పరిస్థితే ఘోరం.

తప్పదు.

అబద్దాలు చెప్పినందుకు గిల్టీగా ఫీలవ్వాలి. టెన్షన్ పడాలి.

ఎందుకీ గొడవంతా?

మానెయ్యలేక పోతున్నదెందుకు. తనెంత టెన్షన్ పడుతూ యీ పనిచేస్తోందో యెవరైనా వూహించగలరా? మిగిలిన అందరిలాగే వస్తున్నా ననుకుంటారు. కనీసం తనకేమన్నా యిబ్బందులుంటాయన్న ఆలోచనకూడా వాళ్లకొచ్చినట్టు లేదు. ఆవిషయం యెవరూ, యెప్పుడూ అడగలేదు. అడిగేంత చనువు యెవరూ తీసుకోరు. వీళ్ళభావాలూ, తన భావాలూ వొకటే గదా- వీళ్లు తనతో స్నేహంగా వుండరెందుకని? ఏదో గిరిగీసుకుని ఆగిరిలో వల కూచున్నట్లుంటారు. పనుంటే చెప్పటం. దాని గురించి మాట్లాడటం తప్ప వేరే యేమీ మాట్లాడరు. మర్యాదగా గౌరవంగా చూస్తున్నట్లు వుంటారు గానీ వాళ్ళల్లో వొకదానిగా స్నేహంగా వుండరు. వాళ్ళలా వుంటే యీ విషయాలన్నీ చెప్పుకుని కాస్త శాంతి పొందేది. సుజాతా, భారతీ చిన్నపిల్లలు. తనను లెక్చరరుగానే చూస్తారు. 'మేడం' అంటూ గౌరవిస్తారు. ఇక వాళ్ళనలా పిలవొద్దని చెప్పాలి. వాళ్ళతోనన్నా స్నేహం చేసుకోవాలి. ఈమగవాళ్లు భావాలు వొకటైనా తనతో స్నేహం కలుపుకోలేకపోతున్నారంటే తాను ఆడదవటం మూలంగానేగా. మర్యాదగా చూస్తున్నామని తనను దూరంగా వుంచటం నిజానికి తనకు చిన్నతనం కదూ—'

అరుణ మనసంతా చెప్పలేని అనంతృప్తితో నిండిపోయింది.

అరుణ వూహించినట్లుగానే కొలీగ్‌పెళ్లికి వెళ్ళటానికి ప్రకాశం యేమీ అభ్యంతర పెట్టలేదు. అరుణ కొత్త చీరలో యిబ్బంది పడుతూ బయల్దేరింది. అరుణ వెళ్ళేసరికి అందరూ వచ్చివెయిట్‌చేస్తున్నారు. బస్సుకూడా బయల్దేరబోతోంది. ఎక్కారు. బస్సు బయల్దేరింది.

''మీ యింట్లోవాళ్లు మీరిలా తిరుగుతుంటే అభ్యంతరంచెప్పరా? వాళ్ళకిష్టమేనా?' అరుణ భారతినీ సుజాతనీ అడిగింది.

ఇద్దరూ నవ్వారు.

అరుణ యీప్రశ్న అడగటం వాళ్ళకెం,

సంతోషాన్ని కలిగించిందో ఆనవ్వులో స్పష్టంగా కనపడింది.

"మేమీపనుల్లో తిరుగుతున్నామని వాళ్ళకి తెలియదండీ. ఏవో అబద్ధాలు చెప్పి వచ్చేస్తాం" సుజాత కాస్త సిగ్గుపడుతూ చెప్పింది.

"ఏమని చెబుతారూ?" కుతూహలంగా అడిగింది అరుణ.

"ఫ్రెండ్స్‌దగ్గరకనీ, సినిమాలకనీ, ప్రయివేటు క్లాసులనీ యేవో చెబుతాం."

అందరిదీ వొకే పరిస్థితన్నమాట.

అరుణకు నవ్వొచ్చింది. "ఫ్రెండ్స్ దగ్గరకూ సినిమాలకూ అంటే వొద్దనరా? వాళ్ళకు అభ్యంతరం వుండదా?"

"కాస్త గొణిగినా పంపుతారు లెండి" భారతి నవ్వుతూఅంది.

పిల్లలు చెత్తసినిమాలకెళ్ళినా యిష్టమే. యేఫ్రెండ్స్‌తో యెలా తిరిగినా యిష్టమే. ఇలాంటి మంచిపనులు చేస్తున్నారంటే మాత్రం యిక గడపదాటనివ్వరు. చిత్రం! తననసలు సినిమాలకూ షికార్లకూకూడా పంపేవారు కాదుగా!

అరుణ ఆలోచనల్ని ఆపేస్తూ భారతి అంది.

"మా అమ్మానాన్నలు చాలా నయమండి. మాక్లాసులో కొంతమంది అమ్మాయిల్ని చూస్తుంటే యెంత జాలేస్తుందో. కాలేజీకీ యింటికీ తప్ప యెక్కడికీ వెళ్ళగూడదు. ఐదునిమిషాలు ఆలస్యమైందో నానాగోలా చేస్తారు. సుజా- పూర్ణా వాళ్లన్నయ్య . ఆమె కంటే రెండేళ్ళు పెద్దేమో— ఇంజనీరింగ్ చదువుతున్నాడు. ఆ అబ్బాయి కూడా పూర్ణమీద పెత్తనంచేస్తాడు."

"సరేలే- మేడం. మాక్లాసులో కల్యాణి అని వొకమ్మాయి వుంది. ఫస్టియర్లో మాతో బాగాస్నేహంగా వుండేది. వాళ్ళింటికి రెండుమూడు సార్లు వెళ్ళాం. ఒకసారి సినిమాకెళదామంటే వాళ్ళనాన్న నడిగింది. పంపనన్నాడు. నాలుగోసారి మేంవెళ్ళితే యిక మమ్మల్ని తిట్టాడు. మా అమ్మాయిని చెడగొడుతున్నారు. ఇకమీద మాయింటికి రాకండి. అంటూ తరిమేశాడు. పాపం కల్యాణి బాగా యేడ్చింది. తర్వాత మాస్నేహం మానేసింది. మేమేం అనకపోయినా తనే అవమానంగా ఫీలయింది"

తనచరిత్రే మళ్ళీ వింటున్నట్టుగా అవన్నీ విన్నది అరుణ.

"మరి మీరిట్లా యిబ్బందిపడి వస్తున్నారని మన సార్లకు తెలుసా?"

"తెలియదండి"

"చెప్పకపోయారా?"

"ఏమోనండి. వాళ్ళెప్పుడూ అడగలేదు. ఇవన్నీ చెప్పాలంటే భయం." మొహమాటంగా అంది సుజాత.

"ఔను వాళ్ళెప్పుడూ అడగలేదు వాళ్లు యేటైముకి రమ్మంటే ఈ అమ్మాయిలు ఆటైముకి వస్తున్నారు యెన్ని యిబ్బందులైనా పడి. వీళ్ళకు యిబ్బందులుంటాయి, యిబ్బందులులేని టైములో రమ్మందాం అని మగవాళ్ళకు తోచదు.

వీళ్లు చెప్పుకోలేరు.

"మీలాగా ఫ్రీగా యెప్పుడుంటామో అనిపిస్తుంది మేడం. డిగ్రీ పూర్తవగానే యేదో వొక ఉద్యోగంలో చేరిపోదామనుకుంటున్నాం" అంది భారతి.

అరుణ నీరసంగా నవ్వింది.

బస్సు దిగి వో కిలోమీటరు నడిచి వూరు చేరారు. అది చాలా చిన్న వూరు. సంగమ్మ యిల్లెక్కడా అంటే యెవరో చూపించారు. చాలా చిన్న పాక. లోపలంతా వొకే గది. బైట కాస్త వరండాలాగా వున్న మట్టి యిల్లు.

వీళ్ళు వెళ్ళే సరికి సంగమ్మ భర్త ఆమెను బైటికి మోసుకొస్తున్నాడు. తోటకూర కాడలా వేళ్ళాడబడి వుందామె. వీళ్ళను చూసి ఆమెను మళ్ళీ లోపలకు తీసికెళ్ళాడు. కేశవరావు అతనితో వచ్చిన పని చెబితే అతను,

"అడగండమ్మా- అడగండి. అన్నీ చెబుతుంది. ఎన్ని చెప్పినా యెంత రాసినా జరిగిన అన్యాయం చెరిగిపోద్దా తల్లీ" అంటూ భోరున యేడ్చాడు.

"లేచి నిలబడలేక పోతోందమ్మా. డాక్టర్లు ఆస్పత్రినించి తీసుకపొమ్మన్నారు. నిన్న సాయంత్రమే తీసుకొచ్చా. మళ్ళీ దాని బాధ

చూడలేక చిన్నానుపత్రికన్నా తీసుకుపోదా మని బైల్దేరా''

''చిన్నానుపత్రికెళ్ళి డాక్టర్ని తీసుకొద్దాం. ఆవిడనెక్కడ మోసుకెళ్తావు? రా వెళ్దాం'' అంటూ కృష్ణమూర్తి వెళ్ళాడు.

అరుణా, సుజాతా, భారతి లోపలకు వెళ్ళారు. శవంలా పడున్న సంగమ్మను చూస్తే ముగ్గురికీ కళ్ళనీళ్ళొచ్చాయి.

అరుణ వెళ్ళి పక్కనే కూచుంది. సంగమ్మ నిశ్శబ్దంగా యేడుస్తోంది. ఏమడగాలో యెలా పలకరించాలో అర్థం కాలేదు ముగ్గురికీ-

''ఒళ్ళంతా గాయాలతో పచ్చిపుండైపోతే, జీవచ్ఛవంలా పడివున్న ఆమె గాయాలను రేపి, ప్రశ్నలతో గుచ్చి- యెందుకీ పని? ఏం ప్రయోజనం? ఎవరు మారతారని? ఎవరికి తెలియదని? రాసిన విషయాలన్నీ యేమయ్యాయి'' అరుణకు విరక్తిలాంటి భావం పుట్టుకొచ్చింది.

''ఎవరమ్మా యీ దుర్మార్గం చేసింది'' సుజాత అడిగింది.

'దొర' యెక్కిళ్ళ మధ్యలోనుంచి చెప్పింది సంగమ్మ.

సుజాతా, భారతీ వొక్కో ప్రశ్నవేస్తుంటే సంగమ్మ చెబుతోంది.

దొర యెట్లా యింట్లోకి రమ్మన్నదీ, యెట్లా పైన బడిందీ, వాడూ వాడి స్నేహితులిద్దరూ కలిసి పదిహేనుసార్లామెను రాక్షసంగా యెలా అనుభవించిందీ- రక్తం యెలా వరదలయిందీ, రొమ్ములెలా గాయాలయిందీ, నడుం యెలా విరిగిపోయిందీ- అంతా- అంతా- వివరంగా చెప్పింది సంగమ్మ.

అరుణ యింకో ఆలోచన లేకుండా అదంతా రాసింది.

''మరిప్పుడేం చేస్తావు సంగమ్మా?''

''ఏం చేస్తానమ్మా. పోలీసులు కేసు రాసుకోలేదు. నువ్వు కేసుపెడితే దొర నిన్నూ నీ మొగుడ్నీ చంపేస్తాడు. మాట్లాడకుండా పొమ్మన్నారు. ఆస్పత్రి వాళ్ళు నీ చావు నువ్వు చావమని పంపేశారు. ఇట్టాగే కుళ్ళి కుళ్ళి చస్తానమ్మా-''

అరుణకు దుఃఖం కూడా రానంతగా గుండె ఎండిపోయింది.

'ఇదంతా అద్భుతంగా వ్యాసంగా రాస్తాను . పత్రిక వస్తుంది. అందరూ చదువుతారు. పత్రికకు పేరొస్తుంది. పత్రిక నడిపే వాళ్ళకు పేరొస్తుంది. అరుణగారు వ్యాసం చాలా చక్కటి భాషలో చాలా బాగా రాశారంటాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తిలాంటి మేధావి నా వ్యాసాన్ని పొగిడాడని మురిసి ముక్కలైపోతాను నేను. సంగమ్మ యిక్కడ కుళ్ళి కుళ్ళి యేడ్చి చచ్చిపోతుంది. దిక్కు లేకుండా చచ్చిపోతుంది. సంగమ్మ భర్తకు పిచ్చెక్కుతుంది. అయినా అందరం హాయిగానే వుంటాం,

''మేడం- వెళదాం'' సుజాతా, భారతీ అరుణను బైటికి తీసుకెళ్ళారు.

సంగమ్మే కళ్ళముందు కదలాడుతుంటే కళ్ళు మూసుకుని బస్సులో కూచుంది అరుణ. ఇట్టాగే కుళ్ళి కుళ్ళి చస్తానంటూ కళ్ళ వెనక కూడా సంగమ్మే కనిపిస్తోంది.

ఏడుపొస్తే బాగుండు అనుకుంది. ఏడుపు రావటంలేదు. గుండె సీసం గుండులా బరువెక్కింది. సిటీ బస్సంది యిల్లు చేరేనరికి యేడు గంటలయింది.

ప్రకాశం, పాపా, కమలమ్మ వాకిట్లో నుంచుని యెదురు చూస్తున్నారు.

''ఇంతాలస్యమైందేం అరుణా'' ఆతృతగా అడిగాడు ప్రకాశం.

''బస్సులందలా'' అంటూ వాళ్ళను తప్పించుకుని బాత్‌రూంలోకి వెళ్ళింది.

'అయిపోయింది ఆ జీవితం.

ఆ అనుభూతులూ, ఆ కష్టాలూ, కన్నీళ్ళూ అన్నీ అక్కడే-

ఇక్కడ నవ్వాలి.

ప్రకాశాన్ని ప్రేమించాలి.

పాపని నవ్వించి ఆడించాలి.

అత్తయ్యతో మంచిగా మాట్లాడాలి.

తనకిప్పుడు భోరున యేడవాలనివుంది. ఎవరినన్నా తిట్టాలన్నంత కచ్చగా వుంది. ఎవరితోనూ మాట్లాడకుండా యే నిద్రమాత్రలో వేసుకొని గాఢంగా యే ఆలోచనలూలేని నిద్రపోవాలని వుంది.

కుదరదు. తన పరిస్థితి యెవరికీ చెప్పుకునే వీలు లేదు.

తనెలా వున్నా సరే నవ్వాలి, ప్రేమించాలి, ఆదరించాలి.

స్నానం చేసి వచ్చేసరికి భోజనాలు సిద్ధం చేశారు ప్రకాశం, కమలమ్మ కలిసి.

"అప్పుడే భోజనాలా?"

"ఆకలిగావుందరుణా. పొద్దునెప్పుడో తిన్నాం. మధ్యాహ్నం టిఫిన్ కూడా తినలా. నువ్వు పెళ్ళిభోజనం బాగా తిన్నట్లున్నావ్" ప్రకాశం నవ్వాడు.

"పెళ్ళిభోజనం అసలు తినలేం, ఆ ముఖం చూడు యెట్లా పీక్కు పోయిందో. అన్నం తిన్న ముఖమల్లే లేదు" అంది కమలమ్మ

అన్నం దగ్గర కూచుంటే ముద్ద మింగుడు పడలేదు అరుణకు. సంగమ్మ అన్నం తిని వుండదు. ఏడుస్తూ ఆ మంచంలోనే పడుకుని వుంటుంది అనుకుంటే మరి కంచంలో చెయ్యి పెట్టాలనిపించలేదు.

"ఏంటమ్మా, ముద్ద నోట్లో పెట్టలేదు. మళ్ళీ వొంట్లో బాగో లేదా? "

కమలమ్మ హెచ్చరించటంతో గబగబా నాలుగు ముద్దలు మింగి "ఇక తినలేనత్తయ్యా- మధ్యాహ్నం ఆలస్యంగా తిన్నాను" అంటూ లేచింది.

"నువ్వెళ్ళి పడుకో. వంటిల్లు యివాల్టికి నే సర్దుతాలే" అంది కమలమ్మ

ఆ మాటకోసమే యెదురు చూస్తున్నదానిలా అరుణ లేచి పాపను తీసుకొని గదిలోకి వెళ్ళింది.

"ఇవ్వాళ నేను నాయనమ్మ దగ్గర పడుకుంటా. నాకు పెద్ద కథ చెప్తానంది" అంటూ పాప మళ్ళీ వంటింటోకి వచ్చింది.

అరుణ మంచంమీద వాలి గట్టిగా కళ్ళు మూసుకుంది.

"బాగా అలిసిపోయావా?" ప్రకాశం పక్కనే పడుకుని అరుణ గుండెల మీద తలపెట్టి ప్రేమగా అడిగాడు.

" ఊఁ " అంది అరుణ.

"నీ అలసటంతా పోగొట్టనా?"

అరుణేం మాట్లాడలేదు.

"అరుణా మూడేళ్ళ క్రితం యివాల్టి రోజున యెంత సంతోషంగా వున్నాం"

" ఊఁ -"

"ఏంటోయ్- నీ నీరసం. ఇవాళ కూడా అంత హుషారుగా వుండాల్సిందే"

"నాకేం బాగోలేదు" ప్రకాశం చేతులు తీసెయ్యబోయింది.

"నే బాగుచేస్తాగా" అరుణను గట్టిగా తనకేసి అదుముకున్నాడు.

అరుణకు సంగమ్మకెవ్వుమని అరిచినట్లు వినిపించి వులిక్కిపడి ప్రకాశం నుండి విడిపించుకుని దూరం జరిగింది.

"అరుణా, నా మీద చాలా కోపంగా ఉంది కదూ. నిజమే నిన్ను చాలా కష్టపెట్టాను. ఎన్నో మాటలన్నాను. నన్ను క్షమించవూ?" అరుణను కౌగిలిలోకి తీసుకొంటూ బతిమాలాడు.

"నిజంగా నాకు బాగోలేదు. ఈ రోజు నన్ను విసిగించకు"

అరుణ గొంతులో నీరసం, విరక్తీ ప్రకాశం పట్టించుకోలేదు.

"అరుణా- రేపట్నించీ నువ్వేశిక్ష విధించినా సరే-ఇవాళ మాత్రం నిన్ను విసిగించి తీర్తాను" అరుణ చెంపపై చిన్నగా కొరికాడు.

పళ్ళగాట్లతో గాయాలైన సంగమ్మ చెంపలు గుర్తొచ్చాయి అరుణకు.

ప్రకాశాన్ని నెట్టెయ్యబోతే ప్రకాశం ఇంకా గట్టిగా అరుణను హత్తుకున్నాడు. పెదవుల మీద గట్టిగా ముద్దుపెట్టాడు.

'అయ్యో' అని సంగమ్మ పెద్దకేకేసినట్లు వినిపించింది అరుణకు. అసహ్యంతో వళ్ళు జలదరించింది.

ప్రకాశం ఆవేశంగా అరుణను ముద్దు పెట్టుకుంటున్నాడు. అరుణకు యెక్కడలేని నీరసం వొచ్చింది.

'ఇపుడు జరిగిందేమిటి? ప్రకాశం తనను రేప్ చెయ్యలేదూ? తన అయిష్టాన్ని లెక్కచెయ్యకుండా అతని కోరిక తీర్చుకున్నాడు. తను వొద్దని వారించినా వినలేదు. భర్త గనక



తను కళ్ళు మూసుకుని వూరుకుంది. అంత మాత్రాన ఇది రేప్ కాకుండా పోతుందా? భర్త తన కిష్టంలేకుండా కోరిక తీర్చుకుంటేనే ఇంత బాధగా అవమానంగా ఉందే. సంగమ్మకు వాళ్ళు ముగ్గురూ కలిసి పెట్టిన హింస యెంత భయంకరంగా ఉండిఉంటుంది? ఎలా తట్టుకుంది? ప్రకాశం ఎంత మూర్ఖంగా యెంతమొరటుగా ప్రవర్తించాడు! ప్రతి మొగాడూ ఇంతేనేమో- తన కోరిక తీరితే చాలనుకుంటాడా? భర్త చేత రేప్ చెయ్యబడని స్త్రీ వుంటుందా? దీన్ని గురించి ఎవరికి చెప్పాలి? ఎలా చెప్పాలి. చెబితే యెవరర్థం చేసుకుంటారు? పిచ్చిదని నవ్వుతారు. కానీ భర్తయినా సరే, నా ఇష్టం లేకుండా నా శరీరాన్ని యెందుకు తాకాలి? నేను ఎందుకు నిరోధించలేకపోవాలి?

"అమ్మాయ్- అరుణా" కమలమ్మ పిలుపు విని ఉలిక్కిపడి లేచింది.

"ఏంటత్తయ్యా" హడావుడిగా తలుపు తీసుకొని బైటికొచ్చింది.

"పాపకు వొళ్ళు కాలిపోతోంది చూడమ్మా"

అరుణ వెళ్ళేసరికి పాప మెలకువగానే ఉంది. జ్వరంతో కళ్ళు యెర్రబడి పోయాయి.

"పడుకునేప్పుడు బాగానే ఉంది. హఠాత్తుగా వచ్చేసిందేమిటి?" కమలమ్మ కంగారు పడుతుంటే అరుణ పాపకు మందు తాగించింది.

"మీరు పడుకోండత్తయ్యా- నేను పాప దగ్గరుంటాను" అని పాప పక్కనే కూచుంది.

జ్వరం తగ్గలేదు సరిగదా కాళ్ళు నెప్పులని వొకటే యేడుపు మొదలెట్టింది పాప. కాళ్ళు నొక్కుతూ కూచుంది అరుణ. మిగిలిన ఆలోచనలన్నీ పోయి పాప గురించి బెంగపట్టుకుంది. ఎప్పుడు తెల్లారుతుందా అని ఎదురు చూస్తూ కూచుంది. తెల్లవారే సరికి పాపకు జ్వరం కూడా కొస్త తగ్గి నిద్రపట్టింది.

ప్రకాశం నిద్రలేచి కంగారు పడ్డాడు.

"నీకూ బాగోలేదు గదా- నన్ను లేపగూడదూ? ఆ అనారోగ్యంతో రాత్రంతా మేలుక్కూచున్నావా? పో పోయి పడుకో! పాప సంగతి నే చూస్తాలే" అంటూ అరుణను లేపి తాను పాప దగ్గర కూచున్నాడు.

అరుణ పడుకొని రెండు గంటల సేపు గాఢంగా నిద్రపోయింది. లేచేసరికి ప్రకాశం పాపను హాస్పిటల్‌కి తీసికెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు.

"నేను పాపను హాస్పిటల్‌కి తీసికెళ్తాను. అలాగే లీవ్‌లెటరు కూడా ఇచ్చేస్తాను. సంతకంపెట్టు" అంటూ తాను రాసిన లీవ్ లెటరు అరుణకిచ్చాడు.

"నాలుగురోజు లెందుకూ?" అంది అరుణ.

"ఫరవాలేదులే- నీకూ పాపకూ బాగోలేదు. నాలుగురోజులు విశ్రాంతిగా ఉండు. నేను సెలవు పెడుతున్నాను. ఇద్దరం కలిసి పాపను జాగ్రత్తగా చూసుకుందాం"

అరుణ ఇంకేమీ ఆలోచించకుండా సంతకం పెట్టేసింది. పాపకు ఆ రోజూ జ్వరం తగ్గలేదు. మర్నాడు సాయంత్రానికిగాని నార్మల్‌కి రాలేదు. అరుణ ఇంకో ఆలోచన వచ్చే అవకాశమే లేకుండా పాప మంచం దగ్గరే ఉండిపోయింది. మూడో రోజు మరి జ్వరం రాలేదు. డాక్టరు తేలికగా అన్నం పెట్టమన్నాడు.

ఆ రోజు సాయంత్రం ఆరింటికంతా పాపకు అన్నం తినిపిస్తోంది అరుణ. ప్రకాశం పక్కనే కూచుని పాపకు బొమ్మల పుస్తకంలో బొమ్మలు చూపిస్తున్నాడు.

ఎవరో వచ్చిన అలికిడై తలెత్తి చూసింది. కేశవరావూ, కృష్ణమూర్తీ, సుజాతా వచ్చారు.

అరుణ ముఖం పాలిపోయింది. "రండి రండి" అందేగాని బలవంతాన కూడా నవ్వలేకపోయింది.

ప్రకాశం లేచి "రండి రండి" అని ఆహ్వానించాడు.

"ఈయన కృష్ణమూర్తిగారని లెక్చరరు. ఈ అమ్మాయి సుజాత బి.ఏ. చదువుతోంది. కేశవరావుగారు తెలుసుగా?" కంగారుగానే పరిచయం చేసింది.

వాళ్ళెందుకు వచ్చిందీ అరుణకు తెలుసు. ఆ రోజు సంగమ్మ చెప్పిన వివరాలన్నీ రాసిన నోట్సు అరుణ దగ్గరే ఉంది. దానికోసమే వచ్చి ఉంటారని నోట్సుఇస్తానంటూ లోపలకు వెళ్లింది. ప్రకాశం అన్నంగిన్నెనూ, పాపనూ కమలమ్మకిచ్చి వచ్చి కూచున్నాడు. అరుణ ఇచ్చిన నోట్సు చూసి కృష్ణమూర్తి "ఇదెందుకండీ- మీరు వ్యాసంగా రాయలేదా?" అనడిగాడు.

"లేదండి నాకు వీలుకాలేదు. మీరే రాయండి" అంది అరుణ.

"అరే! మీరు రాసి ఉంటారు. ఇక ప్రెస్‌కి ఇవ్వటమే అనుకున్నాం. మిగిలిన మేటరంతా సిద్ధంగా ఉంది".

"పాపకు బాగోలేకా, నాకూ బాగుండకా సెలవు పెట్టాను. నేనిప్పుడు రాయలేను"

"సరే-ఎలాగో చేస్తాంలెండి." అంటూ కృష్ణమూర్తి లేచాడు.

కేశవరావూ సుజాతా కూడా లేవబోతుంటే "టీ తాగి వెల్దురుగాని- అరుణా టీ పెట్టు" అంటూ ప్రకాశం బలవంతాన వాళ్ళను కూచోబెట్టాడు.

అరుణ వాళ్ళడిగిన వ్యాసం రాయననటం ప్రకాశానికి ఉత్సాహాన్నిచ్చింది. ఆ ఉత్సాహంలో ప్రకాశం అతిథి మర్యాదకు హడావుడి పడ్డాడు. అరుణ వాళ్ళు త్వరగా వెళ్ళిందే చాలని త్వరగా టీ పెడుతోంది.

"అరుణగారు చాలా బాగా రాస్తారండి. ఈ వ్యాసం గురించి అరుణగారు రాస్తే బాగుండేది" అన్నాడు కేశవరావు కృష్ణమూర్తి చేతిలో నోట్సు తీసుకుంటూ. "ఏ విషయం అది?" ప్రకాశానికి ఆసక్తి లేకున్నా లాంఛనంగా అడిగాడు.

"అదేనండీ. సంగమ్మ రేప్‌కేసు. మొన్న పదిహేనున మేం వెళ్ళి ఇంటర్వ్యూ చేశాంగా"

ప్రకాశం ముఖం నల్లబడిపోయింది.

"అరుణ కూడా వచ్చిందా?"

"ఊఁ— అరుణగారే ఈ నోట్సంతా రాశారు. అసలు వ్యాసం కూడా ఆవిడే రాస్తే బాగుండేది."

ప్రకాశం మాట్లాడకుండా కూచున్నాడు.

అరుణ టీ తెచ్చి ఇచ్చింది. వాళ్ళు టీ తాగి లేచి వెళ్ళిపోయారు.

ప్రకాశం అలాగే కూచున్నాడు. అరుణ పాప

ను భుజాన వేసుకుని జోకొడుతుంటే పాప నిద్రపోయింది.

"ఏంటలా కూచున్నావు?" అంటూ ప్రకాశం ఎదురుగా వచ్చి కూచుంది అరుణ.

ప్రకాశం అరుణవంక అలాగే చూస్తూ కూచున్నాడు.

అరుణ "ఏంటలా చూస్తావూ" అంటే,

"ఛీ నాతో మాట్లాడకు." అంటూ వెళ్ళి గదిలో కూచున్నాడు.

అరుణ "ఏంటీ, ఏమయింది" అంటూ వెళ్ళింది.

ఏమయిందో అరుణకు లీలగా తెలిసింది.

"ఎందుకరుణా నన్నిలా హింసపెడుతున్నావ్?"

అరుణ మాట్లాడకుండా నుంచుంది.

"ఆగస్టు పదిహేనున నువ్వెక్కడికి వెళ్లిందీ నాకు తెలిసింది"

"తెలిస్తే "

"తెలిస్తే? ఏంబాగా అడిగావు. అంత భయం లేనిదానివి అబద్ధం చెప్పి ఎందుకెళ్లావు?"

"నిజం చెప్పి ఆ రోజు నీతో గొడవ పెట్టుకోవటం ఇష్టంలేక అలా చెప్పాను. నువ్వు వెళ్ళనివ్వవేమోననే భయంతో అలా చెప్పాను"

"ఛీ— సిగ్గులేదూ- ఇంకామాట్లాడుతున్నావు?"

అరుణకు రోషం వచ్చింది.

"నాకెందుకు సిగ్గు- నాచేత అబద్ధాలు చెప్పించినందుకు, అబద్ధాలు చెప్పే స్థితికి నన్ను దిగజార్చినందుకూ నువ్వు సిగ్గుపడాలి."

"నోర్మూయ్" తీవ్రంగా అన్నాడు ప్రకాశం.

"నిజంగా నోరు మూసుకుంటున్నాను. నన్ను పలకరించక" అంటూ హాల్లోకి నడిచింది అరుణ.

మళ్ళీ ఇంట్లో ఘోరమైన మౌనం నెలకొంది.

శలవు పూర్తయి కాలేజీకి వెళ్ళగానే కేశవరావుని పిలుచుకుని లైబ్రరీకి వెళ్ళింది. "నిన్న మీరా విషయాలన్నీ ఆయనతో ఎందుకు మాట్లాడారు? ఆ పత్రికంటే ఆయనకేం ఇష్టంలేదు. నేను సంగమ్మను ఇంటర్వ్యూ చేసిన సంగతి కూడా ఆయనకు తెలియదు."

కేశవరావు కంగారుపడ్డాడు.

"అయ్యో- నాకు తెలియదండి- ఆయనతో చెప్పకుండా వుంటారని అసలు అనుకోలేదు."

"తెలియనప్పుడు వూరుకోవాలి. కనీసం వూహించాలి. మీ ఆవిడతో మీరు చెబుతున్నారా ఇవన్నీ" అరుణ చాలా కోపంగా అంది.

"ఆవిడతో చెప్పినా చెప్పకపోయినా నాకేమీ గొడవలేదుకదండీ. ఆయన కిష్టంలేని పని మీరు చేస్తారని నేననుకోలేదండి. ఇప్పుడెలాగండీ. బాగా గొడపయిందా?"

"అయిందిలెండి. మీరు మీ ఆవిడకు ఇష్టం వున్నా లేకపోయినా మీ ఇష్టం వచ్చిన పనులు చేస్తారూ. నేను మాత్రం ఆయన అనుమతితోనే చెయ్యాలా- ఏంటండీ మీ ఆలోచనలు" నిలదీసింది అరుణ.

"జనరల్‌గా అలాగే వుంటారుగదండీ" నీళ్ళు నమిలాడు కేశవరావు.

"నేను రావటం ఆయనకిష్టంలేదు. బాగా గొడవలయ్యాయి. ఇపుడు నన్నేం చెయ్యమంటారు?".

కేశవరావు అయోమయంగా చూశాడు.

"పోనీ మానేస్తారాండి"

"మానెయ్యమంటారా?"

"ఆయన అర్థం చేసుకుని ఒప్పుకునేంత వరకూ మానెయ్యండి. ఒప్పించటానికి ప్రయత్నించండి"

"ఆయనెప్పటికీ ఒప్పుకోడు."

"మరి ఏం చెయ్యగలరండీ— మానేసెయ్యండి"

అరుణ ఆశ్చర్యానికి హద్దుల్లేవు.

"మానేసేదానికి ఈ గొడవంతా నేనెందుకు పడ్డాననుకుంటున్నారు? ఆయనకిష్టంలేని పనులు మీరు మానెయ్యండి, అనే సలహా మీరు చెబుతారనుకుంటే అసలు నేనీ పనిలోకే వచ్చేదాన్ని కాదు."

కేశవరావు బుర్ర చురుగ్గా పని చేసింది.

"రేపాదివారం మెహందీకి వెళ్ళొచ్చాక మనందరం కలుస్తాంగదండి. అక్కడ

అందరం కూచుని ఆలోచిద్దాం. ఏం చెప్పాలో నాకూ తెలియటం లేదండి'' అన్నాడు.

అరుణ ఇంకేం మాట్లాడలేదు. కేశవరావు వెళ్ళిపోయాడు. ఏం గొడవలయ్యాయి. ఎలా ఇబ్బంది పడుతున్నారని అడగటంగానీ, మీరేం బాధపడకండని ఓదార్చటంగానీ, మేమున్నాం గదా అని ధైర్యం చెప్పటంగానీ చెయ్యకుండా వెళ్ళిపోతున్న కేశవరావుని చూస్తూ నిల్చుంది అరుణ.




ఆదివారం తొమ్మిది గంటలకంతా అరుణ బయల్దేరింది.

"ఎక్కడికీ'' ప్రకాశం కఠినంగా అడిగాడు.

"మెహందీకి''

"ఏమిటీ'' ప్రకాశం నిర్ఘాంతపోయాడు.

"ఔను అక్కడి పరిస్థితుల గురించి పత్రికలో రాయాలి. ఇవాళ వాళ్లను ఇంటర్వ్యూ చెయ్యాలి

"నువ్వు- నువ్వు మెహందీకి వెళ్తావా?'' నమ్మలేనట్లుగా అడిగాడు ప్రకాశం.

"ఔను'' అరుణ చెప్పులు తొడుక్కుంది.

"మళ్ళా ఈ ఇంటికి రావాలనేనా?''

"అంటే?''

"నువ్వు ఇవాళ వెళ్ళినా, ఇకముందు మీటింగులకు వెళ్దామనే ఆలోచనతో వున్నా ఇక నీకు నాకూ సంబంధం తెగిపోయినట్టే'' ప్రకాశం ముఖం కందిపోయి ఒళ్ళంతా చెమటలు పట్టేసింది.

"సాయంత్రం మాట్లాడుకుందాం'' అని అరుణ బయటకు నడిచింది.

ప్రకాశమూ తనూ కలిసి వుండాలంటే తనకిష్టమైన పనులు చెయ్యగూడదు.

అది అరుణకు స్పష్టమయింది.

తన కిష్టమైన పనులు చెయ్యొద్దని శాసించే ప్రకాశంతో కలిసుండటం దేనికోసం? ఎందుకు?

ఏ ప్రేమా లేకుండా రక్షణ కోసమో, పాప కోసమో ప్రకాశంతో కలిసుండాలా?

ఏంచెయ్యాలి?

చార్మినార్ దగ్గర బస్ దిగేసరికి సుజాతా, భారతీ నుంచుని వున్నారు.

వాళ్ళు అంతకు ముందు రోజే కేశవరావు, కృష్ణమూర్తిలతో కలిసి మెహందీకి వెళ్ళి ఆదివారం పదిగంటలకు వస్తామనీ, వాళ్ళ సమస్యలన్నీ చెప్పుకుంటే అవన్నీ పత్రికలో రాస్తామనీ అక్కడి స్త్రీలకు చెప్పి వచ్చారు.

హైకోర్టు దాటి ముందుకు నడిచి ఓ సందులోపలికి నడిచారు.

అరుణ, భారతి వెనకాలే ఏదో ఆలోచిస్తూ నడుస్తోంది. ఒక చిన్న సందులోకి తిరగ్గానే మొదటి ఇంటిదగ్గరే అరుణకి తెలిసిపోయింది, అది మెహందీ ప్రాంతమని.

అన్ని రకాల వయస్సుల్లో వున్న ఆడవాళ్ళూ బద్ధకంగా వాకిళ్ళలో కూచుని వున్నారు. బజారులో వెళ్ళే తట్టల్నీ బండ్లనూ ఆపి ఏవో కొనుక్కుంటున్నారు. ఒకళ్ళతో ఒకళ్ళు పరిహాసాలాడుకుంటున్నారు. కొందరు చక్కగా అలకరించుకొని వుంటే మరికొందరు నిద్రకళ్ళతో జిడ్డు ముఖాలతో వున్నారు.

ఒకింటి ముందువాకిట్లో తలుపుకానుకుని కూచున్న పెద్దావిడ వీళ్ళను చూస్తూనే "సలామమ్మా సలాం! రండి రండి'' అంటూ లోపలకు తీసుకు పోయింది. ఇరుగ్గా మురిగ్గా వున్న ఆగదిలో మంచమూ రెండు మూడు కుర్చీలూ వున్నాయి. టేబిల్ ఫానొకటి తిరుగుతూ వుంది. ఐదునిమిషాల్లో ఐదారుగురు మధ్య వయస్సు స్త్రీలు వచ్చి చేరారు. వీళ్ళను లోపలికి తెచ్చిన రుక్సానా అనే ఆమె మూడు డ్రింకులు తెప్పించి ముగ్గురికీ ఇచ్చింది. అరుణ కవి తాగాలంటే ఎలాగో అన్పించింది. వాళ్ళు ఒళ్ళమ్ముకుని సంపాదించిన డబ్బుల్లో పదిరూపాయలు మా కోసం ఖర్చు చేయించామే అను

కుంది. కానీ తాగకపోతే వాళ్ళు బాధపడతారు.

"మీరు పోలీసు స్టేషన్ ముందు ధర్నా చేశారెందుకు?" అరుణ అడిగింది.

"మాకు లైసెన్సులు కావాలి తల్లీ" రుక్సానా వుర్దూలో చెప్పింది.

వీళ్ళ ముగ్గురికి కాస్తో కూస్తో వుర్దూ వచ్చు గనక వీళ్ళూ వుర్దూలోనే మాట్లాడారు. రుక్సానా లైసెన్సులు కావాలనటం ఏమిటో ముగ్గురికీ ముందు అర్థం కాలేదు.

"ఔనమ్మా- లైసెన్సులిస్తే ఈ పోలీసుల జులుం ఇంతుండదమ్మా. ఇది మావృత్తి తల్లీ. పాపమో పుణ్యమో ఈ వృత్తిలోకి దిగాం. ఇరవై ముప్పయి సంవత్సరాలనుంచీ వృత్తి చేస్తున్నాం. ఇప్పుడు మానండంటే మేమేం చేస్తాం చెప్పమ్మా"

"పోలీసులు మిమ్మల్ని ఈ వృత్తి మానమంటున్నారా?"

"ఔనమ్మా. మేమిక్కడ వుండటానికే వీల్లేదంట. ఖాళీచేసి పొండని రోజూ వచ్చి తంతున్నారు. రాత్రిలేదు. పగలులేదు. ఎప్పుడంటే అప్పుడు వ్యానుల్లో వచ్చి గుంజుకు పోతున్నారు. స్టేషనుకి తీసికెళ్ళి లాఠీలతో కొట్టి చంపుతున్నారు. ఇంతకు ముందు ఇంటికి పాతిక చొప్పున రోజూ ఇచ్చేవాళ్ళం. ఇప్పుడదేం లేదు. ఇంట్లోకి వచ్చి దొరికిందంతా తీసుకుపోతున్నారు. మేమెట్లా బతకాలి? పిల్లలు దాక్కుందామని పాయిఖానాలలోకి పోయినా వెతికి వెతికి లాక్కుపోతున్నారు. లైసెన్సులుంటే మాకీ పాట్లుండవు బిడ్డా. బొంబాయిలో మాలాంటి వాళ్ళకు లైసెన్సు లిచ్చారంట"

"పోనీ మీరీ వృత్తి మానెయ్యొచ్చుగా. వాళ్ళేమన్నా దారి చూపిస్తారేమో" భారతి అంది.

నలుగురైదుగురు వొక్కసారే ఆవేశంగా మాట్లాడటం మొదలెట్టారు. రుక్సానా అందరినీ ఊరుకోబెట్టి తాను మొదలెట్టింది.

"వాళ్ళేందారి చూపిస్తారమ్మాదారి చూపించేవాళ్ళు చేసేదిదేనా- మమ్మల్ని స్టేషన్లో బెడితే మావాళ్ళు మాకోసం చాయికీ సిగరెట్టకూ డబ్బులు పంపితే అవికూడా మాకు చేరనివ్వరే వాళ్ళు- మాకేం దారి చూపిస్తారు? మేం ఈవృత్తి మానేసి యెక్కడికి పోవాలి. మీ ఇంటికొస్తే మీరు రానిస్తారా? మేం సరే, మా బతుకు లిలాగయినాయి. మా పిల్లల్ని మంచిగా చదివించుదామంటే లేదే. మెహందీ పిల్లలని సీట్లివ్వరాయె. సర్కారు బడికి పోతే తండ్రి పేరు రాయకపోతే సీటివ్వమంటారు. పది మందికి పుట్టిన బిడ్డకి తండ్రి యెవరని రాయాలి? ఓ సినిమాకి పోటానికి లేదు. ఓ పెళ్ళికీ పేరంటానికీ పోటానికి లేదు. మెహందీకీ మాలై. అచ్చా... అంటూ వెంటబడ్తారు. మేమిది వొదిలేస్తే మమ్మల్ని పీక్కుతినక వొదుల్తారా?"

రుక్సానా ఆవేశపడిపోయి మాట్లాడలేక పోయింది.

మరొకామె అందుకుంది.

"మేము నీచం చేస్తున్నా మంటారా-మళ్ళీ అందరూ ఆ నీచపు డబ్బులకే ఆశపడతారు. గణేశు ఉత్సవాలకి మా డబ్బులే. పీర్ల పండక్కి మా డబ్బులే. రెండు జండా పండగలకీ మా డబ్బులే. మొన్న మంత్రిగారువొస్తే దండలెయ్యటానికి మా డబ్బులే. మరి ఈటన్నిటికీ మా నీచపు సంపాదనే కావాల్సి వచ్చిందామ్మా? ఎలక్షన్లొస్తే చందాలివ్వాలి. మళ్ళీ వోట్ల రిగ్గింగుకి మేమే కావాలి. బురఖా తగిలించొకసారీ తీసేసి వొకసారీ పదివోట్లు వేయిస్తారు. ఇదంతా నీచం కాకుండా మా బతుకే నామ్మా నీచం. ఇంత తిండీ గుడ్డా దొరుకుతుందని ఈ మురికిలో బడితే మమ్మల్నిక్కడా బతకనివ్వరామ్మా?" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

అమ్మాయి లందరూ ముఖంలో ఏ భావమూ కనపరచకుండా వీళ్ళ వంకే చూస్తున్నారు. కొందరు వీళ్ళను పట్టించుకోకుండా వెనక గదిలో అలంకరించుకుంటున్నారు.

అరుణ చేష్టలుడిగిన దానిలా చూస్తూ కూచుంది. ఉర్దూలో వాళ్ళు మాట్లాడేవి రాయటం చేతకాక అర్థం చేసుకుని ఊరుకున్నారు ముగ్గురూ. వాళ్ళు మాట్లాడుతుంటే యే జలపాతపు చప్పుడో, యే కవితా ప్రవాహమో అన్నట్లుంది. వాళ్ళు చెప్పేది వినటం తప్ప మరేం చెయ్యలేక పోయారు.

మళ్ళీ రుక్సానా చెప్పటం మొదలెట్టింది.

"మమ్మల్ని పశువుల్ని బాదినట్లు బాదుతు

న్నారమ్మా. స్టేషన్లోనే కాదు మా ఇంట్లోనే మమ్మల్ని కొట్టి పోతున్నారు. వాళ్ళకెందుకోగాని మమ్మల్ని ఇక్కడ్నించి పంపాలని ఉంది. ఇక్కడ పక్కనుండే సంసార్లకు లేని గోల వీళ్ళకెందుకమ్మా? మళ్ళా వొక్కో పోలీసుకి వొక్కో అమ్మాయిని మేమే పంపాల.''

''లైసెన్సులిస్తే మీకీ పోలీసుల బెడద ఉండదా?''

''ఇంత ఉండదమ్మా. అది మా వృత్తి అని ఖరారైన తర్వాత మానెయ్యమని తన్నడానికి లేదు గదమ్మా. డబ్బులంటారా రోజు మామూలు యెలాగూ ఇస్తాం.''

అరుణా వాళ్ళు ప్రశ్నలడిగే అవసరమే లేకపోయింది. వాళ్ళ జీవితాల్లోని విషాదాన్ని వినిపించటానికి సిద్ధంగా ఉన్న ఆ స్త్రీలు ఆపకుండా మాట్లాడారు.

అరుణా వాళ్ళు వచ్చేస్తుంటే,

''సలామమ్మా-మాకేదన్నా సాయం చేసి పెట్టండమ్మా'' అని దండాలు పెట్టారు.

''మేమేం చెయ్యగలమమ్మా. మీ గురించీ మీ బాధల గురించీ రాసి పేపర్లో వేస్తాం అంతే—'' అంది అరుణ పేలవంగా నవ్వుతూ. ''చాలమ్మా గొప్ప చదువులు చదివారు. మీరు మా ఇంటికొచ్చి మా కథ విన్నారు. అదే చాలమ్మా'' అంది రుక్సానా.

''మీరూ మేమూ అందరం ఆడవాళ్ళమే... మీకు పోలీసులు మొగుళ్ళయితే మాకు మొగుళ్ళే పోలీసులు'' అంది అరుణ.

అందరూ నవ్వారు.

''చల్లగుండమ్మా. నిజం చెప్పావు'' అంది వొకామె.

''మేడం! వాళ్ళెంత బాగా మాట్లాడారండి. మన గురించి మనం అలా చెప్పుకోలేం'' అంది సుజాత.

''ఔను. వాళ్ళ మాటల్లో చేతల్లో యెక్కడా కంట్రోలు చేసుకోవటమనేదే లేదు. ఉన్నదున్నట్లు చెప్పారు. వాళ్ళ జీవితమే వాళ్ళనలా చేసిందేమో'' అంది అరుణ.

ఆ విషయాలే మాట్లాడుకుంటూ కృష్ణమూర్తి ఇంటికి వెళ్ళారు. వీళ్ళు వెళ్ళేసరికి నలుగురైదుగురు వచ్చి ఉన్నారు. నెమ్మదిగా పావుగంటలో పదిహేనుమందీ వచ్చి చేరారు.

మెహందీ వివరాలన్నీ అరుణ చెప్పింది.

తర్వాత సుబ్బారావు నెమ్మదిగా మొదలెట్టాడు.

''అరుణగారూ-మీ సమస్య కేశవరావు నిన్న మాతో చెప్పాడు. నిన్న రాత్రంతా మేము కూచుని ఆలోచించాం'' అని ఆగాడు.

అరుణకు ఆ పరిస్థితి చికాకనిపించినా తప్పక మౌనంగా కూచుంది.

''ఈ పరిస్థితుల్లో మిమ్మల్నింకా పత్రికపని చెయ్యమని వొత్తిడి చేసి మీ సమస్యల్ని పెంచటం అన్యాయమనుకున్నాం. మీరు పత్రికపని మానేసి మీ సమస్యల్ని పరిష్కరించుకోండి'' అన్నాడు కృష్ణమూర్తి.

''ఈ చిన్న పత్రిక కోసం మీ వారితో తగదా పడటం, మీ జీవితమంతా పాడవటం మాకు బాధగా ఉంటుంది'' రమణారావు అన్నాడు.

''పైగా పత్రికకి కూడా అది మంచిది కాదు. పత్రిక వొకసంసారాన్ని పాడు చేసిందనే చెడ్డపేరు రావటంకూడా బాగుండదు చూడండి'' కేశవరావు అనునయంగా అన్నాడు.

''ఔను—నే చిన్నప్పుడు వొక స్టూడెంటు యూనియన్లో పని చేశాను. ఆ యూనియన్లో కవితా, రామ్మూర్తీ అని ఇద్దరు చాలా చురుగ్గా పని చేసేవారు. అయితే వాళ్ళిద్దరూ ప్రేమలో పడ్డారు. సరే సహజంగానే సినిమాలకూ షికార్లకూ తిరిగారు. ఏ మాటకామాట చెప్పుకోవాలి. యూనియన్ పని మాత్రం శ్రద్ధగా చేసేవారు. అయినాసరే పెళ్ళికాకుండా ఇద్దరూ అలా తిరిగితే యూనియన్‌కి చెడ్డపేరని యూనియన్లో నుంచి పంపించేశాం. మనం వొక నిర్మాణంలో ఉన్నప్పుడు దానికి చెడ్డపేరు రాకూడదు చూడండి'' సత్యం యేం మాట్లాడుతున్నాడో తెలియకుండా మాట్లాడేస్తున్నాడు.

''మీరు కొంచెం ఆగుతారా. నేను మాట్లాడాలి'' అంది అరుణ.

''మాట్లాడండి'' అన్నాడు కృష్ణమూర్తి.

''నేను పత్రిక పని మానేస్తున్నాను. మా ఆయనకు ఇష్టం లేదని కాదు. మీరు మానెయ్యమన్నారనీ కాదు. మీ అందరితోకలిసి పని

చెయ్యటం నాకే ఇష్టంగా లేదు."

అరుణ ఆగింది.

అందరూ అదేమిటన్నట్లు ఆశ్చర్యంగా చూశారు.

"నేనీ పత్రికపని యెందుకు చేస్తున్నాను?"

ఎవరూ యేమీ మాట్లాడలేదు. అరుణే మళ్ళీ మొదలు పెట్టింది.

"కేశవరావుగారు వొత్తిడి చేశారనో, మొహమాటం కోసమో నేనీ పని చెయ్యటంలేదు. ఈ పని చెయ్యాలనీ, ఈపని చెయ్యటం వొక మనిషిగా నా కర్తవ్యమనీ అనుకోవటంవల్ల ఈపని చేస్తున్నాను. నాకు ఈపని చెయ్యటం ఇష్టం గనుక చేస్తున్నాను. అందుకే యెన్ని సమస్యలొచ్చినా భరిస్తున్నాను. ఈ విషయం మీ కర్థమయిందా?"

"అదేంటండీమీ కిష్టం లేకుండా ఈ పని చేస్తున్నారని మేమన్నామా?"

"నేనెంత ఆర్తితో ఈపని చేస్తున్నానో మీ కర్థమయితే 'ఈ పరిస్థితుల్లో ఇంకా ఈ పని చెయ్య మనటం న్యాయంకాదు' అని మీరనేవారు కాదు. ఈపనిలో నేనెంతగా ఇన్‌వాల్వ్ అయ్యానో మీకు అర్థం కాలేదు. మీరు నన్నెందుకు పిలిచారు? ఆడవాళ్ళ సమస్యల గురించి విచారించటానికి ఆడవాళ్ళను పంపితే బాగుంటుందనుకున్నారు. మీకు నేను కనపడ్డాను. అడిగారు. పంపారు. మీ అవసరం తీరింది. అందుకు సంతోషించారే గాని నేనెందుకు ఈపని చేస్తున్నానో మీరు ఆలోచించలేదు. పత్రికకు నా అవసరం గురించి ఆలోచించారేగాని నాకు పత్రికతో యేర్పడ్డ అనుబంధం గురించి ఆలోచించలేదు. అందుకే నాకో సమస్య వచ్చిందనగానే పత్రిక పని మానెయ్యమని తేలిగ్గా అనేశారు. అసలు పత్రిక పని మీరెందుకు చేస్తున్నారో మీకు తెలుసా? నిజంగా ఆర్తితో ఫీలై ఈపనులు మీరు చేస్తుంటే యెదుటి మనిషి ఫీలింగు మీకర్థంకాదూ"

కేశవరావు యేదో మాట్లాడబోయాడు.

అరుణ వారించింది.

"ఉండండి. నన్ను మాట్లాడనివ్వండి. భర్తతో తగాదాలు వొస్తే అతన్నించి విడిపోతే ఆడదాని జీవితమంతా పాడయినట్లేనని మీరు చెప్పినదాన్ని బట్టే మీ సంస్కారం తెలుస్తోంది. కేశవరావు గారూ-నామూలాన పత్రికకి చెడ్డపేరు వస్తుందని భయపడుతున్నారే. పత్రిక విషయాలు రోజూ మీతో మాట్లాడినందుకు నాకొచ్చిన చెడ్డపేరు సంగతేమిటి? నాపేరు సంగతీ నా జీవితం సంగతీ కూడా ఆలోచించకుండా నేనీ పత్రిక పని ఎందుకు చేశానో ఆలోచించండి.అది అర్థంకాక పోతే మీరు ఎన్ని పత్రికలు నడిపినా నా దృష్టిలో అల్పులే. మీతో కలిసి పనిచేసిన వ్యక్తిని మీరు అర్థం చేసుకోలేకపోయారు. మీతో కలిసి పనిచేసే మనిషికి ఒక సమస్య రాగానే భయపడిపోయారు. మీరు సమాజంలో సమస్యల గురించి ఏం చెయ్యగలగుతారు?"

అరుణ లేచి చెప్పులు వేసుకుంటుంటే అందరూ చూస్తూ ఉండిపోయారు.

అరుణ వెనకాలే సుజాతా, భారతీ కూడా బైటికి వచ్చారు.

"మేడం. మీవిషయాలేవీ మాకు తెలియవండి. ఇప్పుడు మీ మాటలవల్లే తెలిసింది. మేమూ ఈ పత్రిక పని చెయ్యమండీ" అంది భారతి.

"ఔను మేడం" అంది సుజాత.

"అదేంటమ్మా-నాకోసం మీరు పని మానెయ్యటం దేనికి?"

"మీ కోసం మానేసినా పొరపాటు కాదులెండి. మిమ్మల్నింత అగౌరం చేసిన వాళ్ళు మమ్మల్ని మాత్రం మంచిగా చూస్తారా? మా సమస్యలు మాత్రం పట్టించుకుంటారా?" అన్నది భారతి.

"మీరు నిదానంగా ఆలోచించుకోండమ్మా. నేను వెళతాను"

"మేడం. రేపు మీరు ఇంట్లో ఉంటారా? మేం వస్తాం" సుజాత అడిగింది.

"ఉండనమ్మా. ఇవాళ రాత్రే ఢిల్లీ వెళదామనుకుంటున్నా"

"ఢిల్లీనా? ఎందుకండి?" సుజాత సందేహిస్తూ అడిగింది.

"నా ఫ్రెండు దగ్గరకు. అక్కడ ఉద్యోగం చేస్తోందామె. ఇవాళ ఇక నేను ఇంట్లోంచి

బైటికి నడవక తప్పదు.'' కాంతిహీనమైన అరుణముఖం చూసి సుజాత, భారతీ బిక్క ముఖాలు పెట్టారు.

''మేమూ వస్తాం మేడం. మిమ్మల్ని రైలెక్కించి వెళతాం'' అంది భారతి.

''అలాగే-మీరు స్టేషన్‌కి వెళ్ళి నాకో టికెట్ కొని ఉంచండి. నేను ఇంటికి వెళ్ళి పాపను తీసుకుని వస్తాను'' అంది.

వాళ్ళు ఏం చెప్పలేక సరేనన్నారు. అరుణ డబ్బులు పర్సులోంచి తీసి ఇస్తూ,

''ఢిల్లీ అడ్రసు ఇస్తాను. మీరు ఆ అడ్రస్‌కి టెలిగ్రాం ఇవ్వాలి, నేనివాళ బయల్దేరుతున్నట్లు. ఈ సాయంకూడా చేసి పెట్టండి'' అంది పేలవంగా నవ్వుతూ.

''అయ్యో-సాయమేమిటి మేడం'' అంటూ డబ్బులూ, అడ్రసూ తీసుకుని వెళ్ళారు.

అరుణకు ఇల్లు కనపడగానే గుండెల్లో దేవినట్లనిపించింది. మూడు సంవత్సరాల పాటు ఆ ఇల్లు తనదిగా గర్వంగా తిరిగింది. ఇవాళ ఆ ఇల్లు తనది కాదు. గేటు తీస్తుంటే దుఃఖం తన్నుకు వచ్చింది. తను బలహీన పడకూడదని బలవంతాన నిగ్రహించుకొంది. ఎందుకు దుఃఖం? జీవితంలో కొన్ని వాస్తవాలు తెలిశాయి. కొన్ని అనుభవాలు కలిగాయి. వాటిని తీసుకోవాలి. జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కోవాలి.

జరిగిన విషయాలన్నీ మర్చిపోయి ఇక్కడ ప్రకాశంతో మళ్ళీ జీవితం మొదలుపెట్టడం తనవల్లకాదు. తాను చేసిన దాంట్లో తప్పేమీలేదు. ప్రకాశం తనను కంట్రోలు చెయ్యటం తాను భరించలేదు. అది తప్పని గ్రహించవలసింది ప్రకాశం. తనని కోల్పోతున్న విచారం ప్రకాశానికి లేనిది తనకెందుకు? ఆ విచారం ప్రకాశానికి ఉన్ననాడు తన తప్పు తాను తెలుసుకుంటాడు. తన జీవితం తనది. ఆ జీవితాన్ని ధైర్యంగా గడపాలి!

తలుపు తట్టింది. ప్రకాశం తలుపు తీశాడు.

''ఎందుకొచ్చావు? ఏం నిర్ణయించుకొన్నావు''అన్నాడు విసురుగా.

''పాపని తీసుకుని వెళ్ళిపోటానికి వచ్చాను''

''పాపని తీసికెళ్తావా? పాపను నేను నీకిస్తానా? నీకు పాపమాత్రం ఎందుకు? నీ తిరుగుళ్ళలో దాన్ని పట్టించుకోకుండా చంపటానికా?''

''పాపను ఇవ్వవూ?'' అరుణనిర్ఘాంతపోయింది.

''అమ్మా అరుణా. ఎందుకొచ్చిన పంతాలమ్మా-పాపకోసమన్నా మీరిద్దరూ ఒర్పుగా ఉండాలమ్మా'' కమలమ్మ అరుణ చేతులు పట్టుకుంది.

''అమ్మా-నువ్వావిడనేం బతిమాలొద్దు. తన తప్పు గ్రహించలేని అమాయకురాలేం కాదు. ఆవిడ అహంకారంతో...''

''ప్రకాశం. నువ్వింక మాట్లాడొద్దు. ఒకరినొకరు మాటలనుకోవద్దు. మనం కలిసి శాంతిగా బతకలేమని తెలిసింది. కనీసం వేరుగానన్నా శాంతిగా బతుకుదాం'' నిద్రపోతున్న పాపను చేతుల్లోకి తీసుకోబోయింది.

ప్రకాశం వచ్చి పాపను తీసుకొని గదిలోకి వెళ్ళిపోయాడు. విసురుగా గడివేసుకున్నాడు.

అరుణకు ఏం చెయ్యాలో తోచలేదు. ఒళ్లంతా నీరసం కమ్మేసింది. కాళ్ళు వణికి కిందే కూలబడింది.పాపలేకుండా వెళ్ళాలనుకుంటేనే అరుణ గుండె గొంతులోకి వచ్చినట్లనిపించింది. పేగులన్నీ ఎవరో చెయ్యిపట్టి తిప్పినట్లే అల్లాడిపోయింది.

''అత్తయ్యా'' అంటూ కమలమ్మ వంకచూస్తే ఆవిడ ఏడుస్తోంది.

''అత్తయ్యా. నేను వెళ్తున్నాను. పావజాగ్రత్త. మీరు పాపను జాగ్రత్తగానే చూస్తారు. కానీ నేనే పాపను వదిలి ఉండలేను'' పిచ్చిపట్టినట్టు పెద్దగా ఏడ్చింది అరుణ.

ఒంటరిగా వొట్టి చేతులతో ఆ ఇంటినుంచి బైటపడింది. మూడేళ్ళ క్రితం ఎలా వచ్చిందో అలాగే.

'ప్రకాశం కోసం, ప్రేమ కోసం, స్వేచ్ఛకోసం కన్నవారిల్లు వదిలినపుడు ఎంతో సంతోషంగా, ధైర్యంగా, ఉత్సాహంగా ఉంది. అప్పటికీ ఇప్పటికీ ఏమిటీతేడా? ఇప్పుడు ప్రకాశం లేదు. ప్రేమలేదు.

స్వేచ్ఛ మాత్రం ఉంది. అనంతమైన

శూన్యం నిండా పరుచుకుని ఉన్న స్వేచ్ఛ. ఏమిటీ స్వేచ్ఛకు అర్థం? ఏమిటీ స్వేచ్ఛ గమ్యం? ఎలాంటిదీ స్వేచ్ఛ నడక?

ఈ జీవితం సరిపోతుందా, వీటిని తెలుసుకోటానికి? స్వేచ్ఛకు అర్థం తెలుసుకోవటమేనా జీవితం?

జీవితం-స్వేచ్ఛ-ఈ రెండూ వేరువేరు విషయాలా? ఒకటి కాదా?

స్నేహం సహాయంతో ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతుకుదామని రైలు ఎక్కింది అరుణ.

''మేడం మీరు వెళ్ళాక ఉత్తరం రాయండి'' అంది సుజాత.

''తప్పకుండా రాస్తాను'' కన్నీళ్ళలోంచి నవ్వింది అరుణ.

''మళ్ళీ ఎప్పుడొస్తారు మేడం?''

''ఒకనెల శలవు పెడతాను. ఆ తర్వాత వస్తాను''

''మేడం. మీరొచ్చాక మనం ఏదో ఒక పని చేద్దాం. పత్రిక పని కాక మనమేం చెయ్యలేమా? మనలాంటివాళ్ళను కలుపుకొని మనం ఏదో ఒకటి చేద్దాం'' భారతి అంది.

అరుణ నవ్వింది. రైలు కదిలింది.

★ ★ ★

''ఎందుకమ్మా— నామీద ఇంత హఠాత్తుగా దయ కలిగింది'' అంది ఉమ అరుణను దగ్గరకు తీసుకుంటూ.

''నీ మీద దయకాదు. నా అవసరం'' అంది అరుణ నీరసంగా నవ్వుతూ.

ఏదో జరిగిందనే విషయం అరుణ టెలిగ్రాం చూడగానే ఉమ ఊహించింది. ఇప్పుడు ట్రైన్‌దిగిన అరుణను చూడగానే తన ఊహ నిజమని అర్థమయింది. జనరల్ కంపార్టుమెంటులో హైదరాబాదు నుంచి ఢిల్లీ వచ్చిన అరుణ ఆకారమూ, కళ్ళల్లో గూడుకట్టిన దిగులూ ఉమకు ఎన్నో విషయాలు చెప్పాయి.

''పాపని తీసుకురాలేదేం—'' టాక్సీలో కూచున్నాక అడిగింది ఉమ. ఉమ ఒళ్ళో తలపెట్టుకుని నిశ్శబ్దంగా ఏడుస్తూ కూచుంది అరుణ.

''ఊరుకో—అరుణా. పిచ్చి పిల్లలా ఏమిటిది?'' ఉమ మెల్లిగా సముదాయించింది.

అరుణ దుఃఖం తగ్గకుండానే ఇల్లు చేరారు. ఉమ కాఫీచేసి ఇచ్చింది. అరుణ కాఫీతాగి స్నానంచేసి వచ్చేసరికి ఉమ టిఫిన్ సిద్ధంచేసింది. రెండు రోజులనుంచీ సరైన తిండిలేక నీరసంతో ఉందేమో అరుణ మాట్లాడకుండా టిఫిన్‌తినేసింది.

''ఇప్పుడు చెప్పు ఏం జరిగిందో'' అరుణ పక్కనే కూచుని అరుణ తలని ఒళ్ళోకి తీసుకుంటూ అడిగింది.

''కొత్తగా చెప్పటానికేముంది? నీకు అర్థమయ్యే ఉంటుంది. నేను ప్రకాశంతో కలిసి బతకలేక వచ్చేశాను.''

''అది అర్థమయిందిలే! అసలు విషయం ఏమిటి?''

''నీకు ఉత్తరాల్లో రాస్తున్నానుగా ఉమా—నేను పత్రికపని చేస్తున్నాననీ, అది ప్రకాశానికి ఇష్టంగా లేదనీ. ఆ విషయంలోనే గొడవలయ్యాయి. ఆ పత్రికపని మానేస్తేనే మేమిద్దరం కలిసి బతకటం కుదురుతుందన్నాడు ప్రకాశం''

''నువ్వు మానెయ్యనన్నావా?''

''నేనేమీ అనలేదు. నిజానికి నేనిపుడు ఆ పత్రికలో పనిచెయ్యటం మానేశాను.''

''మరి—''

''పత్రికపని అనే కాదు. నా ఇష్టమైన పని ఏదైనా నేను చేస్తాను. దానిని ప్రకాశం కంట్రోలు చెయ్యటం, అతనికి ఇష్టమైన పనులు చేస్తేనే మా మధ్య సంబంధం నిలుస్తుందన్నట్లు మాట్లాడటం ఇవన్నీ భరించలేను. నా జీవితం తనకు మాత్రమే పరిమితమై ఉండాలంటాడు ప్రకాశం. నాకట్లా బతకటం ఇష్టంలేదు. నాకు ప్రపంచంతో సజీవ సంబంధం కావాలి. నా ఉనికివల్ల సమాజానికేదో ఒక చలనం ఉండాలి. అది ప్రకాశం భరించలేడు.''

''మరి పత్రికపని ఎందుకు మానేశావు.''

''అక్కడుందరూ ప్రకాశాన్ని మించినవాళ్ళే.''

''అంటే—''

''ఆ పత్రికలో పనిచేసే మగాళ్ళందరూ

మగాళ్ళే. మగాడి ఇష్టాల ప్రకారం ఆడది నడుచుకోవాలని వాళ్ళ ఉద్దేశం. వాళ్ళ భార్యల్ని గృహలక్ష్ములుగానే ఉంచుతారు. నాబోటి వాళ్ళను అవసరమైనపుడు పిలుస్తారు. నా భర్తకు ఇష్టమై నేను పనిచేస్తే మంచిది. నా భర్తకూ నాకూ గొడవలొస్తే మాత్రం 'పత్రిక పని మాని సంసారంగొడవ చూసుకోండి. మీ జీవితం పాడుచేసుకోకండి' అని సలహాలిస్తారు.''

''నిజంగానే?''

''నిజంగానే.''

''మరి ఇన్నాళ్ళూ నువ్వెలా పనిచేశావు?''

''ఇవన్నీ తెలియక. వాళ్ళు సమాజంలోజరిగే అన్యాయాల్ని పత్రికద్వారా అందరికీ చెబుతున్నారు. గొప్ప గొప్ప ఆదర్శాలు మాట్లాడుతున్నారు. గొప్ప మేధావులున్నారు వాళ్ళలో. వాళ్ల తో కలిసి పనిచెయ్యటం గొప్ప అనుకున్నాను. కానీ తీరాచూస్తే ఒక సమస్య వచ్చేసరికి అందరి సత్తా బైటపడింది.''

''సరేలే—ఆ పత్రిక సంగతలా ఉంచు. ప్రకాశంగురించి చెప్పు. ప్రకాశాన్ని వదిలి నువ్వుండగలవా? మీ ప్రేమ—''

''నాకు ప్రకాశంమీద ప్రేమలేదు'' ఉమ మాటల్ని మధ్యలోనే ఆపేసి అరుణ లేచి కూర్చుంది.

ఉమ ఆశ్చర్యంగా చూసింది.

''నీకాశ్చర్యంగా ఉండొచ్చుగానీ నాకు ప్రకాశంమీద ప్రేమలేదు.''

''ఆశ్చర్యంగా లేదులే. నీకు ప్రకాశంమీద చాలా కోపంగా ఉందని అర్థమౌతోంది'' ఉమ నవ్వబోయింది.

''కోపమా? కోపం ఎందుకు?''

''నీ స్వేచ్ఛకు అడ్డంవచ్చాడని''

''నా స్వేచ్ఛకు అడ్డంరానని అతనిచేత నేనేం ఒప్పించలేదుగా.''

''అంటే—''

''ఉమా! ప్రకాశాన్ని పెళ్ళిచేసుకునేనాటికి అతన్నిగురించి నాకు తెలియదు. ప్రకాశం నన్ను ప్రేమించాడన్న విషయాన్ని నేను ప్రేమించాను. అతన్ని ప్రేమించటానికి నాకు అతన్నిగురించి ఏమీ తెలియదు. అతను జీవితంగురించి ఏమాలోచిస్తున్నాడు, వేటికి విలువనిస్తాడో ఇవేవీ నాకు తెలియవు. నాగురించే నాకు తెలియదు. క్రమంగా నాకు జీవితంలో ఏంకావాలో, ఏముంటే నేను తృప్తిగా బతుకుతానో అర్థమైంది. నేనేమిటో నాకర్థమయ్యాక—ప్రకాశానికీ నాకూ మధ్య భావాలలో పెద్ద అగాధముందని తెలిశాక—ఇంకా నాకు ప్రకాశాన్ని ప్రేమించాననే భ్రమ వుంటుందంటావా? ప్రేమించానని ఇంకా నమ్మగలనంటావా?''

అరుణ మాట్లాడటం మానేసింది. ఉమ ఏమీ మాట్లాడలేదు. అరుణ మాటల్లో ఆవేశం ఎంతా నిజమెంతా అని అంచనా వేస్తున్నట్లు అరుణ ముఖంవంకే చూస్తూ కూచుంది.

''నాపెళ్ళికి ముందు స్వేచ్ఛకోసం పెళ్ళి చేసుకుంటానంటున్న నన్నుచూసి నువ్వు నవ్వావు గుర్తుందా. ఆ నవ్వు వెనకాల ఉన్న అర్థం ఇప్పుడు తెలిసింది.''

''ఆరోజు నేనామాట అంత సీరియస్‌గా అనలేదు''

''నేనూ సీరియస్‌గా తీసుకోలేదు. నిజానికి ఆరోజు నేను కోరుకున్న స్వేచ్ఛకు అర్థంలేదేమో. ఇంట్లోవాళ్ళు నన్ను కట్టడిచేస్తున్నారనీ, సినిమాలకీ, షికార్లకీ తిరగనివ్వటంలేదనే కోపంతప్ప మరింకో ఆలోచన లేదు. స్వేచ్ఛ అంటే అప్పుడు నా దృష్టిలో నాకిష్టమైన చీరలు కట్టుకోవటం, సినిమాలకూ, స్నేహితులతో షికార్లకూ ఎవరి ఆజ్ఞలకూ లోబడకుండా తిరగటం. అంతే! అవన్నీ ప్రకాశాన్ని పెళ్ళిచేసుకుంటే కుదురుతాయనుకున్నాను. అవి కుదిరాయికూడా. కాకపోతే ఇంటిపనిలో, పిల్లల పెంపకంలో కూరుకుపోయి జీవనోత్సాహం పోగొట్టుకుంటానా అనే అనుమానం ఉండేది. అది ప్రకాశంతో మాట్లాడాను. కానీ ఇప్పుడు స్వేచ్ఛ అంటే ఏమిటో నాకింకా బాగా అర్థమైంది. స్వేచ్ఛ ఎందుకో, దాని విలువేమిటో బాగా తెలిసింది.''

స్వేచ్ఛ అంత తేలిగ్గా వొకగడపదాటి యింకో గడపలో కాలు బెట్టినంత మాత్రాన దొరికేది కాదని అర్థమయింది.''

"అందుకే నేనూ సుధీరూ పెళ్ళిచేసుకోకుండా విడివిడిగావుంటున్నాం. ఒకరికి యింకొకరు అడ్డంవచ్చే ప్రసక్తిగానీ, వొకరి విషయాల్లో యింకొకరి ప్రమేయంగానీ లేకుండా బతుకుతున్నాం''

"ఆ పద్ధతి సరైందేనా ఉమా?''

"నీకేమనిపిస్తోంది-?'' కుతూహలంగా అడిగింది ఉమ.

"అది సమస్యనుంచి తప్పించుకోవటమనిపిస్తోంది గానీ సమస్యను యెదుర్కోటం అనిపించటంలేదు ఉమా - పెళ్ళి తంతు గొడవ వొదిలెయ్యి. దాన్ని నమ్మే స్థితిలో లేనులే. కానీ మీరు ప్రేమించుకొని వొకచోట కలిసి వుండలేమేమో? వుంటే వొకరి స్వేచ్ఛకు వొకరు అడ్డంగా వుంటామేమోనని విడివిడిగా వుండటం పిరికితనం కదూ- ఒకరిమీద వొకరికి అపనమ్మకం కదూ?....'' ఉమని నొప్పిస్తున్నానా అన్నట్టు ఆగింది అరుణ.

"నీకలా అనిపిస్తోందా?'' ఆలోచనగా అంది ఉమ.

"ఔను. నువ్వు నీవిషయం రాశాక చాలా ఆలోచించాను. ఒక్కోసారి నీ నిర్ణయం చాలా బాగుందనిపించేది. మళ్ళీయెక్కడో యేదో లోపముందనిపించేది. మీఇద్దరికీ పెళ్ళి స్వేచ్ఛను హరిస్తుందని తెలుసు. ఎవరిస్వేచ్ఛ వాళ్లకుండాలనీ తెలుసు. కానీ కలిసి జీవిస్తే ఎక్కడ గొడవలొస్తాయోననే భయంతో విడిగా వుంటున్నారు. దానికంటే కలిసివుంటూ వొకరి స్వేచ్ఛను యింకొకరు గౌరవించటం నయంకదూ-''

"అరుణా - ఒకరి స్వేచ్ఛను యింకొకరు గౌరవించుకుంటూ ఆదర్శంగా బతకటం - నిజంగా యీ వూహచాలా అద్భుతంగా వుంటుంది. కానీ జీవితంలో అది కుదరదు. జీవితం మన ఆదర్శాలూ ఆలోచనల ప్రకారం జరగదు. పైగా మన జీవితం మనది మాత్రమేకాదు. చుట్టూవున్న సమాజ ప్రభావంకూడా వుంటుంది. ఎక్కడో యేదో గొడవ మొదలవుతుంది. ఆ గొడవలకు ఆస్కారం యివ్వకుండా వుందామనే యిలా వుంటున్నాం. ఇలాగే వుండాలని కూడాలేదు. మాకెప్పుడు యీ పద్ధతి వద్దనిపిస్తే అప్పుడే కలిసి వుంటాం''

ఇద్దరూ యెవరి ఆలోచనల్లో వాళ్ళు కొంతసేపు గడిపారు. హఠాత్తుగా ఉమ అడిగింది.

"నీకు యీరకమైన ఆలోచనలు లేకపోతే, సమాజంతో సంబంధంలేకుండా వుంటే ప్రకాశం నీదృష్టిలో మంచివాడే గదూ-నీకు ప్రకాశంతో గొడవలొచ్చేవి కాదుగదూ-''

అరుణ కాసేపేం మాట్లాడలేదు. ఐదు నిమిషాలలాగే ఆలోచిస్తున్నట్టు వుండి తనకు తాను చెప్పుకుంటున్నట్టు నెమ్మదిగా మొదలెట్టింది.

"ఔను - నాకు సమాజంతో సంబంధంలేకుండా ప్రకాశమే ప్రపంచమైతే, ప్రకాశం చాలామంది మగవాళ్ళకంటే మంచివాడే. నేనూ యేవో చిన్న చిన్న చికాకులొచ్చినా సర్దుకుపోయేదాన్నేమో-'' తన ఆలోచన తనకే నచ్చినట్టు ఆగిపోయి మళ్ళీ అంది.

"కానీ ఉమా. యెంతమంచివాడైనా మగాడు ఆడదాన్ని కంట్రోలు చెయ్యకుండా వుండలేడు. ప్రకాశం మాపెళ్ళయిన రెండోనెలలోనే నన్ను కంట్రోలు చేశాడు. నేను ఎబార్షన్ చేయించుకోలేక పోయాను. నాశరీరంమీద నాకు హక్కులేకుండా పోయిందిగదా. మన చైతన్యాన్నిబట్టి మనం మగాళ్ల పెత్తనం సహిస్తుంటాం. మనం వ్యక్తిత్వంతో వుంటేగాని వాళ్లపెత్తనం మన జీవితమంతా - అతిచిన్న కదలిక దగ్గరినుంచి - వాళ్లగుప్పిట్లో యెలా వుందో అర్థంకాదు. ఆ గుప్పిటినుంచి బైటపడటానికి యెవరికి వాళ్ళం ప్రయత్నిస్తూనే వున్నాం. నేను ప్రకాశాన్ని వొదిలేసి వచ్చాను. నువ్వు సుధీర్‌తో పెళ్ళి లేకుండా కొత్తరకంగా జీవితం గడుపుతున్నావు. మరి కొందరు వొంటరిగా వుండిపోతున్నారు. కొందరు ఆ పెత్తనాన్ని సహించలేక చచ్చిపోతున్నారు. ఎవరికి వాళ్ళంగా మన ఐడెంటిటీ కోసం తపనపడుతూనే వున్నాం. స్ట్రగులవుతూనే వున్నాం.''

అలా వాళ్ళ జీవితాల్లోంచి వచ్చిన అనుభవం ద్వారా ఆడవాళ్లందరి స్థితినీ అర్థంచేసుకునే ప్రయత్నం చేస్తూ ఆరాత్రి యెప్పటికో నిద్రపోయారా ఇద్దరూ!

అరుణ నిద్రలేచే సరికి యెనిమిది దా

టింది. ఉమ అప్పటికే బయటకెళ్ళింది. అరుణ లేచి టీతాగి టేబుల్‌మీదున్న పుస్తకాలు చూస్తుంటే ఉమ రాసిపెట్టిన చిన్నవుత్తరం కనిపించింది.

"అరుణా - నేను ఆగ్రాకూ, భరత్‌పూర్‌కూ టిక్కెట్లు రిజర్వు చేయించుకురావటానికి స్టేషన్‌కి వెళ్తున్నా. సుధీర్‌కి కూడా మనప్రోగ్రాం గురించి చెప్పివస్తాను. రేపు మనముగ్గురం భరత్‌పూర్‌గానీ ఆగ్రాకానీ వెళదాం. నువ్వు బ్రెడ్‌తిని - వోపికుంటే వంటచెయ్యి. త్వరగానే వచ్చేస్తాను.- ఉమ."

అరుణ వుత్తరం చదివి అలాగే కూచుంది. ఉమ యీనెలరోజులూ తనని సంతోషంగా వుంచటానికి ప్రయత్నిస్తుంది. ఉమ సాయంతో తాను కొత్తవుత్సాహంతో హైదరాబాదు వెళ్ళాలి. వెళుతుంది. కానీ పాప?

నా చిన్నారిమువ్వ. నాచక్కనిచుక్క. ఏం చేస్తోందో, యెలా వుందో? అమ్మేదని ఎంత అడుగుతుందో - బెంగపెట్టుకుంటుందేమో? పాపను తలుచుకుంటే అరుణకు దుఃఖాన్ని నిగ్రహించుకోవటం కష్టంగా వుంది. ఉమ వచ్చేవరకూ అలాగేకూచుంది అరుణ.

ఉమ వస్తూనే-

"రేపు ఆగ్రాకే టిక్కెట్లు తీసుకున్నాను. భరత్‌పూర్‌కి రెండురోజులాగి వెళ్ళొచ్చు" అంది నవ్వుతూ.

అరుణ మాట్లాడకపోయేసరికి దగ్గరికివచ్చి చూసింది. యేడ్చినట్లున్న అరుణముఖం చూడగానే ఉమకు దిగులేసింది.

"ఏంటమ్మా- యెందుకలా చెప్పు" అంది అరుణ తలమీద చెయ్యివేసి తన గుండెలదగ్గరకు తీసుకుంటూ.

"పాప బాగా గుర్తొస్తోంది." అంది అరుణ కళ్లనీళ్ళు జలజలా రాలుతుండగా.

"ఊరుకో- ఒక నెలరోజులు యేదో పనిమీద ఇక్కడికి వచ్చావనుకో. మీరు బెంగుళూరు వెళ్ళినప్పుడు వారం రోజులు పాపనొదిలి వుండలేదూ? హైదరాబాదు వెళ్లగానే పాపను తెచ్చుకో-"

"ఇస్తాడంటావా?" దేనికీ భయపడని అరుణకళ్లల్లో భయం, పిరికితనం చూసింది ఉమ.

"ఇవ్వకపోతే వూరుకుంటావా? పాపకు తొమ్మిదేళ్ళు వచ్చేదాకా నీదగ్గరే వుండాలి. అది నీహక్కు. మంచిగా అడుగు. లేకపోతే కోర్టుకి వెళ్ళాలిక."

"ఏమిటో యిదంతా - పాపను తలుచుకుంటుంటే నా ఆలోచనలన్నీ మానేసి ఆ యింటికి వెళ్ళిపోదామనిపిస్తోంది. పాప లేకుండా నేబ్రతకలేను." అరుణ యేడుపు ఆగటంలేదు.

"పాప లేకుండా యెందుకుంటావు. పాప నీదగ్గరికి వచ్చేస్తుంది. నువ్వు ధైర్యంగా వుండాలి. లే-"

అరుణ మాట్లాడకుండా కూచుంది.

కాసేపాగి 'తొమ్మిదేళ్ళ తర్వాత పాపమీద నాకేం హక్కులేదుగా" బేలగా అడిగింది.

"అప్పటి విషయం ఇప్పుడాలోచించి ప్రయోజనమేముంది చెప్పు. అప్పటి పరిస్థితులెలాఉంటాయో. పాప యేమంటుందో - తొమ్మిదేళ్ళుఉనీదగ్గర పెరిగిన పాప నిన్నొదిలి వెళ్ళిపోతానంటుందీ —" ఉమ ధైర్యం చెప్పింది.

"ప్రకాశానిక్కూడా పాపంటే చాలా ఇష్టం"

"మీ ఇష్టాలు సరే. పాప కాస్త పెరిగాక తనకెక్కడ ఇష్టమయితే అక్కడుంటుంది. పాప స్వేచ్ఛను నువ్వు కాదంటావా?" అరుణ మాట్లాడలేదు.

ఉమే మళ్ళీఅంది.

"పాప సంగతి సరే - నీసంగతేమిటి - నువ్వేం చేద్దామనుకుంటున్నావు? ఉద్యోగం మాత్రమేచేస్తూ నువ్వు శాంతిగా బతకగలవని నాకనిపించటంలేదు."

"ఏదోవొకటి చేస్తాను."

"ఏదోవొకటంటే?"

"అదింకా నాకు తెలియదు. కానీ ఉమా, మనం చెయ్యదల్చుకోవాలేగాని చెయ్యటానికి ఎంతపనివుందో— నాకు సంగమ్మని చూశాకా, మెహందీ స్త్రీలను చూశాకా అర్థమయింది. సంగమ్మని కోర్టుకి పంపి ఆ దుర్మార్గుడ్ని శిక్షించగలిగితే, మెహందీ స్త్రీలకు లైసెన్సులిప్పించగలిగితే— ఒక్కోపనికీ జీవితకాలం సరిపోదు. ఆడవాళ్లకోసం ఆడవాళ్లం ఏదోఒకటి

చెయ్యాలి. నేనిలాంటిపని ఏదోవొకటి చేస్తాను. నాకలా చెయ్యాలని బలంగా అనిపిస్తోంది. మనలాంటివాళ్ల స్వేచ్ఛకోసం ఏమీ చెయ్యక పోతే మన స్వేచ్ఛకు అర్థమేముంది? నాకెందుకో రోజురోజుకీ నేను స్త్రీనన్న స్పృహ పెరుగుతోంది ఉమా. చిన్నప్పటినుంచీ లేదనికాదు. వయసు పెరుగుతున్నకొద్దీ, అనుభవాలు పొందుతున్నకొద్దీ, సమాజాన్ని చూస్తున్నకొద్దీ నేను స్త్రీనని అందరూ చెబుతున్నట్లనిపిస్తోంది.''

''నువ్వొక్కదానివే ఏం చెయ్యగలవు?''

అరుణ ప్రాక్టికల్‌గా ఆలోచిస్తోందా, ఆవేశంతో మాట్లాడుతోందా అన్న సందేహం ఉమది.

''సుజాతా, భారతీ ఉన్నారు. నాలాంటివాళ్ళు ఇంకా ఉంటారు. చెయ్యగలిగిన వరకే చేస్తాను.''

''కానీ నువ్వుచేసే పనులవల్ల ప్రయోజనం ఎంతఉంటుందీ అని— సంగమ్మని రేప్‌చేసినవాడికి శిక్ష పడుతుంది. ఆపైన 'రేప్' అనేది లేకుండాపోతుందా? మెహందీ స్త్రీలకు లైసెన్సులిస్తారు. బొంబాయిలో ఇప్పుడు లైసెన్సులున్నాయి. అంతమాత్రాన వాళ్ళ జీవితాలు మారిపోతాయా? సమాజమంతా భయంకరంగా ఉన్నప్పుడు నువ్వుచేసే పని యేమూలకు? నీ చేతలతో ఈ సమాజం ఎప్పటికి మారేను?''

''మొత్తం సమాజాన్ని మార్చటం నాకు చేతకాదని - నాకు చేతనైందికూడా నేను చెయ్యొద్దా? అలా చెయ్యకుండా నేను బతకలేనని నాకు తెలిసిపోయింది. ఆ పనిలో నన్ను నేను నిరూపించుకుంటున్నాను. దానివల్ల నాకెంతో తృప్తి - నా జీవితం సార్ధకమవుతోందన్న భావం. ఆ భావం కలగటమే స్వేచ్ఛకు అర్థంకాదూ? నా బతుకుమాత్రమే నేను బతకటానికయితే నాకీ స్వేచ్ఛ అక్కర్లేదు. నా స్వేచ్ఛకు ఒక అర్థంఉండాలి. ఆ అర్థంకోసం అన్వేషించటమే ఇప్పుడు నా పని.''

నీరసంగా దిగులుగావున్న అరుణ ముఖంలో కాంతిగా వెలుగుతున్న కళ్లను చూస్తూ వుండిపోయింది ఉమ.

★

# అంకితం

ఆంధ్రదేశంలో ఏ ఆడపిల్లా పెరగనంత స్వేచ్ఛగా
పెరగనిచ్చి ఆ స్వేచ్ఛ వల్ల ఎన్ని ఇబ్బందులొచ్చినా
భరించి-నన్ను ప్రేమించిన

అమ్మా నాన్నా
పోపూరి వెంకట సుబ్బమ్మ
పోపూరి వెంకట సుబ్బారావు - లకు
ప్రేమతో అంకితం ఈ స్వేచ్ఛ —ఓల్గా



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. "చతుర సమీక్ష" శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆనవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు :

1. '**చతుర సమీక్ష**' కు పంపే మీ రచన అరఠావుకుమించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈకింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై "**చతుర సమీక్ష**" కు అని పేర్కొనాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మూడింటికి రు.100, రు.75, రు.50 చొప్పున, మరో మూడింటికి రు.25 చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచేలక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనేవంతు పాఠకులదే.

---

**కూపన్**

ఫిబ్రవరి 'చతుర' నవల: స్వేచ్ఛ

సమీక్షకుని పేరు ........................................

చిరునామా ........................................

........................................

........................................

# చతుర కతలు

## ప్రయోగం

హుషారుగా ఈలవేసుకొంటూ హొటల్లోకి ప్రవేశించాడు రాంబాబు.

హొటల్లో ఓమూల సీట్లో ఒంటరిగా కూర్చొనివున్న సునందను చూడగానే అతడి కళ్లు ఆనందంగా మెరిశాయి.

సునంద, రాంబాబు గత రెండేళ్లుగా ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకొంటున్నారు.

తమ చదువులు పూర్తికాకుండా పెళ్లిమాట తలపెట్టకూడదని నిర్ణయించుకొన్నారా ప్రేమికులు.

గబగబా సునంద టేబుల్ దగ్గరకెళ్లి ''హాయ్! సున్నీ!'' అన్నాడు రాంబాబు, ఆమె పక్కసీట్లో కూలబడుతూ.

పట్టించుకోనట్లు కూర్చొంది సునంద.

మరోసారి పలకరించాడు రాంబాబు.

''ఎక్స్‌క్యూజ్‌మి! ఆ సీటు ఖాళీ చేస్తారా?'' అంది సునంద.

''ఏమయింది సున్నీ...?'' ఆతృతగా అడిగాడు రాంబాబు.

''మిస్టర్! నాపేరు సునంద, 'సున్నీ'ని కాను. ఆ సీటు నా బాయ్‌ఫ్రెండ్ కోసం ఉంచింది. దాన్ని ఖాళీ చేస్తారా?'' కోపంగా అంది సునంద.

సునంద జోక్ చేస్తూందనిపించిందతడికి.

''జోక్ చేయడానికి సరయిన ప్రదేశంకాదు... అందరూ మనల్నే చూస్తున్నారు, చూడు '' అన్నాడు.

''షటప్! ఇందాకట్నుండి చూస్తున్నాను. ఒంటరిగా ఆడపిల్ల కనిపించగానే వళ్లు తిమ్మిరెక్కిందా?'' అందామె.



రాంబాబు ముఖం రక్తంలేనట్లు పాలిపోయింది.

"సునీ్న ఏమయింది నీకీవేళ?" అన్నాడు అతిక ష్టంమీద గొంతు పెగుల్చుకొని.

"ఎవడ్రా నువ్వు...? మాటల్తో చెబితే అర్థం కావటంలేదా... ముందిక్కడ్నుంచి కదుల్తావా, లేదా?" తీక్షణంగా చూస్తూ అంది సునంద.

బెదిరిపోయాడు రాంబాబు.

"సునీ్న! నీ ప్రియుడు రాంబాబునే అవమానిస్తు న్నావన్న సంగతి మర్చిపోతున్నట్టున్నావు...!"

"రాస్కెల్... పళ్లు రాలగొడ్తాను!!" గట్టిగా అరుస్తూ ఎడమకాలి చెప్పు అందుకొంది సునంద.

రాంబాబు ముఖం వెలవెలబోయింది.

"ఏమయింది" అంటూ నలుగురయిదుగురు గుమిగూడారు టేబుల్ చుట్టూ.

"ఇట్సాల్‌రైట్... నీ సంగతి తర్వాత తేల్చుకొంటాను" సునందకు మాత్రమే వినబడేలా అని 'ఈవిడ్ని చూసి మాఫ్రెండ్ అనుకొని పొరబడ్డాను' అంటూ చుట్టూ మూగిన జనానికి సర్దిచెప్పి, మరో మూలనున్న కుర్చీలోకి వెళ్లికూర్చొన్నాడు రాంబాబు.

ఓ పదినిముషాల్లో మూడు కప్పుల కాఫీ సేవించాడు రాంబాబు.

అతడి తల గిర్రున తిరుగుతోంది. సునంద ఎందుకలా ప్రవర్తించిందో తల బద్దలు కొట్టుకున్నా అర్థం కావడంలేదతనికి. 'తనకంటే అందగాడూ, ఆస్తిపరుడూ అయిన మరో యువకుడ్నిగానీ సునంద వరించలేదుకదా? ఛఛ! తన సునీ్న అలాంటిది కాదు'.

మరికొంచెంసేపు అలానే ఆలోచిస్తోంటే పిచ్చెక్కేలా ఉందతనికి.

సునందవంక గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు రాంబాబు...?

ఓ అయిదునిమిషాల తరువాత సునంద నేరుగా అతడి సీటు దగ్గరకొచ్చి "హలో రాంబాబు! హౌఆర్ యూ?" అంది చిరునవ్వుతో.

ఇందాకటి షాకునుంచి ఇంకా తేరుకోని రాంబాబు ఆమెవంక నిర్వికారంగా చూశాడు.

"కోపం వచ్చిందా నామీద! నీమీద... నీమీద చిన్నప్రయోగం చేశాను అంతే! తను గాఢంగా కోరుకొన్నది లభ్యంకాదని తెలిసినప్పుడు ఓ వ్యక్తి మనోభావాలు ఎలా ఉంటాయి? అతడెలా ప్రవర్తిస్తాడు? అన్న విషయంమీద వివరంగా ఓ వ్యాసం రాసుకురమ్మంది మా సైకాలజీ లెక్చరర్! సెలెక్ట్‌అయిన దానికి గోల్డ్‌మెడల్ ఇస్తారట. అందుకే నిన్ను కష్టపెట్టాల్సివచ్చింది. నన్ను క్షమించవూ..." అంటున్న సునందను ఈడ్చి ఓలెంపకాయ వేశాడు రాంబాబు.

షాక్ తినిపోయి వలవలా ఏడుస్తూ, చెంప తడుముకొంటున్న సునందతో కాసేపాగి అన్నాడు రాంబాబు.

"మరేమనుకోకు. మా లెక్చరర్ నాక్కూడా దాదాపు అలాంటి సబ్జెక్టే ఇచ్చాడు."

# లక్కీ నెంబర్

రామారావు మా ఆఫీసులో టైపిస్ట్‌గాచేరి నాలుగు సంవత్సరాలయింది.

ప్రేమాగీమా అంటూ ఈనాటి కుర్రకారులా పిచ్చివేషాలేమీ వేయకుండా బుద్ధిమంతుడిలా తల్లిదండ్రులు కుదిర్చిన అమ్మాయినే పెళ్ళాడాడు.

పెళ్ళికిముందు నలుగురితో ఎంతో కలివిడిగా, హుషారుగాఉండే రామారావు ఇప్పుడు ఎంతో స్తబ్దుగా మారిపోయాడు.

ఎదుటివాడు పదిమాటలు మాట్లాడితే దానికి ఒక్క ముక్కలో జవాబు చెప్పి ఆ సంభాషణ అక్కడితో ముగించేయటం మొదలెట్టాడు.

అతడి కొలీగ్స్‌మయిన మాకేం అర్థం కాలేదు.

ఈ విషయమై అతడితో జోకులేయబోయిన లింగమూర్తికి అవమానం ఎదురైంది. దాంతో ఈ పజిల్‌ను ఎలాగయినా సాల్వ్‌చేయాలన్న పట్టుదల నాలో పెరిగింది.

ఓ రోజు సెక్షన్‌లో ఎవరూలేని సమయంచూసి నెమ్మదిగా రామారావును కదిలించాను. "ఏంగురూ? మీ ఆవిడకు ఏమయినా విశేషమా?" అంటూ.

"అనవసర విషయాల్లో తలదూర్చొద్దు" అంటూ విసురుగా కుర్చీలోంచిలేచి బయటకు వెళ్ళిపోయాడు కోపంగా.

చిన్నబోయిన నా ముఖాన్ని ఎవరూ గమనించకపోవడంతో తొందర్లోనే నన్ను నేను సంబాళించు కోగలిగాను.

ఆ తరువాత ఆ విషయమే పూర్తిగా మర్చిపోయాను.

ఆ రోజు ఆఫీసుకు వచ్చిన రామారావును చూసి ఆశ్చర్యపోయాను.

రేగిన జుట్టు, పెరిగిన గెడ్డం, ఎర్రటి కళ్ళు,



అక్కడక్కడా చిరిగిఉన్న చొక్కా - ఇదీ అతడి అవతారం.

ఇదివరకు జరిగిన అవమానం గుర్తొచ్చి అతణ్ణి పలుకరించడానికి భయపడ్డాను.

లంచ్‌టైంలో అందరూ కేంటీన్‌కేసి బయల్దేరారు.' ఉన్నట్టుండి రామారావు నా దగ్గరగావచ్చి "గురువుగారూ! అలా ఆనంద్ కేఫ్‌కెళ్ళి వద్దాం, రండి!" అన్నాడు.

మాట్లాడుదామని నోరు తెరువబోతున్నంతలో "ప్లీజ్! మీకో విషయం చెప్పాలి రండి!" అన్నాడు దీనంగా చూస్తూ.

మారుమాటాడకుండా అతడితోకూడా వెళ్ళాను మౌనంగా.

హొటల్లో కూర్చున్నాక రెండు దోసెలకు ఆర్డరిచ్చాడు రామారావు.

సర్వర్ టిఫిన్ తెచ్చేంతలో— "నా వేషం చూస్తే మీకు ఆశ్చర్యంగా ఉందికదూ?" అన్నాడు ఉపోద్ఘాతంగా.

అవునన్నట్లు తలూపాను.

"ఏం చెప్పమంటారు నా బాధ...? మా ఆవిడ లక్కీనెంబరు "ఏడు" అందుకని నా పెళ్ళయిన ఏడురోజులకు శోభనం ఏర్పాటయింది. శోభనం గదిలోకొచ్చిన ఏడు గంటల తరువాతగానీ ఆవిణ్ణి ముట్టుకోలేకపోయాను. ఏడో నెలలోకానీ కాపురానికి రాలేదు మా ఆవిడ. మేం అద్దెకున్న యింటి నెంబర్ మొత్తం కలిపితే వచ్చే సంఖ్య ఏడు. ఎక్కడికన్నా బయల్దేరాలంటే ఆరు బస్సులు వదిలిపెట్టి ఏడవబస్సులోనే ఎక్కాలి. రోజూ రాత్రి ఏడుగంటలకు పడుకొని ఉదయం ఏడుగంటలకు లేవాలి. ప్రతినెల ఏడవతేదీనే యింటికి కావాల్సిన సరకులన్నీ తేవాలి. ఇలా ఏడు సంఖ్య మా ఆవిడద్వారా నన్ను పట్టి పీడిస్తోంది"

"భలేవాడివే! ఈ ఛాదస్తం వదిలించలేవా?"

"ఎలా....? ఆఖరికి నా వంటిమీదున్న చొక్కా చూశారా? ఆరు చిరుగులతో ఉంది. ఏడవచిరుగు పడితేనేకానీ వేరే చొక్కా వేసుకోవడానికి వీల్లేదంది మా ఆవిడ...!"

నాకు నోటమాట పెగల్లేదు!

ఉన్నట్లుండి టైం చూసుకొన్న రామారావ్,

"గత ఏడురోజులుగా ప్రదర్శించబడుతున్న "ఛాదస్తపు భార్య" సినిమాకు మా ఆవిడని తీసుకెళ్లాలి. వస్తాగురూ!" అంటూ పరుగెత్తాడు, ఏడు రూపాయల బిల్లు నాకు వదిలేసి.

– –కె. హరిబాబు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 220728.
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482

# పరీక్షల సమయమా?
# కష్టపడి చదివే సమయం...



పూర్తిగా ఆరోగ్యంగా ఉండాల్సిన సమయం,
**కాంప్లాన్**
తీసుకోవలసిన సమయం.

**కేవలం కాంప్లాన్®లోనే అతనికి అవసరమయ్యే అధిక పోషణనిచ్చే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.**

పిల్లలూ బాగా ఆరోగ్యంగా ఉండటం అవసరం, అది మరి వాళ్ళు పరీక్షలకి చదువుతూన్నప్పుడు మరీ అవసరం. అందుకే మరి తల్లులకు తెలుసు పరీక్షల సమయం అంటే కాంప్లాన్ తీసుకోవలసిన సమయం అని.

ప్రోటీన్లు, హుటా హుటీగా పెరుగుదలకు తోడుపడే పోషక పదార్థాలు. కాంప్లాన్ వాళ్ళకి సర్వోత్తమమైన ప్రోటీన్లతో బాటే 22 అత్యావశ్యకమైన యితర పోషక పదార్థాలు యిస్తుంది—పెరిగే వయస్సులోని పిల్లలకి యివి అవసరం అవుతాయి.

గుర్తుంచుకోండి. కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సుచేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం.

కాంప్లాన్, చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమ పువ్వు, స్ట్రాబెరీ సువాసనంలోనూ, ప్లెయిన్ (సాదా)గా కూడానూ దొరుకుతుంది.




**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

B84.GLC.11 Tel.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/ HD /402

బాంబినో ఒక అద్భుతమైన
వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో
అధునాతన ఇటాలియన్
యంత్రములతో తయారు
చేయబడినది. మిక్కిలి ప్రొటీన్లు
కలిగి యుండి కొవ్వు పదార్థము
లేకుండుటయే బాంబినో విశిష్టత
వండినప్పుడు కాని, తరువాత కాని,
ముద్దగా కాక పోవుటయే బాంబినో
ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో
ఎన్నో రకములైన నోరూరించే
వంటకాలు, ఫలహారాలు తయారు
చేయవచ్చును. ఇంకా బాంబినోతో
ఎంతో పొదుపు కూడా. నేడే వాడి
చూడండి. మీకే తెలుస్తుంది.



బాంబినో ఉప్మా :
బాంబినోను నేతిలో వేయించి ప్రక్కన
పెట్టుకోండి. బాణలిలో 2 చంచాల
నూనె వేసి కాచండి. దానిలో ఆవాలు,
కరివేపాకు, పచ్చిమిర్చి, ఎండుమిర్చి
వేసి అరనిమిషం వేయించండి.
తర్వాత ఉల్లిపాయ ముక్కలు వేసి
ముదరరంగు వచ్చేంత వరకు
వేయించండి. తర్వాత వేడినీళ్ళు పోసి,
బాంబినోను, ఉప్పును కలపండి.
బాంబినో ఉడికేంతవరకు కలిపి మూత
పెట్టండి. తర్వాత రుచికి నిమ్మకాయ
రసం, కొత్తిమీరి కలిపి వేడివేడిగా
తీసుకోండి.




IS 1485

బాంబినో వంటల విధానం తెలిపే
పుస్తకం కొరకు వ్రాయండి.

జయ ఫుడ్స్ ఇండస్ట్రీస్
ప్రైవేట్ లిమిటెడ్
15-4-188, ఉస్మాన్ షాహి,
గౌలిగూడ, హైదరాబాద్ - 500 012.

బాంబినో
వెర్మిసెల్లిని






తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి

250 గ్రా. మరియు 500 గ్రా. ప్యాకెట్లలో లభించును.